# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2006 56 రూ. 10

* విశాఖ స్టీల్ ప్లాంట్ - అభివృద్ధి పథకమా ? అభివృద్ధా ?
* ప్రపంచీకరణ : వ్యవసాయ సంక్షోభం - తెలంగాణ
* మానవ వనరుల నిర్వహణ - నేపథ్యం
* పాపాల భైరవుడికి స్వాగత సత్కారాలా ?
* అడవులు - రాజ్యాంగయంత్రం - ఆదివాసులు
* కాంగ్రెస్ ప్లీనరీ - రాజవంశ భజన !

# ఇప్పుడు మార్కెట్‌లో ఉంది!




ప్రపంచ బ్యాంక్ వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు పేద దేశాల అవసరాలు పెంచి, కొత్త అవసరాలు సృష్టించి ఆ అవసరాలు తీర్చుకునేందుకు ఇబ్బడిముబ్బడిగా అప్పులు ఇచ్చే కుట్ర, బహుళ జాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చేందుకు ఉద్దేశించిన ఓ అంతర్జాతీయ కుట్ర ఇప్పుడు బట్టబయలైంది. 'ఎకనామిక్ హిట్ మాన్' అనే ఆర్థిక దళారీలను నియమించి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభుత్వాధినేతలను ప్రలోభపెట్టి, ఆ దేశాలను అమెరికన్ సామ్రాజ్య వాదానికి బంట్లుగా మార్చేసిన ఈ కుట్ర గుట్టు విప్పారు జాన్ పెర్కిన్స్ - స్వయంగా ఎకనామిక్ హిట్ మాన్‌గా పనిచేసి ఇప్పుడు చేతికంటిన సామాన్యుల రక్తాన్ని పశ్చాత్తాపంతో కడుక్కోవాలనుకుంటున్న పెర్కిన్స్ అంతరంగ కథనమే ఈ సంచలనాత్మకమైన పుస్తకం.

## పుస్తక పరిచయ సభ

**శనివారం మార్చ్ 4, 2006, సాయంత్రం 6 గంటలకు, సుందరయ్య విజ్ఞాన కేంద్రం మినీ హాల్**

సభాధ్యక్షులు : **శ్రీ కె.ఆర్. చౌదరి**

ఆవిష్కర్త : **శ్రీ వి. హనుమంతరావు**

చీఫ్ ఎడిటర్ - వీక్షణం మాసపత్రిక

వక్తలు

**శ్రీ సురవరం సుధాకర్‌రెడ్డి**, ఎం.పి. - సిపిఐ

**శ్రీ బి.వి. రాఘవులు**, రాష్ట్ర కార్యదర్శి సి.పి.ఐ. (ఎం)

**శ్రీ ఎన్. వేణుగోపాల్**, డైరెక్టర్, సి.డి.ఆర్.సి.

---

**అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లోనూ దొరుకుతుంది.**

**ఎం.ఓ., లేదా డి.డి. క్రింది అడ్రస్‌కు పంపి మీ కాపీని పొందవచ్చు.**

---



వీక్షణం పబ్లికేషన్స్

3-6-394, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్-500 029. ఫోన్-ఫ్యాక్స్: 040-5584 3495

సలహా మండలి:
ప్రొ॥ ఆర్.వి.ఆర్.చంద్రశేఖరరావు
ప్రొ॥ వకుళాభరణం రామకృష్ణ
ప్రొ॥ చక్రధరరావు
కాత్యాయని
బి.సాంబశివరాజు

గౌరవ సంపాదకులు:
ఎ.బి.కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు:
వి. హనుమంతరావు
వర్కింగ్ ఎడిటర్:
ఎన్. వేణుగోపాల్

వీక్షణం
ఆర్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

56 మార్చ్ 2006

# మార్పు లేదని చూపిన బడ్జెట్

ఫిబ్రవరి 21న రాష్ట్ర ఆర్థిక శాఖ మంత్రి కొణిజేటి రోశయ్య శాసనసభలో ప్రవేశపెట్టిన 2006-07 రాష్ట్ర బడ్జెట్ మళ్లీ రాష్ట్రంలో బహుళజాతి సంస్థల పాలన కొనసాగుతున్నదని రుజువు చేసింది. తెలుగుదేశం పాలనా కాలంలో ఏ ప్రపంచబ్యాంకు నిర్దేశిత విధానాలను కాంగ్రెస్ పార్టీ, ముఖ్యంగా అప్పటి ప్రతిపక్ష నాయకుడు, ఇప్పటి ముఖ్యమంత్రి డా. వై ఎస్ రాజశేఖర రెడ్డి తీవ్రంగా విమర్శించారో అవే ప్రపంచబ్యాంకు విధానాలు కొనసాగుతున్నాయని ఈ బడ్జెట్ స్పష్టంగా తెలియజేస్తోంది. బడ్జెట్‌ను, పర్యవసానాలను వివరంగా పరిశీలించడానికి ఇక్కడ స్థలం సరిపోదు గాని కనీసం మూడు ప్రధానాంశాలను పరిశీలించాల్సి ఉంది: సాంఘిక సంక్షేమ రంగాల కేటాయింపులు, మౌలిక సాధన సంపత్తి కేటాయింపులు, రుణభారం అనే ఈ మూడు అంశాలు బడ్జెట్ అనుసరించే తాత్విక దృక్పథాన్ని తేటతెల్లం చేస్తాయి.

బడ్జెట్ లోటు తగ్గించుకోవలసిన అవసరం అనే పేరుతో సాంఘిక సంక్షేమ రంగాల కేటాయింపులను తగ్గిస్తూ పోవాలని ప్రపంచబ్యాంకు ఆదేశిస్తూ ఉంటుంది. తమకు ముడుపులు అందే రంగాల కేటాయింపులు గాని, తమకు ప్రజల నుంచి రక్షణ ఇచ్చే భద్రతా సౌకర్యాల కేటాయింపులు గాని తగ్గక పోతే చాలునని, ప్రజా జీవన రంగాల కేటాయింపులపై ఎంత కోత విధించినా ఫరవాలేదని స్థానిక పాలకులు అనుకుంటారు. ప్రపంచబ్యాంకు దృక్పథాన్ని అనుసరిస్తూ 2006-07 ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ సంక్షేమ రంగాల వ్యయాన్ని తగ్గించింది. అంకెల్లో పెరిగినట్టు కనబడినా, మొత్తంతో పోల్చినప్పుడు నిష్పత్తిలో తగ్గడమో, యథాతథంగా ఉండడమో, ఏ కొంచెమో పెరిగినా అది ద్రవ్యోల్బణం రేటుకు సరిపోయి నిజమైన పెరుగుదల లేకపోవడం జరుగుతోంది.

ఇక మౌలిక సాధన సంపత్తి పెరగకుండా, అంటే మౌలిక సంపత్తిని కల్పించే దిశగా కేటాయింపులు, పెట్టుబడులు పెరగకుండా ఒక ఆర్థిక వ్యవస్థకు సుస్థిర, దీర్ఘకాలిక అభివృద్ధి సాధ్యం కాదు. మౌలిక సాధన సంపత్తిలో భౌతిక, ఆర్థిక, సామాజిక రంగాలలోని ఎన్నో అంశాలు ఇమిడి ఉంటాయి. ప్రపంచబ్యాంకు మాత్రం కేవలం బహుళ జాతి సంస్థలకు నిర్మాణ కాంట్రాక్టులు దొరికే, ఆ సంస్థల యంత్ర పరికరాలు అమ్ముడయ్యే, ఆ సంస్థల సలహా సేవలు అమ్ముడయ్యే మౌలిక సౌకర్యాల కల్పన మీదనే దృష్టి పెడుతుంది గాని ప్రజా జీవనాన్ని అభివృద్ధి చేసే మౌలిక సౌకర్యాల మీద దృష్టి పెట్టదు. సరిగ్గా 2006-07 బడ్జెట్ కూడ మౌలిక సౌకర్యాల కల్పన కోసం ఎక్కువ కేటాయింపులు చేసినట్టు కనబడినప్పటికీ, ఆ కేటాయింపులను నిశితంగా విడదీసి విశ్లేషిస్తే ఆ కేటాయింపులలో అంతర్జాతీయ నిర్మాణ, సలహా, యంత్ర పరికరాల సంస్థలకు, ద్రవ్య సంస్థలకు, వాటి దేశీయ మిలాఖత్ దార్లకు లాభం చేకూర్చేవే తప్ప ప్రజా జీవనాన్ని మెరుగు పరిచేవి కావు.

మూడో అంశంగా, పేద దేశాల ప్రభుత్వాలు, సామాజిక వ్యవస్థలు నానాటికీ రుణభారంలో మగ్గిపోవాలని, ఆ సామాజిక వ్యవస్థలలో రూపొందే సంపదలో అధిక భాగం విదేశీ రుణ సంస్థలకు అసలు, వడ్డీ చెల్లింపులుగా తరలి పోవాలని ప్రపంచబ్యాంకు ఆశిస్తుంది. అందుకే అవసరమున్నా లేకపోయినా రుణాలు తీసుకునేలా, కొన్ని సంవత్సరాల తర్వాత పాత అప్పులు తీర్చేందుకు కొత్త అప్పులు తీసుకునే రుణాల ఊబిలో కూరుకు పోయేలా చేస్తుంది. 2006-07 రాష్ట్ర బడ్జెట్ ఈ ధోరణికి నిలువెత్తు నిదర్శనంగా నిలుస్తుంది. ఈ బడ్జెట్‌లో రు.8196.67 కోట్లు పాత రుణాల అసలు, వడ్డీల చెల్లింపులకే పోతోంది. అది మొత్తం రెవెన్యూ వసూళ్లలో 18 శాతం. మొత్తంగా ప్రభుత్వం ఈ సంవత్సరం సంపాదించిన రుణాలు రు.8186.96 కోట్లు. ఈ సంవత్సరంతో మొత్తం ప్రభుత్వంపై ఉన్న రుణభారం రు.82,719.97 కోట్లు. ఈ సంవత్సరం సంపాదించిన రుణాలలో ప్రభుత్వ సంస్థల నుంచి, చిన్న మొత్తాల పొదుపు సంస్థ, ప్రావిడెంట్ ఫండ్ వంటి సంస్థల నుంచి తీసుకున్న రుణాలను మినహాయిస్తే నిజంగా రాష్ట్రంలోకి ప్రవహించినది రు.1181.88 కోట్లు మాత్రమే. ఈ అంకెలన్నీ రాష్ట్రం అప్పుల విష వలయంలో, సుడిగుండంలో మునిగి ఉందని చూపుతున్నాయి.

మొత్తంగా చెప్పాలంటే రాష్ట్రం 1995-2004 మధ్య చంద్రబాబునాయుడు పాలనాకాలంలో ఎట్లా ఉన్నదో, ప్రస్తుతం కూడ అట్లాగే ఉన్నదని ఈ బడ్జెట్ తెలియజెపుతోంది. ❑

## లోపలి పేజీల్లో...

### విశ్లేషణ



ఓ వైపు ఒరిస్సాలో 'అభివృద్ధి' ప్రాజెక్టులకు వ్యతిరేకంగా ఉద్యమాలు చెలరేగుతున్న కాలంలోనే ఇటు ప్రక్కన ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలు 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అని నినదించారు.

**'విశాఖ స్టీలు ప్లాంట్: అభివృద్ధి పథకమా? అభివృద్ధా?**

**- ముదునూరి భారతి**

...7

### వ్యాఖ్య



రాష్ట్ర రాజధానిలో అట్టహాసంగా జరిగిన కాంగ్రెస్ ప్లీనరీలో రాష్ట్రానికి సంబంధించిన తెలంగాణ, నక్సలిజం, ముస్లిం రిజర్వేషన్ల వంటి ప్రాముఖ్యత కలిగిన అంశాల గురించిన ఎలాంటి చర్చా జరగలేదు.

**అసలు సమస్యలు వదలి, రాజవంశ భజన!**

**- ఎస్. జనార్దన్**

...21

### పరిశోధనా ఫలాలు

అమెరికాలోని యూనివర్సిటీ ఆఫ్ మసాచుసెట్స్ అమ్‌హర్స్ట్ అర్థశాస్త్ర శాఖలో పిహెచ్‌డి కొరకు సాగిన ఈ పరిశోధనాపత్రం ప్రపంచీకరణ వల్ల వ్యవసాయ రంగంలో ఎలాంటి మార్పులు వచ్చాయో తెలంగాణను కేంద్రంగా చేసుకుని వివరించడానికి ప్రయత్నించింది.

**ప్రపంచీకరణ : వ్యవసాయ సంక్షోభం - తెలంగాణ అనుభవం**

**- వకుళాభరణం వంశీచరణ్**

...31






**వీక్షణం**

ఆర్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 55843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, ఆజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : కొణతం దిలీప్
డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై.రామచంద్రం
కంపోజింగ్ : ఎస్.కిషోర్‌కుమార్
లే ఔట్ : పి.అనల

## పాఠకుల వీక్షణం

'ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ అసమానతలు' అంటూ డా.యిమ్మానేని సత్యసుందరం రాసిన వ్యాసం (వీక్షణం ఫిబ్రవరి 2006) అంకెల గారడీతో, తప్పుల తడకగా, అసలు విషయాల్ని మరుగున పరుస్తూ సాగింది. "ప్రతి దేశంలోనూ ప్రాంతీయ అసమానతలు ఉన్నాయి. భారతదేశం లాంటి అతిపెద్ద దేశాలలో ఈ సమస్య తీవ్ర రూపం దాల్చింది. కొన్ని రాష్ట్రాలలో వెనుకబడిన ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడుటకు ఆందోళన చేస్తున్నాయి. అయితే, ప్రత్యేక రాష్ట్రాలు వెనుకబడిన తనానికి పరిష్కారం మాత్రం కాదు" అంటూ రచయిత తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగానే చెప్పుకున్నారు. వివరణ గాని, వ్యాఖ్యానం గాని లేకుండా మూడు ప్రాంతాలకు సంబంధించిన కాకి లెక్కలు ఏవో ఇస్తూ పోయారు. తెలంగాణలో అక్షరాస్యత రాష్ట్ర సగటు కన్న ఎందుకు తక్కువ ఉందో, అందులో ప్రభుత్వం విద్యా సౌకర్యాలు కల్పించక పోయిన ఫలితమెంతో చెప్పలేదు. జనాభాలో 40.56 శాతం, విస్తీర్ణంలో 41.75 శాతం ఉన్న తెలంగాణకు కేటాయింపులలో అంత దక్కిందా లేదా చూపలేదు. గోదావరి, కృష్ణ రెండు తెలంగాణలోనే ఎక్కువ భాగం ప్రవహిస్తుండగా, ఆంధ్రప్రదేశ్ ఏర్పడి 50 సంవత్సరాలు గడిచిన తర్వాత కూడ తెలంగాణలో నీటి పారుదల సౌకర్యాలున్న భూమి 34.7 శాతం ఉండడానికి, కోస్తా ఆంధ్రలో 52.8 శాతం ఉండడానికి కారణాలేమిటో చెప్పలేదు. ఇట్లా ప్రతిచోట కారణాలు చెప్పకుండా అంకెల గోడలు కడుతూ పోయారు. ఆ గోడ కట్టడం అయిపోయినాక ప్రత్యేక తెలంగాణ? అని సబ్ హెడ్డింగ్ పెట్టి ప్రత్యేక రాష్ట్రం కోరటం అసమంజసం అని అసలు సంగతి చెప్పుకొచ్చారు. ఇంత అవకతవక వ్యాసం, ఒక ప్రాంత ప్రజల అభివృద్ధిని వ్యతిరేకించే అప్రజాస్వామిక వ్యాసం 'వీక్షణం'లో ఎట్లా అచ్చువేశారో అర్థం కావడం లేదు. 'వీక్షణం'ను ప్రజాపక్ష అభివృద్ధి ఆలోచనల ప్రజాస్వామిక వేదికగా నిలిపి ఉంచుతారని ఆశిస్తున్నాము.

**- బి. ఎల్లారెడ్డి**
ఆలేరు

వీక్షణం (సమీక్ష) ప్రారంభ సంచిక నుంచి శ్రద్ధగా చదువుతున్నాను. అవకాశం వున్నకాడికి మిత్రులచేత చదివిస్తున్నాను. నిజమైన ప్రజాస్వామ్య వేదికగా రూపుదిద్దుకుంటున్న క్రమం - అభినందనీయం.

**- డా॥ మానేపల్లి**
ఎలమంచిలి, విశాఖ జిల్లా

వీక్షణం ఫిబ్రవరి 2006 సంచికలో నల్గొండ యురేనియం ప్రాజెక్టుపై వచ్చిన 'ప్రజాస్వామ్యంలో ప్రజల అభిప్రాయానికి విలువెంత?' వ్యాసం వాస్తవ పరిస్థితిని మన కళ్ళముందుంచుతుంది. ఇట్లాంటి పర్యావరణ విధ్వంస ప్రాజెక్టులకు పాలకులు అనుమతివ్వడం ఖండించదగ్గది.

**- యాదగిరి**
హైదరాబాద్

సుమారు ఆరు నెలల క్రితం 'వీక్షణం' అనే తెలుగు మాస పత్రికను చూశాను. ఇంచుమించుగా మనకున్న పత్రికలన్నీ కథలు, కవితలు, సినిమా కబుర్లు, వ్యాసాలు అన్నిటినీ ప్రచురిస్తాయి. అయితే, ఈ 'వీక్షణం' మాత్రం కేవలం ఆర్థిక, సామాజిక విషయాలకే పరిమితం. ఈ విధంగా తెలుగులో ఇదొక విలక్షణమైన పత్రిక. చాలా సీరియస్ పత్రిక కూడా. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినంత వరకు ఎన్నో ఆర్థిక, సాంఘిక, రాజకీయ గణాంకాలు ఈ పత్రికలో నిత్యం ప్రచురిస్తున్నారు. నాకు తెలిసినంత వరకు తెలుగులో ఇలాంటి పత్రిక మరొకటిలేదనిపిస్తోంది. ఈ పత్రిక సంపాదకులు, వ్యాస రచయితలతో మనం ఏకీభవించినా లేకపోయినా, వారి విషయ అవగాహనను, విశ్లేషణా శక్తిని, ముఖ్యంగా ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితుల్ని ఈ పత్రికా ముఖంగా చర్చకు తీసుకురావడానికి చేస్తున్న కృషిని అభినందించక తప్పదు.

తెలుగు వాళ్ళకి సినిమాల తర్వాత రాజకీయాలు అత్యంత ప్రీతిపాత్రమైనవని నా అభిప్రాయం. ముఖ్యంగా సాంఘిక, రాజకీయ విషయాలపై చర్చలు. చెరువుగట్టు మీదా, రామాలయం అరుగు మీదా, రచ్చబండ (భౌతిక, ఎలక్ట్రానిక్ వెరైటీలు రెండూను) మీదా, పార్టీలలోనూ, ఇందుగలిగి అందులేవనకుండా అన్ని చోట్లా, అన్ని వేళలా నిత్య పారాయణంగా ఈ చర్చలు సాగుతూనే ఉంటాయి. ఈ కబుర్లకి కావలసిన విషయ పరిజ్ఞానమంతా కర్ణాకర్ణిగా విన్నది కొంత (గాలి కబుర్లు, పుకార్లు కూడా ఈ కోవకే చెందుతాయి మరి), వార్తాపత్రికల హెడ్‌లైన్లలో చూసింది కొంత (షరా: వీటిలో గాలికబుర్లు, పుకార్లు ఉండవని భ్రమపడరాదు), ఊహాగానాలు మరికొంత అంటే అతిశయోక్తి కాదేమో. ఈ ఆర్థిక, సాంఘిక, రాజకీయ చర్చలకు తగినంత అసలు సిసలైన ముడిసరుకు ఈ 'వీక్షణం' పత్రికలో లభిస్తుందని నా అభిప్రాయం. (అసలు విషయాలను పక్కన బెట్టి ఊహాగానాల మీద చర్చించడమే కమ్మగా ఉంటుందంటే నేనేమీ చెప్పలేననుకోండి!) ఈ పత్రిక సంపాదకులు, 'వీక్షణంలో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. వీక్షణంను నిజమైన ప్రజాపక్ష సామాజిక, ఆర్థిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్ని రకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది' అని ప్రకటించడంలో ఉన్న స్ఫూర్తిని గ్రహిస్తే, సదవగాహనతో జరిపే చర్చలకు ఇలాంటి సీరియస్ వేదిక ఎంతో ఉపయోగకరంగా ఉంటుందనుకుంటాను.

**- కృష్ణారావు మద్దిపాటి,**
బ్లూమ్‌ఫీల్డ్ హిల్స్, అమెరికా
(రచ్చబండ- యాహూ గ్రూప్‌కు రాసిన ఈమెయిల్ )

## తెలంగాణ వైతాళికుడు
## వట్టికోట ఆళ్వారుస్వామి జీవితచరిత్ర




తెలంగాణ వైతాళికులలో ఒకరు, విభిన్న జీవనరంగాలలో అపారమైన కృషి చేసి నలభై ఆరు సంవత్సరాల జీవితకాలంలోనే అసాధారణ విజయాలు సాధించిన మేధావి, ప్రజల మనిషి వట్టికోట ఆళ్వారుస్వామి (1915-1961) జీవన రేఖాచిత్రం ఇది.

ప్రతులకు :
ఎన్. వేణుగోపాల్
మైత్రీ రెసిడెన్సీ
3-6-394, స్ట్రీట్ నెం.3
హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029.
లేదా
అన్ని ప్రముఖ పుస్తకాలషాపులు

ప్రచురణ :
కవిలె, తెలంగాణ రిసర్చ్ అండ్ రిఫరల్ సెంటర్
14-11-1130
బీర్బన్‌బాగ్
హైదరాబాద్ - 500 012
సెల్ : 98492 20321

**వెల : 20 రూపాయలు**

## ఆ రోజు రాత్రి ఏం జరిగిందంటే ......

## It was Five Past Midnight in Bhopal
### By Dominique Lapierre
### and
### Javier Moro

డిసెంబర్ 2-3 1984న యూనియన్ కార్బైడ్ భోపాల్ కర్మాగారంలో వెలువడిన విషవాయువు వల్ల మరణించిన వేలాది ప్రజల సహాయార్థం 2001లో ప్రచురించిన వ్యధార్థ జీవుల యధార్థ కథనానికి తెలుగు స్వేచ్ఛానువాదం శ్రమజీవి ప్రచురణగా త్వరలో వెలువడుతోంది. ప్రచురణకు ముందే తమ కాపీలను రిజర్వు చేసుకునేవారు మనియార్డర్లను పంపవలసిన చిరునామా-




ఎడిటర్ - పబ్లిషర్
**బి. ఎస్. ఎ. సత్యనారాయణ, అడ్వకేట్**
శ్రమజీవి
ఇ.నె. 2-2-1121/3ఇ, నల్లకుంట
హైదరాబాద్ - 500 044
**ప్రచురణకు ముందు వెల రు.40**
**ప్రచురణ తరువాత వెల రు.80**




Statement about ownership and other particulars of newspaper VEEKSHANAM as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | |
|---|---|
| 1. Place of Publication: | Hyderabad |
| 2. Periodicity of its publication: | Monthly (applied) |
| 3. Printer's name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | Mythri Residency, 3-6-394, Street No.3, Himayatnagar Hyderabad - 500029 |
| 4. Publisher's name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | Same as above |
| 5. Editor's name: | V Hanumantha Rao |
| Whether citizen of India: | Yes |
| Address: | Same as above |
| 6. Names and addresses of individuals who own the newspaper: | Not applicable |

I, V Hanumantha Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dated March 1, 2006

*(V Hanumantha Rao)*
Signature of the Publisher

# 'విశాఖ స్టీలు ప్లాంట్: అభివృద్ధి పథకమా? అభివృద్ధా?

ముదునూరి భారతి

విశ్లేషణ

మేము ఉద్యోగరీత్యా ఒరిస్సాలో సంబల్‌పూర్ జిల్లాలో బుర్లాలో నివసించే సమయంలో, హిరాకుడ్ డ్యాం పక్కనే మా క్వార్టర్స్ ఉండటంతో ఇది ప్రపంచంలో మట్టితో కట్టిన అతి పెద్ద డ్యాం అనీ, దాని వలన అనేక ఉపయోగాలు ఉన్నాయనీ చెబుతున్నా కూడా, డ్యాంని వ్యతిరేకిస్తూ బలమైన ప్రజాఉద్యమం దాని నిర్మాణ సమయంలో వచ్చిందని వినడంతో ఆ ఉద్యమం రావటానికి కారణాలు, దాని నిర్మాణం కారణంగా నిర్వాసితులైన కుటుంబాల జీవనశైలిలో వచ్చిన మార్పుల మీద ఆసక్తి కలిగింది. ఇదే కాకుండా ఒరిస్సాలో హిరాకుడ్ డ్యాంకి దగ్గరలోనే ఉన్న రెంగాలి డ్యాంకి కూడా వ్యతిరేకంగా ప్రజాఉద్యమం, పరిశ్రమల రంగం, మైనింగ్‌కి సంబంధించి వస్తున్న అనేక అభివృద్ధి పథకాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు కొనసాగుతూనే ఉన్నాయి. ఈ సందర్భంలో ఇనిస్టిట్యూట్ ఫర్ స్టడీ ఆఫ్ సొసైటీ అండ్ కల్చర్ (ఐఎస్ఎస్‌సి) అనే సంస్థ ఆధ్వర్యంలో ఒరిస్సా నేపథ్యంలో 'అభివృద్ధి - నిర్వాసం' అనే అంశం మీద 1987 సంవత్సరంలో బుర్లాలో ఒక జాతీయ సదస్సు నిర్వహించటం జరిగింది. మూడు రోజుల పాటు జరిగిన ఈ సదస్సుకి ఒరిస్సాలోని వివిధ ప్రాంతాల నుండే కాక ఢిల్లీ, కలకత్తా, హైదరాబాదుల నుండి మేధావులు పాల్గొని అభివృద్ధి సమస్య యొక్క పరిధిని విస్తృతం చేయడం జరిగింది. బహుశా అభివృద్ధి పథకాల ద్వారా నిర్వాసితులైన కుటుంబాల స్థితిగతుల అవగాహన కొరకు సర్వే చేయడం, వాటి ఫలితాలను విశ్లేషించే ఉద్దేశ్యంతో ఒక జాతీయ సదస్సుని నిర్వహించటం కూడా దేశంలో మొట్టమొదటి ప్రయత్నంగా చెప్పుకోవచ్చు.

ఈ సదస్సు ప్రాముఖ్యత అభివృద్ధి పథకాల ప్రభావం వలన సృష్టించబడ్డ నిర్వాసితులను డ్యాం పరిధిలో కుదించకుండా పరిశ్రమలు మాత్రమే కాక భాష, సాహిత్యం, కళలు, సాంస్కృతిక రంగాలకు కూడా విస్తరింపజేసి అభివృద్ధిని, నిర్వాసితులపై దాని ప్రభావాన్ని అవగాహన చేసుకునే ప్రయత్నం జరిగింది. దేశంలో మొట్టమొదటిసారిగా అభివృద్ధి వ్యతిరేక ప్రజా ఉద్యమాలు ఒరిస్సాలోనే హిరాకుడ్ డ్యాం, రూర్‌కెలా స్టీలు ఫ్యాక్టరీలకు వ్యతిరేకంగా వచ్చాయి. దీంతో ఆగిపోకుండా సంబల్‌పూర్ జిల్లాలోనే బ్రహ్మజి నది మీద కట్టిన రెంగాలి డ్యాం వ్యతిరేక ఉద్యమం, దీన్ని అణచివేసే ప్రయత్నంలో మొట్టమొదటిసారిగా దేశంలో ఉద్యమకారుల మీద పోలీసులు కాల్పులు జరపడం, పరిశ్రమల రంగంలో అల్యూమినియం తయారీకి చెందిన బాల్కో, నాల్కోలకు వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమాల తీవ్రత సదస్సులో చర్చనీయాంశాలయ్యాయి. ఒరిస్సాలోనే కాకుండా దేశంలో కోయల్‌కార్ డ్యాం, కలకత్తాలో జనుము పరిశ్రమలలో నిర్వాసిత ప్రజలు, వారి ఉద్యమాల ప్రభావం కూడ చర్చకు వచ్చాయి. ఈ సదస్సు జరిగిన తరువాతి కాలంలో అభివృద్ధిని గురించిన అధ్యయనాలలో అభివృద్ధి పథకాల ద్వారా పుట్టిన నిర్వాసిత ప్రజల జీవన విధానం, వారి పునరావాస పథకాలు కీలక పాత్ర వహించాయి. దీని ప్రభావం మూలంగా ఏ అభివృద్ధి పథకానికైనా లాభ-నష్టాల లెక్కల ద్వారా అంచనాలు తయారు చేసే క్రమంలో నష్టాల లెక్కలో పథక నిర్మాణానికి అయ్యే ఖర్చుతో పాటు నిర్వాసితులకు ఇచ్చే నష్టపరిహారం, పునరావాస పథకాల నిర్మాణానికయ్యే ఖర్చు కూడా దానిలో భాగమైపోయాయి. ఈ సదస్సులో ప్రముఖంగా ముందుకు వచ్చిన అంశం ఒరిస్సాలో అభివృద్ధి పథకాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు వస్తున్నాయనీ, నిర్వాసితులకు కొత్త నేపథ్యంలో పునర్ నిర్మాణం జరిగి దానిలో భాగమవక పోవడం అందుకు కారణమనీ గుర్తించటం జరిగింది.

మళ్లీ ఒరిస్సాని ఒకసారి గమనిస్తే దాని అభివృద్ధి పథకాల చరిత్ర హిరాకుడ్ వ్యతిరేక ప్రజా ఉద్యమంతో ముగిసిపోకుండా, బాలియాపాల్‌లోని డిఫెన్సుకి చెందిన మిసైల్ పథకానికి, చిలికా సరస్సు కార్పొరేటీకరణకి వ్యతిరేకంగా ఇలా ఎన్నో ఉద్యమాలు జరుగుతూనే ఉన్నాయి. 2006లో ప్రజా ఉద్యమాలకి పరాకాష్టగా రాష్ట్ర రాజధాని దగ్గరలోనే కళింగనగర్‌లో పారిశ్రామికీకరణలో భాగంగా వచ్చే ఉక్కు పరిశ్రమను వ్యతిరేకించిన ఆదివాసీ ఉద్యమకారుల మీద పోలీసులు జరిపిన కాల్పుల్లో పన్నెండు మంది గిరిజనుల మృతి, దానికి సానుభూతి వ్యక్తపరుస్తూ వివిధ ప్రజా సంఘాల ఆందోళనలు. ఇవన్నీ గమనిస్తే ఒరిస్సా చరిత్ర అంతా 'అభివృద్ధి' వ్యతిరేక ఉద్యమాల చరిత్రగా చూడవచ్చు.

ఒరిస్సా కంటే భిన్నంగా ఆంధ్రప్రదేశ్‌లో 1971లో విశాఖపట్టణంలో ఉక్కు కర్మాగారం మాకు కావాలి అనే ప్రజా ఉద్యమం జరిగింది. పక్కపక్కనే ఉన్న ఈ రెండు రాష్ట్రాలలో అభివృద్ధి పథకాలకు పూర్తిగా వ్యతిరేకంగా ఉండే ప్రజా స్పందన, ప్రజా ఉద్యమాలు ఎలా వచ్చాయి అనే మేధోపరమైన ఆసక్తితో విశాఖపట్టణంలో ఉక్కు కర్మాగార ఫలితంగా వచ్చిన నిర్వాసిత కాలనీలను పరిశీలించటం జరిగింది. ఐఎస్ఎస్‌సి ప్రోద్బలంతోనే ఈ సర్వే కూడా చేయడం జరిగింది.

70వ దశాబ్దంలో ఆంధ్ర రాష్ట్రంలో పరిశ్రమల రంగంలో ఒక బలమైన ప్రజా ఉద్యమం జరిగింది. అన్ని పరిశ్రమలకు మూల వనరు ఉక్కు అవడంతో ఒక ఉక్కు కర్మాగారం తమకు కూడా కావాలని రాష్ట్రంలోని ప్రజలు ఉద్యమించారు. 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అనే నినాదంతో ఈ ఉద్యమం బలపడి రాష్ట్ర ప్రజల మనోభావాలను రెచ్చగొట్టడంతో ఇది హింసాత్మకంగా కూడా

మారటం జరిగింది. దీనితో కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రజల కోరికను అంగీకరించి విశాఖలో ఉక్కు కర్మాగారం నిర్మించటానికి అనుమతించింది. విశాఖ ఉక్కు కర్మాగారం మన దేశంలో పబ్లిక్ రంగంలో కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్మించిన మొట్టమొదటి సముద్ర తీర ప్రాంత కర్మాగారం. దీనికి కావలసిన సాంకేతిక పరిజ్ఞానం రష్యా సహకారంతో లభించింది.

ఉక్కు కర్మాగార నిర్మాణానికి 8,500 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. మొదట దీని కెపాసిటీ సాలీనా పది మెట్రిక్ టన్నులుగా నిర్ధారించినప్పటికీ కర్మాగారం కట్టే క్రమంలో 3.211 మెట్రిక్ టన్నులకు కుదించి దానికి కావలసిన మౌలిక సదుపాయాలు సమకూర్చుకున్నారు. కర్మాగారానికి కావలసిన విద్యుచ్ఛక్తి సరఫరాలో అంతరాయం కలుగకుండా ఉండేటట్లుగా వారే 180 మెగావాట్ సామర్థ్యం ఉన్న క్యాప్టివ్ పవర్ ప్లాంట్ నిర్మించుకున్నారు. అదనంగా 130 మెగావాట్ విద్యుత్తు సరఫరాకి కావలసిన ప్రయత్నాలు చేసుకున్నారు. ఇప్పటికి అందుబాటులో ఉన్న మౌలిక సదుపాయాలతోనే 3.2 మెట్రిక్ టన్నుల నుండి 6 మెట్రిక్ టన్నులకు సాలీనా పెంచుకునే సదుపాయం కూడా ఉంది. కర్మాగార నిర్మాణానికి కావలసిన భూమి, మిగతా మౌలిక సదుపాయాలను ముందు చూపుతో అన్నట్లుగా మొదటి అంచనా ప్రకారం, అంటే సాలీనా 10 మెట్రిక్ టన్నుల ఉత్పత్తికి సరిపడా సేకరించారు. ఒక అంచనా ప్రకారం 23,000 ఎకరాల భూమి (ఇందులో 9,000 ప్రభుత్వానికి చెందిన భూమి) సేకరించారు. దీని వలన 28 గ్రామాలలో ఉండే 5511 కుటుంబాలు (21,000 మంది జనాభా) నిర్వాసితులయ్యారు. ఈ ప్రక్రియలో నిర్వాసితులైన వారి భూమి, ఇల్లు ఇంకా ఇతర ఆస్తులకు మార్కెట్ విలువ ఆధారంగా నష్టపరిహారమివ్వడం జరిగింది. మొదటి దశలో చాలా తక్కువగా ఉన్న నష్టపరిహారం కొంత పెంచి మెట్ట భూమికి ఎకరానికి రు.17,000, పల్లపు భూమికి రు.20,000 ఇవ్వడం జరిగింది. ఇంతే కాకుండా నిర్వాసిత కుటుంబాలకు కొత్త నేపథ్యంలో ఆరు కోట్ల రూపాయల ఖర్చుతో తొమ్మిది పునరావాస కాలనీలు ఏర్పరచి, అక్కడి స్థలాన్ని లెవల్ చేయడం, రోడ్లు, కరెంటు, మంచినీటి సదుపాయం లాంటి వసతులతో వాటిని నివాసయోగ్యం చేశారు. నిర్వాసిత గ్రామాల నుండి ప్రజలను ఈ తొమ్మిది కాలనీలకు తరలించారు. ప్రతి కుటుంబానికి ఇంటి స్థలం, ఇంటి నిర్మాణానికి ధనరూపేణ సహాయం, సబ్సిడి, రు.12,000 అప్పు, ఇందులో రు.2,300 సబ్సిడి ఇచ్చారు. అంతేకాకుండా ప్రతి కుటుంబానికి ఒక ఆర్ - కార్డు ఇచ్చారు. ఈ కార్డు ఆధారంగా నిర్వాసిత కుటుంబాలు ఉక్కు ఫ్యాక్టరీలో ఉద్యోగానికి అర్హులవుతారు. ఇలా ఇచ్చిన 15,300 ఆర్ - కార్డులలో 6,241 మంది మాత్రమే ఫ్యాక్టరీలో ఉద్యోగం సంపాదించుకోగలిగారు. అంటే సగానికంటే తక్కువ మందికే ఉద్యోగాలు వచ్చాయనీ, అది కూడా సగం మందికి తక్కువ వేతనముండే కళాసీ ఉద్యోగాలు అనే ఒక ఆరోపణ ఉంది. 1992 తరువాత కర్మాగారంలో ఖాళీలు లేకపోవడంతో ఈ ఉపాధి కూడ ఆగిపోయింది.

ఏ ప్రజా ఉద్యమమైనా ఒక రూపు తీసుకుని బలపడటానికి అవసరమైన కారణాలు పరిశీలిస్తే మొదటగా మనకు కనిపించేది అభివృద్ధికి సంబంధించిన భావజాలం. 'ప్రభుత్వ కార్యక్రమాలు, అభివృద్ధి - ఒక అవగాహన' అనే వ్యాసంలో నేను వివరించినట్లుగా స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ పార్టీ హయాంలో నెహ్రూ నేతృత్వంలో, మహలనోబిస్ దర్శకత్వంలో రూపొందించబడిన పంచవర్ష ప్రణాళికల ఆధారంగా దేశ ప్రగతికి ఒక లక్ష్యాన్ని, ఒక దిశని ప్రతిపాదించడం జరిగింది. నెహ్రూ అప్పటికే అభివృద్ధి చెందిన అమెరికా, రష్యా, ఇంగ్లాండ్ లాంటి దేశాల అభివృద్ధి నమూనాని అనుకరించే క్రమంలో అమెరికాలో కట్టినట్లుగా పెద్ద డ్యాంలు, రష్యాలో లాగా భారీ ఉక్కు కర్మాగారాలు పెడితే మనం కూడా అభివృద్ధి చెందవచ్చుననే భావన దీనికి మూలం. మన నేతృత్వానికున్న ఈ నమూనాని తిరిగి పరిశీలిస్తే 'అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి' సాధ్యమౌతుందనే భావజాలం దీనికి మూలం. దేశ ప్రగతికి వ్యవసాయ, పరిశ్రమ రంగాలు రెండూ అభివృద్ధి చెందాలనే ఉద్దేశ్యంతో భారీ వ్యయంతో కూడిన హిరాకుడ్ లాంటి పెద్ద డ్యాంలు వ్యవసాయ రంగ అభివృద్ధికి, పరిశ్రమల అభివృద్ధికి మూలమైన ఉక్కు తయారీకి కావలసిన భారీ ఉక్కు కర్మాగారాలు నిర్మించటం ఈ పథకంలో భాగం. వీటికి కావలసిన మౌలిక సదుపాయాలు సమాజపరంగా భూమి, విద్యుత్తు, నీరు, రవాణా సౌకర్యాలు కల్పించి వాటికి రాయితీలు ఇవ్వడంతో ఈ భావజాలం దేశంలో బాగా వ్యాపించింది. దీని ప్రభావం వలన అభివృద్ధి పథకాలే అభివృద్ధిగా గుర్తించటం కూడా జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు 'విజన్-2020'లో ప్రతిపాదించినట్లుగా ప్రపంచంలో ఎక్కడ మంచి ఉన్నా అది మనకు కావాలనటం, ప్రస్తుత ముఖ్యమంత్రి చైనా వ్యవసాయ పద్ధతులు మనకు కావాలని ఉత్సాహపడటం ఈ భావజాల ప్రభావమే. పై దేశాలలో అభివృద్ధి చెందటానికి అవసరమైన జ్ఞానమంతా క్రోడీకరించబడిందనీ, దీనికి కావలసిన సాంకేతిక జ్ఞానం, పెట్టుబడి పేద దేశాలకు లేకపోవడంతో ప్రపంచ బ్యాంకు రుణసహాయం ద్వారా ఇది లభ్యమౌతుందని, ఈ క్రమంలో అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధిని సాధించవచ్చునని నమ్మకం దీనికి మూలం. మన రాష్ట్రంలో కాటన్ దొర కృష్ణా, గోదావరి నదుల మీద కట్టిన ఆనకట్టలు, వాటి ప్రభావం కూడా ఈ భావజాలానికి బలం చేకూర్చింది. ఈ భావజాలమే ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలకు ప్రేరణ కావటంతో, భారీ పరిశ్రమలతోనే అభివృద్ధి సాధ్యమని, పరిశ్రమలకు కావలసిన ముడిసరుకుగా ఉక్కు కర్మాగారం కావాలనే ఉద్దేశ్యంతో 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అనే ప్రజా ఉద్యమం రూపు తీసుకుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడిన తరువాత విద్యారంగానికి సంబంధించి అనేక కార్యక్రమాలు వచ్చాయి. స్కూళ్ళు, కాలేజీల సంఖ్య పెరిగింది. ధనిక వర్గమే కాకుండా మధ్య తరగతి కుటుంబాలలో పిల్లలు కూడా చదువుకోవడం మొదలు పెట్టారు. వీరిలో కొంత మందికే ఉద్యోగావకాశాలు దొరకడంతో,

చాలా మంది చదువుకున్నా నిరుద్యోగులుగా మిగిలిపోయారు. వీరికి ఉక్కు ఫ్యాక్టరీ తమ ప్రాంతంలో వస్తే తమకు కూడా అందులో ఉద్యోగాలు రావచ్చుననీ, తాము కూడా రాష్ట్ర అభివృద్ధిలో భాగమవుతామనే ఆశ వీరిని ఉద్యమంలో పాల్గొనేటట్లు చేసింది. ఇలా ముఖ్యంగా 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అనే ఉద్యమం రావటానికి మొదటి కారణం 'అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి' అనే భావజాలంతో చూస్తే, ఆ ఉద్యమానికి బలం చేకూర్చేది చదువుకొని కూడా నిరుద్యోగులుగా మిగిలిపోయిన వారిలో గుర్తించవచ్చును. ఈ ఉద్యమానికి స్పందనగానే ప్రభుత్వ రంగంలో మొట్టమొదటి సముద్ర తీర ప్రాంత ఉక్కు కర్మాగారం నిర్మించబడింది. మళ్లీ మన మొదటి ప్రశ్నకు వెళితే ఒరిస్సాలో అభివృద్ధి పథకాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు జరిగితే ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి పథకాలకు అనుకూలంగా ఉద్యమాలు జరిగాయి. పైన చెప్పిన భావజాల ప్రభావం, చదువుకొన్న నిరుద్యోగులు ఒరిస్సాలో ఉండరా? లేక అభివృద్ధి పథకాల వలన వచ్చే నిర్వాసిత సమస్యలు ఒరిస్సాలో ఎక్కువగా ఉండి ఆంధ్రప్రదేశ్‌లో నిర్వాసిత సమస్యలు తక్కువగా ఉంటాయా? అనే కారణాలతో సరిపెట్టుకోకుండా ఈ రెండు రాష్ట్రాలలో ఆర్థిక వ్యవస్థలో వ్యత్యాసాల ద్వారా కూడా చూడవలసి వస్తుంది.

ఒరిస్సా, దాని ఆర్థిక నిర్మాణాన్ని ఒకసారి పరిశీలిస్తే ఆదివాసీ సమాజం అత్యధిక సంఖ్యలో ఉండే ఫుల్‌బాణీ, మయూర్‌భంజ్, కియొంజహార్, కోరాపుట్, కలహండి లాంటి జిల్లాలు, స్థిరపడిన వ్యవసాయ పద్ధతులు కొనసాగిస్తున్న హిరాకుడ్ ప్రాంతంలోని సంబల్‌పూర్ లాంటి జిల్లాలు, అంతకంటే చాలా తక్కువగా ఉండే పట్టణ ప్రాంత పరిశ్రమలు ఉండే కటక్, భువనేశ్వర్ జిల్లాలుగా విభజించుకోవచ్చు. పిరమిడ్ రూపంలో చిత్రించుకుంటే చాలా ఎక్కువ వైశాల్యాన్ని ఆక్రమించే ఆదివాసీ ప్రాంతాలు పిరమిడ్ కింది భాగంలో, దానికంటె తక్కువ వైశాల్యం ఉండే స్థిర వ్యవసాయం, అంతకంటే తక్కువగా ఉండే పరిశ్రమలుగా ఉన్న నిర్మాణంగా అర్థం చేసుకోవచ్చును.

ఆంధ్రప్రదేశ్‌ని పరిశీలిస్తే, ఒరిస్సా నిర్మాణం కంటే వ్యత్యాసంగా ఆదివాసీ ప్రాంతాలు బాగా తగ్గిపోయి, చాలా ఎక్కువ వైశాల్యం ఆక్రమించే వ్యవసాయ రంగం, దీని కంటే చాలా తక్కువగా ఉండే పరిశ్రమలుగా ఊహించుకోవచ్చు. ఒరిస్సా అభివృద్ధి సమస్యలు ముఖ్యంగా ఆదివాసీ వ్యవస్థ (స్థిర వ్యవసాయ వ్యవస్థకి మార్పు చెందడం. అంటే శ్రమ ప్రాధాన్య వ్యవస్థ నుండి భూమి ప్రాధాన్య వ్యవస్థకి మార్పు చెందటం)లో కేంద్రీకరించబడుతాయి. దీని కంటే భిన్నంగా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి సమస్యలు స్థిర వ్యవసాయ వ్యవస్థ నుండి పరిశ్రమలు కేంద్రంగా ఉండే వ్యవస్థకి అంటే భూమి ప్రాధాన్య వ్యవస్థ నుండి పెట్టుబడి ప్రాధాన్య వ్యవస్థకు మారటంలో కేంద్రీకరించబడతాయి. రెండు రాష్ట్రాలకు భిన్నమైన ఆర్థిక వ్యవస్థ ఉండటంతో భిన్నమైన భావజాలం ఉండే అవకాశం ఉంటుంది. ఈ కారణంగానే ఒరిస్సాలో జనాదరణ పొందే నవలలు సాధారణంగా ఆదివాసీ సమస్యలు, వారి సమాజంలో వస్తున్న మార్పులు వివరిస్తాయి. ఒక మధ్య తరగతి ఉద్యోగి అయిన గోపీనాథ మహంతి రాసిన పరజ, అమృత సంతానం వంటి నవలలు దీనికి ఉదాహరణ. ఆంధ్రప్రదేశ్ ఆదివాసీ సమస్యలను విశ్లేషించే నవలలు రావటానికి ఆస్కారం తక్కువ.

**II**

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశంలో ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రజలచే ఎన్నికల ప్రక్రియ ద్వారా రాజ్యాధికారం చేపట్టిన కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో నెహ్రూ నేతృత్వంలో ప్రజోపయోగ పథకాలను రూపొందించింది. ఆ సమయంలో అమెరికా, బ్రిటన్, రష్యా లాంటి దేశాలు అభివృద్ధి చెందిన దేశాలుగా గుర్తింపు పొందటం వలన మన దేశం కూడా వాటిని అనుకరిస్తే అలా మారిపోగలమనే ఆకాంక్షతో పంచవర్ష ప్రణాళికలు రూపొందించటం, ఆ ప్రయత్నంలో భాగంగానే భారీ అభివృద్ధి పథకాలకు ప్రాముఖ్యతనివ్వడం జరిగింది. ఈ క్రమంలోనే హిరాకుడ్, నాగార్జునసాగర్ లాంటి భారీ నీటి పారుదల ప్రాజెక్టులు, రూర్కెలా లాంటి భారీ ఉక్కు కర్మాగారాలు దేశంలో నిర్మించబడ్డాయి. అభివృద్ధి చెందిన దేశాలలోని అభివృద్ధి పథకాలను మన దేశంలో నిర్మించుకుంటే మనం కూడా అభివృద్ధి చెందవచ్చుననే భావజాలం దీనికి మూలం. ఆ దేశాలలో భారీ ప్రాజెక్టుల గురించిన ప్రయోగాలు విజయ వంతంగా అనుకున్న ఫలితాలు సాధించాయనీ, ఆ కారణంగా మనం కూడా భారీ ప్రాజెక్టుల నిర్మాణం చేపడితే మనం కూడా అభివృద్ధి చెందగలమనే ఒక భావన, ఒక భావజాలం, ఒక నమ్మకం దీనికి మూలం.

ఈ క్రమంలో అభివృద్ధి పథకాలే అభివృద్ధి అనే మాయ కలుగుతుంది. భారీ డ్యాంల వలన వ్యవసాయ రంగంలో పంటల ఉత్పత్తికి సంబంధించిన మార్పులే కాక, లభ్యమయ్యే విద్యుత్తు, రవాణా సౌకర్యాలు, నీటి సదుపాయం మొదలైనవి సమాజ అభివృద్ధికి సహాయపడతాయనీ, ఉక్కు తయారీ వలన మిగతా పరిశ్రమలన్నీ మెరుగుపడి, వీటి వలన స్థానిక ప్రాంతమే కాక, రాష్ట్రం, దానితో పాటు దేశం అభివృద్ధి చెందుతాయనే ఊహ బలంగా ఉండేది. ఇవన్నీ పరిశీలిస్తే అభివృద్ధి అంటే సమాజ పరిణామక్రమంలో వచ్చిన ఫలితం అని కాక ఫలితాన్నే అభివృద్ధిగా చూసే భావజాలం దీనికి ఆధారమని తెలుస్తుంది. అభివృద్ధి పథకాలే అభివృద్ధి ప్రతీకలుగా భావించడం జరుగుతుంది. దీనితో క్రమం తెర వెనుకకు వెళ్లిపోతుంది. పెద్ద పెద్ద డ్యాంలు, ఫ్యాక్టరీలు, పెద్ద భవనాలు, సాంకేతిక నిపుణుల సంఖ్య, విశ్వవిద్యాలయాల సంఖ్య, వివిధ ప్రయోగశాలలు, సూపర్ మార్కెట్లు, చక్కటి రోడ్లు... ఇలాంటివన్నీ చూసి అక్కడి అభివృద్ధిని అంచనా వేస్తాం. ఏ క్రమంలో ఏ లక్ష్యం కోసం ఇవి వచ్చాయి అనేది కనుమరుగవుతుంది.

అభివృద్ధి పథకాలే అభివృద్ధి అనే భావజాలం మన సమాజంలో ప్రజలకే కాకుండా నేతృత్వానికి కూడా ఇదే భావజాలం కొనసాగుతూ ఉందని చెప్పటానికి ముందు చెప్పినట్లుగా మన రాష్ట్ర నేతృత్వ స్థానంలో ఉండే ముఖ్యమంత్రులు - మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు 'విజన్ 2020'లో ప్రతిపాదించిన ఇజ్రాయెల్ వ్యవసాయం లాంటి పథకాలైనా, ప్రస్తుత

ముఖ్యమంత్రి చైనా పర్యటనలో త్రీగోర్జెస్ డ్యాం ప్రేరణతో మనకు కూడా అలాంటివి కావాలని ప్రతిపాదించటం ఉదాహరణగా చూడవచ్చును. గత 50 సంవత్సరాలలో ఇటువంటి పథకాల ఆచరణలో వచ్చిన ఫలితాలను విశ్లేషిస్తే ఇవి కొంత వెలుగునిచ్చినా కూడా, ఆశించిన లక్ష్యానికి, సాధించిన లక్ష్యానికి పొంతన కుదరలేదని తెలుస్తుంది. అంతే కాకుండా సమాజంలో కొత్త సంబంధాలు రాకుండా, సమాజం చిన్న చిన్న భాగాలుగా విభజింపబడిపోయింది. ఈ విభజన కులం, జెండర్, విద్య, ప్రాంతం ... ఇలా ఎన్నో అంశాల ప్రాతిపదికన జరుగుతోంది.

దీనికి సమాంతరంగా మనతో పాటే స్వాతంత్ర్యం సాధించిన చైనా గురించి ఒకమాట చెప్పుకోవాలి. చైనాతో మనకి ఎన్ని విభేదాలు ఉన్నా చైనా మనకంటె అభివృద్ధి చెందిందని చెప్పటానికి చైనా వారి ఎలక్ట్రానిక్ వస్తువులు, పెన్నులు, గాజు సామాను, బట్టలు, ముఖ్యంగా చైనా సిల్కు, టీ... ఇలా ఎన్నో సరుకులు చవకగా తయారు చేస్తోందని అందరూ ఒప్పుకుంటారు. తనదైన ముద్ర గల సరుకులు, విత్తనాలైనా, సామాన్లయినా, బేర్‌ఫుట్ డాక్టర్లయినా తయారు చేయగలగడంలో ప్రపంచంలో శక్తివంతమైన ఆర్థిక శక్తిగా రూపొందింది. దీనికి కారణాలు వెతికితే బహుశా మనం చేసినట్లుగా 'అభివృద్ధి పథకాలే అభివృద్ధి'గా భావించకుండా, చైనా తనకు కావలసిన, అవసరమైన పరిణామక్రమాన్ని, అంటే అభివృద్ధి మార్గాన్ని నిర్ధారించుకొని దీనికి కావలసిన పథకాలను ఎంచుకుంది. క్లుణ్ణంగా చెప్పుకోవాలంటే చైనా తనదైన అభివృద్ధి క్రమాన్ని రూపొందించుకొని ఫలితాలను పొందాలనుకుంటే, అంటే 'అభివృద్ధి కోసం అభివృద్ధి పథకాలు' అని చూస్తే మనం బయటి ఫలితాలను అనుకరించి అభివృద్ధి అవ్వాలని అనుకోవటంలో 'అభివృద్ధి పథకాల ద్వారా అభివృద్ధి' అని చూడటంలో మన దేశంలో అభివృద్ధి, దానికి కావలసిన క్రమానికి పాత్ర లేకపోయింది. ఈ నేపథ్యంలో అభివృద్ధి అంటే ఏమిటి? అనే ప్రశ్న ముందుకు వస్తుంది. అభివృద్ధి అంటే ఏమిటి? వృద్ధికి, అభివృద్ధికి తేడా ఏమిటి అని అర్థం చేసుకోవాలంటే 'దేని అభివృద్ధి' అనే ప్రశ్న మనం ముందు వేసుకోవాలి. మనం సాధారణంగా అభివృద్ధిని సమాజపరంగా చూస్తాం కాబట్టి సమాజం అంటే ఏమిటి? సమాజంలో వృద్ధి, అభివృద్ధిల తేడాలు ఏమిటి అనే ప్రశ్నకు జవాబు కావలసివస్తుంది.

సమాజం అనగానే అనేక సంబంధాలు కలిగిన వ్యక్తుల సమూహం అని, వ్యక్తుల మధ్య ఉత్పత్తి, పునరుత్పత్తికి సంబంధించిన ఎన్నో సంబంధాలు ఉంటాయి. తమకందుబాటులో ఉన్న జ్ఞానం, శ్రమ, భూమి, పెట్టుబడుల కలయిక, దానికుండే పరిమితుల వలన వ్యక్తుల మధ్య నిర్దిష్ట సంబంధాలు ఏర్పడతాయి. వీటి పరిరక్షణ కొరకు కొన్ని ఆంక్షలు, కొన్ని నియమాలు ఏర్పడతాయి. వీటినే ఇనిస్టిట్యూషన్స్ అనవచ్చును. దీని వలన వ్యక్తుల మధ్య సంబంధాలకొక నేపథ్య పరిధి, వ్యక్తుల ఆలోచన, ఆచరణలకు కొన్ని పరిమితులు ఏర్పడతాయి. వీటి ఆధారంగా సమాజానికి ఒక నిర్మాణం రూపు తీసుకుంటుంది. సమాజ పరిణామ క్రమంలో పరిమితులు మారుతూ, దాని కారణంగా నిర్మాణంలో మార్పులు వస్తాయి అనేది ఒక దృక్పథం. ఈ నిర్మాణంలో వచ్చిన మార్పులు సమాజంలోని సంబంధాల మార్పులలో ప్రతిఫలిస్తాయి. నిర్మాణంలో వచ్చే ఇటువంటి మార్పుని అభివృద్ధి స్ట్రక్చరల్ ట్రాన్స్‌ఫార్మేషన్ అనవచ్చు.

దీన్నే సులభంగా అర్థం చేసుకోవాలంటే సమాజాన్ని ఒక 'మొత్తం'గా ఊహిస్తే, దానిలో కొన్ని భాగాలు ఉండి వాటి మధ్యన సంబంధాలు ఉంటే, 'మొత్తం' యొక్క నిర్మాణ విశిష్టత మూలాన దానిలోని 'భాగాల'కు, 'భాగాల' మధ్య సంబంధాల వలన 'మొత్తం'కి ఒక గుర్తింపు వస్తుంది. ఒక దానిలో మార్పులు చోటు చేసుకుంటే రెండవ దానిలో కూడా ఇవి ప్రతిఫలిస్తాయి. ఉదాహరణకి సమాజంలో ఎ, బి అనే రెండు భాగాలు ఉన్నాయని అనుకుంటే, ఎ, బి ల మధ్య విశిష్టమైన సంబంధాలు ఉన్నపుడే అవి ఒకే సమాజంలో భాగమవుతాయి. ఏ కారణం చేతనైనా - అంటే అంతర్గత అవసరాల మూలాన కాని, బాహ్యాప్రేరిత సంబంధాల మూలాన కాని - ఒక భాగం (ఎ) మార్పుకు లోనైతే, మారిన ఎ కి అనుగుణంగా బి కూడా మార్పుకు లోనై ఎ, బి మధ్య కొత్త సంబంధాలు ఏర్పడే క్రమంలో వాటి మధ్యన ఉన్న పాత సంబంధాలు ధ్వంసమైపోతాయి. ఈ క్రమాన్ని సృజనాత్మక విధ్వంసం అనవచ్చు. ఇలా ఎ, బి ల మధ్య కొత్త సంబంధాలు ఏర్పడితే, ఎ, బి లు భాగమైన సమాజానికి కూడ కొత్త రూపు, కొత్త నిర్మాణం వస్తాయి. ఈ నిర్మాణంలో మార్పునే అభివృద్ధి అనవచ్చు. ఒకవేళ ఎ లో వచ్చిన మార్పుల కనుగుణంగా బి మారకపోతే వాటి మధ్యన ఉండే పాత సంబంధాలు ధ్వంసమైపోతాయి కాని కొత్త సంబంధాలు ఏర్పడవు. దీనినే స్థానభ్రంశ సమస్య (డిస్‌ప్లేస్‌మెంట్ ప్రాబ్లమ్)గా ఊహించవచ్చు. ఎ,బి లలో మార్పులు రాకుండా కేవలం ఎ లో మాత్రమే మార్పులు వస్తే అది సమాజ అభివృద్ధిగా కాక ఒక వృద్ధిగానే ఉండిపోతుంది. ఇంకొక ముఖ్య పరిణామం ఎ, బి ల మధ్య సంబంధాలు ధ్వంసమైపోతే, ఎ లో వచ్చిన మార్పులు వృద్ధిగా కనిపిస్తే, బి అనే భాగం ఎ నుండి విడిపోయి తనకు తానే ఒక 'మొత్తం'గా మార్పు చెంది తనలో భాగాలు, వాటిలో మార్పులకు ప్రయత్నిస్తుంది. విడిపోయిన బి ని తిరిగి సమాజంలో భాగం చేయటానికి అనేక రకాల రాయితీలు, రిజర్వేషన్లు, దారిద్ర్య నిర్మూలన పథకాలు, ఉచిత విద్య, పనికి ఆహారం, ఉపాధి గ్యారంటీ పథకాల ద్వారా ప్రయత్నం జరుగుతుంది. తనకు కూడ సమాజ అభివృద్ధిలో భాగం కావాలని బి చేసేవే వివిధ ప్రజా ఉద్యమాలుగా ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవచ్చు.

సమాజం అనే 'మొత్తం' లో ఉండే విడివిడి భాగాలు, వాటి మధ్యన ఉండే సంబంధాలు, దాని వలన ఏర్పడే నిర్మాణం అనేక ప్రాతిపదికల మీద సాధ్యమౌతుంది. ఆర్థిక ప్రాతిపదికని తీసుకుంటే సమాజంలో వ్యవసాయం, పరిశ్రమలు అనే భాగాలు, వాటి మధ్య ఉండే సంబంధంగా చూడవచ్చు. వ్యవసాయంలో జరిగే మార్పులు, పరిశ్రమలలో కూడా దానికి అనుగుణంగా

మార్పులు వస్తే ఈ రెంటి మధ్య కొత్త సంబంధాలు ఏర్పడి సమాజ అభివృద్ధికి దారి తీస్తుంది. ఇదే విధంగా కులం, జెండర్, భౌగోళిక ప్రాంతం, చరిత్ర, మతం, భాష, విద్య ... ఇలా ఎన్నో ప్రాతిపదికల మీద సమాజ నిర్మాణాన్ని, దానిలో సాధ్యమయ్యే వృద్ధి, అభివృద్ధులను అవగాహన చేసుకునే క్రమం తెలుస్తుంది. అంతే కాకుండా ప్రజా ఉద్యమాలు రావటానికి గల కారణాలు కూడా ఊహించవచ్చును.

ఈ నేపథ్యంలో విశాఖ ఉక్కు కర్మాగారం సమాజంలో ఏ సంబంధాలను విధ్వంసం చేసింది? వేటిని పునర్నిర్మాణం చేయగలిగింది అనేది చూడవచ్చును.

### III

ఉక్కు కర్మాగారం విశాఖపట్టణంలో నిర్మించక పూర్వం ఇక్కడి సామాజిక వ్యవస్థ వ్యవసాయం కేంద్రంగా ఉండేది. ఇటువంటి సమాజంలో భూమి కేంద్రంగా ఉండే వ్యక్తుల మధ్య సంబంధాలను వ్యవసాయ సంబంధాలనవచ్చును. దీనిలో భూమి కలిగి ఉన్న వ్యవసాయదారులు, భూమిలేని వ్యవసాయ కూలీల మధ్య నిర్దిష్ట సంబంధాలు ఉంటాయి. ఈ రెండు భాగాలు కాక సమాజంలో తరతరాలుగా వచ్చే కంసాలి, కమ్మరి, వడ్రంగి, కుమ్మరి, సాలీలు వగైరా వృత్తులు చేసే వాళ్లే కాకుండా గ్రామంలో అవసరమైన సేవలు చేసే చాకలి, మంగలి కులాలు కూడా ఉన్నాయి. భూమి కేంద్రంగా ఉండే ఈ సామాజిక సంబంధాలు ఆ గ్రామానికి ఒక కట్టడినిచ్చి మేమంతా ఒకటే అనే భావాన్ని ఇస్తాయి. వృత్తికి కావలసిన భద్రత, తనకవసరమైనపుడు గ్రామంలో సహాయం దొరుకుతుందనే నమ్మకం, కష్టాన్నైనా సుఖాన్నైనా గ్రామంలో పంచుకోగలమనే ధీమా ఉండటంతో గ్రామంలో వ్యక్తుల మధ్య సజీవ సంబంధాలు ఉంటాయి. ఇవి సమాజానికి ఒక నిర్మాణాన్ని తయారు చేస్తాయి. ఈ నిర్మాణం సమాజంలోని వ్యక్తుల ఆలోచనలకు ఒక ఆధారం, ఆచరణకి ఒక నేపథ్యం ఇస్తాయి.

ఇటువంటి వ్యవసాయ ప్రాధాన్య ప్రాంతంలోకి భారీ ఉక్కు పరిశ్రమ రావడంతో, స్థానికంగా ఉండే వ్యవసాయ ఆధారిత సామాజిక వ్యవస్థను తీసివేసి (దీనినే ధ్వంసం చేసి అనవచ్చును) అక్కడ పరిశ్రమల ఆధారంగా మార్కెట్ ప్రేరిత సామాజిక వ్యవస్థని ప్రవేశ పెట్టడం జరిగింది. అంటే ఉత్పత్తికి కావలసిన వనరులలో భూమి కంటే పెట్టుబడి ప్రాధాన్యతని సంతరించుకుంటుంది. ఆధునిక ఆర్థిక వ్యవస్థగా సమాజాన్ని మార్చే క్రమంలో వచ్చిన ఉక్కు కర్మాగారం సాంప్రదాయ వ్యవస్థని మార్చగలిగిందా? లేదా? అనే అవగాహన కొరకు ఉక్కు కర్మాగారం వలన ఏర్పడిన నిర్వాసిత గ్రామాలలో ఒక గ్రామాన్ని ఐఎస్ఎస్సి ఆధ్వర్యంలో సర్వే చేయడం జరిగింది. ఈ సర్వే చేసిన సమయానికి ఉక్కు కర్మాగార నిర్మాణం, నిర్వాసిత కాలనీలు ఏర్పరచటం జరిగి పది సంవత్సరాలు గడిచిపోయింది. సర్వే వివరాలు ఇలా ఉన్నాయి:

ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణ క్రమంలో నిర్వాసితులైన ప్రజలకు కట్టిన తొమ్మిది పునరావాస కేంద్రాలలో ఒకటి అగనంపూడి-3. ఈ కాలనీలో పునరావాసం పొందిన నాలుగు గ్రామాలలో ఒకటి దానబోయినపాలెం (డి.బి.పాలెం). ఈ గ్రామం నుండి వచ్చి ఎ-3 కాలనీలో నిర్వాసితులు స్థిరపడి పది సంవత్సరాలు గడిచిపోయింది. వీరి దగ్గర నుండి సేకరించిన సమాచారం ఆధారంగా మేము తయారుచేసిన పునరావాస పూర్వ డి.బి.పాలెం చిత్రపటం వివరాలు ఇలా ఉన్నాయి. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విషయమేమిటంటే ఇక్కడి కుటుంబాలను పునరావాస గ్రామం పేరు అడిగితే అగనంపూడి-3 అని కాక డి.బి.పాలెం (ప్రస్తుతానికి దానికి ఉనికే లేదు) అని చెప్పటం మూలాన వారికి కొత్త వ్యవస్థతో ఆర్థిక సంబంధాలు ఏర్పడలేదని, పాత వ్యవస్థతోనే మానసిక సంబంధాలు బలంగా ఉన్నాయనే విషయం తెలుస్తుంది.

డి.బి.పాలెం అనే గ్రామం విశాఖపట్టణం, అనకాపల్లికి మధ్యలో జాతీయ రహదారి నం.4 కు ఉత్తరంగా అగనంపూడి అనే గ్రామానికి దగ్గరగా ఉండేది. గ్రామంలో వంద కుటుంబాలలో పది చాకలి కుటుంబాలు, ఒక మంగలి కుటుంబం మినహాయించి మిగతా వారు కాపు కులానికి చెందిన కుటుంబాలు. ఇక్కడ మిగతా వృత్తి కులాలైన కుమ్మరి, సాలీ లాంటి కుటుంబాలు లేవు. గ్రామంలో ప్రధాన వృత్తి వ్యవసాయం. చాలా వరకు అన్ని కుటుంబాలకు కనీసం ఒక ఎకరం పొలం ఉండటంతో వ్యవసాయం ప్రధాన వ్యాపకం అయింది. ఏ కొంత మందికో భూమి లేక వ్యవసాయ కూలీలుగానో లేక క్వారీలోని రాళ్లను పగులగొట్టించి పట్టణానికి తీసుకుని వెళ్లే లారీలకు ఈ రాళ్లను ఎత్తే కూలీలుగానో పనిచేసే వారు. ఇక్కడ ఇరిగేషన్ సదుపాయం తక్కువగా ఉండటంతో ఇక్కడి కుటుంబాలు జొన్నలు, రాగులు, పెసలు పండిస్తే కొద్ది మంది మాత్రం వరి పండించి తమ అవసరాలకు వాడుకునే వారు. మార్కెట్‌తో వీరికి సంబంధాలు తక్కువ. సాగునీటి సదుపాయం లేకపోవడం దానికి తోడు సాంప్రదాయ పద్ధతులతో - అంటే ఎరువులు, పురుగుల మందులు, కంపెనీ విత్తనాలు లాంటివి వాడకుండా - వ్యవసాయం చేయడం మూలాన అనుకున్నంత దిగుబడి రాక కుటుంబాలు కష్టాలపాలై గ్రామ పెద్ద దగ్గర సహాయం కోరేవారు. ఈ గ్రామంలో భూమి అధికంగా ఉన్న సన్యాసినాయుడు గ్రామ పెద్దగా వ్యవహరించటంతో, గ్రామ ప్రజలు తమ అత్యవసర పరిస్థితులు - అంటే పెండ్లి లాంటి శుభకార్యాలకు, కుటుంబంలో ఎవరైనా చనిపోయినా, రోగం లాంటివి వస్తే గ్రామ పెద్ద 'తక్కువ సమయంలో అప్పు తీర్చివేయాలి అనే షరతు పెట్టి వడ్డీ లేకుండా అప్పులిచ్చేవాడు. అంతే కాకుండా గ్రామంలో ఒక రామాలయం కట్టించి తనే ఆ ఆలయంలో రోజుకు రెండుసార్లు పూజలు చేసేవాడు. గ్రామంలో హత్య కేసులను మినహాయించి ఆస్తికి సంబంధించిన తగాదాలు - ఇంటికి, పొలానికి సంబంధించినవి - తనే జడ్జిగా వ్యవహరించి తీర్పునివ్వడం, ప్రజలు దానిని అంగీకరించటం జరిగేది. ఈ తగాదాలలో పోలీసులను కాని కోర్టులను కాని సహాయం కోరటం ఉండేది కాదు. విద్య విషయానికి వస్తే ఐదవ తరగతి వరకు చదువు చెప్పే స్కూలు ఉంది. పై చదువులు చదవటానికి విశాఖపట్టణం దగ్గరలోనే ఉంది. కాని ఈ గ్రామంలో చాకలి కుటుంబాలకు

# జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం

డా. యిమ్మానేని సత్యసుందరం

**జా**తీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం-2005 క్రింద రాష్ట్రాలన్నీ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని అమలు పరచవలసి ఉంది. ఆంధ్రప్రదేశ్ ఈ పథకాన్ని అనంతపురం జిల్లా బండ్లపల్లి గ్రామంలో ఫిబ్రవరి 02, 2006న ప్రారంభించింది. రాష్ట్రంలో 13 జిల్లాలలో (628 మండలాలలో) ఈ పథకాన్ని మొదటి దశలో అమలుపరుస్తారు. వీటిలో 9 తెలంగాణలో, 3 రాయలసీమలో, 1 కోస్తా ఆంధ్రలో ఉన్నాయి. ఈ జిల్లాలు: ఆదిలాబాద్, అనంతపురం, చిత్తూరు, కడప, కరీంనగర్, ఖమ్మం, మహబూబ్‌నగర్, మెదక్, నల్గొండ, నిజామాబాద్, రంగారెడ్డి, విజయనగరం, వరంగల్. జిల్లాకు రు.100 కోట్ల చొప్పున పదమూడు జిల్లాలకు గాను రు.1,300 కోట్లు మంజూరు అయ్యాయి. దేశం మొత్తం మీద 250 జిల్లాలలో ఈ పథకం అమలు పరుస్తారు. ఇప్పటి వరకు 150 జిల్లాలలో పనికి ఆహారం పథకం అమలులో ఉంది.

**నివేదిక**

ఉపాధి హామీ పథకం గత అనుభవాలను దృష్టిలో ఉంచుకొని రూపొందించినట్లు తెలుస్తుంది. ఉదాహరణకు, వేసవిలో కూలీలు పనిచేసే ప్రదేశాలలో నీడ, తాగునీరు, ప్రథమ చికిత్స సౌకర్యాలను ఏర్పరచాలని ఈ చట్టం తెలుపుతుంది. అలాగే, పనులలో ప్రమాదం జరిగి అంగవైకుల్యులయితే రు.25,000 సహాయంగా అందించాలని చట్టంలో ఉంది.

ఉపాధి హామీ పథకం మహారాష్ట్రలో 1972 నుండి అమలులో ఉంది. ఈ పథకం ప్రపంచబ్యాంక్ ప్రశంసలను కూడా అందుకొంది. అయితే, ఈ పథకం దారిద్ర్యం శాతాన్ని ఎంతవరకు తగ్గించింది అన్నది అనుమానమే. మహారాష్ట్రలో దారిద్ర్యం శాతం 1987-88లో 41%, 1993-94లో 38%, 1999-2000లో 23%గా ఉంది. దేశం మొత్తం మీద ఇది 26%గా ఉంది. ఉపాధి హామీ పథకం లేని గుజరాత్‌లో ఇది 12% మాత్రమే. పథకాలను సమర్థవంతంగా అమలు పరుస్తే మంచిదే. అయితే, ఈ పథకాల ద్వారా మాత్రమే దారిద్ర్యనిర్మూలన జరుగుతుందనుకొనుట పొరపాటే.

**ముఖ్య లక్షణాలు**

నిధులు వినియోగంలో కేంద్ర, రాష్ట్ర వాటాలు 90:10 నిష్పత్తిలో ఉంటాయి. ఈ పథకం క్రింద ఎటువంటి పనులు చేపట్టవచ్చు స్పష్టంగా నిర్దేశించారు. నీటి సంరక్షణ, వాన నీటి నిల్వ, భూమి అభివృద్ధి పనులు, మొక్కలు నాటడం వంటి (కరువు నుంచి రక్షణ) ఇచ్చే పనులు చేపడతారు. సాగునీటి కాలువలు, సూక్ష్మస్థాయి సాగునీటి పనులకు ప్రాధాన్యతనిస్తారు.

ఉపాధి హామీ చట్టం ముఖ్య లక్షణాలు. ఇలా ఉన్నాయి.

- ప్రతి గ్రామీణ కుటుంబంలో ఒక వ్యక్తికి ఏడాదిలో కనీసం 100 రోజులకైనా ఉపాధి కల్పించబడుతుంది.
- ఒకవేళ 100 రోజుల పని కల్పించలేకపోతే పని కల్పించని రోజులకు నిరుద్యోగ భృతిని ఇస్తారు. ఈ భృతి మొదటి 30 రోజులకుగాను దేశంలో కనీస వేతనంలో 25 శాతం, మిగిలిన రోజులకు 50 శాతం ఇవ్వబడుతుంది.
- తమవద్ద నమోదు చేయించుకొన్న వారికి పంచాయితీలు జాబ్ కార్డులను జారీ చేస్తాయి.
- రాష్ట్రంలో అమలులో ఉన్న కనీస వేతనాల ప్రకారం దినసరి కూలి చెల్లిస్తారు.
- ఆడ-మగ కూలీలకు సమాన కూలీ రేట్లు చెల్లించాలి.
- సాధ్యమైనంత వరకు ఐదు కిలోమీటర్ల దూరం పరిధిలోనే

---

సంబంధించినంత వరకు పరిస్థితి వేరుగా ఉంది. వారి వృత్తి ధర్మం ప్రకారం వారు సేవలు చేసే వారవడంతో, వారి సేవ గ్రామానికే పరిమితమవకుండా గ్రామానికి పక్కనే ఉన్న పెద్దమడక, సిందియా లాంటి పట్టణాలకు కూడా విస్తరించింది. గ్రామం లోపల ఏడాది పొడుగునా వీరిచ్చే సేవలకు ప్రతిఫలంగా ఏకమొత్తంలో ఒకేసారి ఇచ్చే ధాన్యం, పప్పుల రూపంలో ఉండే కూలీ, దీనికి వ్యతిరేకంగా గ్రామం వెలువల ఇదే సేవలకు అనుగుణంగా రోజువారీ కూలీ డబ్బు రూపంలో ఉండేది. ఈ కారణంగా చాకలి కుటుంబాలు గ్రామంలో ఉండే భద్రతని పొందుతూనే గ్రామం బయట ఉండే మార్కెట్ విలువల ప్రభావానికి లోనై తమ శ్రమ విలువని డబ్బు రూపంలో పొందగలుగుతున్నారు. వీరిలో కొంతమంది స్కూలుకి వెళ్ళి చదువు కూడా నేర్చుకున్నారు. ఏ కారణం చేతనో మంగలి కుటుంబం ఈ సదుపాయాలని పొందలేక పోయింది.

క్షుణ్ణంగా పరిశీలిస్తే గ్రామంలో ఉండే మెజారిటీ కుటుంబాలు వ్యవసాయ సంబంధాల పరిధిలోనే ఇమిడిపోయాయి. దీనికి విరుద్ధంగా చాకలి లాంటి సేవలు అందించే కుటుంబాలు గ్రామంలో సంబంధాలు ఉంచుకుంటూనే గ్రామం బయట ఉండే డబ్బు మీద ఆధారపడే వ్యవస్థతో కూడ సంబంధాలు పెట్టుకున్నారు.

(మిగతా వచ్చే సంచికలో)

పని కల్పిస్తారు. అంతకంటే ఎక్కువ దూరంలో పని కల్పిస్తే పది శాతం అదనంగా కూలి చెల్లించాలి.

- పని జరిగే చోట్లలో కనీస వసతులు కల్పించబడతాయి. మహిళలు, వారి పిల్లల సంరక్షణకు ప్రత్యేక ఏర్పాట్లు చేయాలి.
- 50 శాతం పనులను గ్రామ పంచాయితీలే అమలు చేస్తాయి.
- గ్రామ సభలో సోషల్ ఆడిట్ జరుగుతుంది.
- కాంట్రాక్టర్లను అనుమతించరు.
- ఈ చట్టం అమలును సమీక్షించుటకు కేంద్ర, రాష్ట్ర ఉపాధి మండలాలను ఏర్పరుస్తారు.

**కొన్ని సమస్యలు**

వేతన ఉపాధి కార్యక్రమాలను అమలు పరచడంలో మన దేశానికి సుదీర్ఘ అనుభవం ఉంది. ఇవి ఆశించిన ఫలితాలు సాధించలేదు. కేవలం పనిదినాల కల్పనకే ప్రాధాన్యత ఇవ్వబడింది. అవస్థాపన సౌకర్యాలు పెంచి, స్థానిక ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయవలసిన ముఖ్యమైన ఆశయాన్ని ప్రక్కన పెట్టడం జరిగింది. అవినీతి స్థాయి కూడా ఎక్కువగానే ఉంది. పనిదినాల కల్పన అసలు పనిదినాలకంటే ఎక్కువగా చూపించడం జరిగింది. దీనిని నిర్మూలించడానికి సంస్థాపరమైన ఏర్పాట్లు చేయాలి.

ఉపాధి హామీ పథకం ఎంత సమర్థవంతంగా అమలు కానున్నదో అనుమానంగానే ఉంది. ఎందుకంటే, ఈ పథకానికయ్యే ఖర్చు ప్రధానంగా (90 శాతం) కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది. అమలు చేసే బాధ్యత మాత్రం రాష్ట్ర ప్రభుత్వాలపై, స్థానిక సంస్థలపై ఉంది.

నిరుద్యోగ భృతిపై కూడా అనేక అనుమానాలే. మహారాష్ట్ర ఉపాధి హామీ పథకంలో కూడా నిరుద్యోగ భృతికి ఆస్కారం ఉంది. అయితే, ఇది కాగితం మీదనే ఉండిపోయింది. దేశం మొత్తం మీద అమలు చేసే ఈ పథకంలో నిరుద్యోగ భృతి సాధ్యపడేనా?

ఉపాధి హామీ పథకానికి ఒక నిర్ణీతమైన బడ్జెట్ లేదు. పథకంలో నిర్దేశించిన ఏ పనులైనా చేపట్టవచ్చు. ఈ పరిస్థితులలో నిధులను మరలించడానికి అవకాశం ఉంది. ఇతర వేతన ఉపాధి కార్యక్రమాల కింద చేపట్టే పనులను కూడా ఈ పథకం కింద చూపించవచ్చు. దీని వలన మొత్తం మీద ఉపాధి కల్పనలో మార్పు ఉండదు. అటువంటప్పుడు క్రొత్త పథకాల వల్ల ప్రయోజనం ఏంటి?

ఉపాధి హామీ పథకాన్ని సమర్థవంతంగా అమలు పరచాలంటే తగు సిబ్బంది ఉండాలి. ఈ దిశగా రాష్ట్ర ప్రభుత్వం కొత్తగా 34,000 పోస్టులను భర్తీ చేస్తానంది. అయితే, ఖాళీ అయిన పోస్టులను మన ప్రభుత్వాలు ఎంత త్వరగా భర్తీ చేస్తాయో మన అందరికి తెలుసు. సిబ్బంది కొరత వలన ఈ పథకం నాణ్యత పడిపోవచ్చు. ఈ పోస్టుల ద్వారా రాష్ట్రంలో అదనంగా ప్రతి గ్రామ పంచాయితీకి సహాయ కార్యదర్శి, ప్రతి మండలానికి ముగ్గురు టెక్నికల్ అసిస్టెంట్లు, మండల గ్రామ ఆర్గనైజర్లు కొత్తగా రానున్నారు. మరి రిజర్వేషన్లు పాటిస్తారా? నియమించిన వారికి తగు శిక్షణ ఇస్తారా? చాలా రాష్ట్రాలలో వాస్తవంగా చెల్లించే వేతనం ప్రభుత్వం నిర్ణయించిన కనీస వేతనాల కంటే తక్కువే. ఉపాధి హామీ పథకం కింద కనీస వేతనాలు చెల్లిస్తే కాస్త ఆర్థిక స్తోమత ఉన్నవారు కూడా పనిని కోరవచ్చును.

**తీసుకోవలసిన చర్యలు**

వ్యవసాయ రంగంలో ఉపాధి కల్పనాశక్తి రానురాను తగ్గిపోతూ ఉంది. ఈ కారణంగా గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర రంగాలలో ఉపాధి కల్పనా శక్తి పెంచాలి. ఉపాధి హామీ పథకం ఇందుకు తోడ్పడాలి.

వాస్తవంగా గ్రామీణ పేదలకు కావలసింది 100 రోజుల ఉపాధి హామీ కాదు. సంవత్సరంలో ఎక్కువ భాగం (సుమారు 200 రోజులు) అంతరాయం లేకుండా పని. ఈ దిశగా మన గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను రూపొందించాలి.

కార్యక్రమాలను అమలు పరచడంలో సాధ్యమైనంత తక్కువగా యంత్రాలపై ఆధారపడాలి. ఎందుకంటే ఈ పథకం ముఖ్య ఉద్దేశ్యం వేతన ఉపాధి కల్పన. కొన్ని పనుల విషయంలో యంత్రపరికరాలను వాడటం తప్పదు. లేకపోతే పనుల నాణ్యత తగ్గిపోతుంది.

దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమాలు ప్రజాసంస్థలు మాత్రమే అమలుపరచాలని ఒక విధానపరమైన నిర్ణయం కేంద్ర ప్రభుత్వం తీసుకొంది. ఈ కారణంగా ఉపాధి హామీ పథకం పంచాయితీలే అమలుపరచాలి. ఈ సంస్థల పనితీరులో మార్పులు తేవలసిన అవసరం ఉంది.

పంచాయితీలకు కావలసిన నైపుణ్యత, అనుభవం గల సిబ్బంది తగినంతగా లేరు. అందువలన సిబ్బందికై పంచాయితీలు ప్రభుత్వశాఖలపై ఆధారపడవలసిన అవసరం ఉంది. అంతేకాదు, పంచాయితీలు గ్రామీణాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని ఏ ఏ కార్యక్రమాలను అమలు పరచాలో ముందుగానే నిర్ణయించుకోవాలి.

పథకం అమలులో కీలక పాత్ర పోషించే వారికి జాతీయ గ్రామీణాభివృద్ధి హైదరాబాద్, తగు శిక్షణను సమకూరుస్తుంది. అంటే శిక్షణ ఇచ్చేవారికి శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ పొందే వారిలో రాష్ట్ర గ్రామీణాభివృద్ధి సంస్థకి చెందిన సిబ్బంది, స్వచ్ఛంద సేవా సంస్థలకు చెందినవారు, ప్రజా ప్రతినిధులు, సంఘసేవకులు, మీడియాకు చెందినవారు ఉంటారు.

ప్రస్తుతం సమాచార హక్కు చట్టం అమలులో ఉంది. ఉపాధి హామీ పథకం అమలులో అవకతవకలు ఉంటే సమాచారం సేకరించి గ్రామసభ మీటింగులలో చర్చించవచ్చు. లబ్దిదారులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనవలసిన అవసరం ఉంది.

ఉపాధి హామీ పథకం ఎంత సమర్థవంతంగా పనిచేసేది పౌరులు, ముఖ్యంగా లబ్దిదారులు, చూపే శ్రద్ధపై ఆధారపడి ఉంటుంది. సమాచార హక్కును ఉపయోగించుకొని పౌరులే తనిఖీలను నిర్వహించాలి. సామాజిక తనిఖీ (సోషల్ ఆడిట్) అవసరం ఎంతైనా ఉంది.

ఉపాధి హామీ పథకం సక్రమంగా అమలుపరుస్తే కేవలం ఉపాధి కల్పనకే కాకుండా గ్రామ ఆర్థిక వ్యవస్థను అన్ని విధాలుగా పటిష్ఠం చేయడానికి ఉపయోగపడుతుంది. ❑

# ఆర్థిక సంస్కరణల ప్రభావం

వి. హనుమంతరావు

1991లో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టింది. ఈ సంస్కరణలు దేశంలో పెనుమార్పు తీసుకొని వచ్చాయి; మన ఆర్థిక వ్యవస్థను తీవ్రంగా ప్రభావితం చేశాయి. అలాంటి మార్పును తీసుకొని వచ్చిన సంస్కరణలను పార్లమెంటులో ప్రకటించి, ఆమోదాన్ని తీసుకొని ఉండాల్సింది కాని అది జరగలేదు. ఈ సంస్కరణల గుర్రాన్ని కళ్లాలు పట్టుకొని నడిపించింది అప్పటి ఆర్థిక మంత్రి మన్‌మోహన్‌సింగ్. ఇలాంటి సంస్కరణలు ఆసియా దేశాలకు, ముఖ్యంగా వర్ధమాన దేశాలకు హానికరమని ఒక నివేదికనే తయారు చేసిన మన్‌మోహన్‌సింగే ఆ సంస్కరణలకు సారథ్యం వహించటం గమనార్హం.

సంస్కరణలనే మాట మనకు కొత్త ఏమీ కాదు. వీరేశలింగంగారు ప్రవేశపెట్టిన విధవావివాహ సంస్కరణలు, గిడుగు రామ్మూర్తిగారి భాషా సంస్కరణలు, అలాగే మతాంతర, కులాంతర వివాహాలు - ఇలాంటి శుభపరిణామాలు, పరివర్తనాలు మనకు గుర్తుకు వస్తాయి. అలాగే ఆర్థిక సంస్కరణలు కూడా దేశానికి శుభసూచకం అని భావించిన వారు చాలా మంది ఉన్నారు. ఈ సంస్కరణలు కొత్తలో కరుస్తాయిగాని తర్వాత ముద్దు ముద్దుగానే ఉంటాయని ఆనాటి ప్రభుత్వనేతలు హామీ ఇచ్చారు. అసలీ సంస్కరణలేమిటి? ఎలా, ఎందుకు వచ్చాయి, ఏమి జరిగిందీ తెలుసుకోవాలనే ఉత్కంఠ సహజంగానే ఉంటుంది.

**వ్యాఖ్య**

1980లో అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వమెదుర్కొంటున్న ఆర్థిక క్లిష్ట పరిస్థితి నుంచి బయటపడడానికి అంతర్జాతీయ ద్రవ్య సంస్థ (ఐఎంఎఫ్) నుంచి అయిదు వేల డాలర్ల రుణం తీసుకోవటానికి నిర్ణయించుకొని, మొదటి వంతు రుణం తీసుకొని, ఆ రుణం తెచ్చుకోవటానికి విధించిన షరతులు కఠినంగా ఉన్నాయని భావించి, తర్వాత వంతుల రుణాన్ని తీసుకోలేదు. తదనంతరం అధికారంలోకి వచ్చిన రాజీవ్‌గాంధీ ఆధునికత అనే పట్టాల మీద '21వ శతాబ్దంలోకి' అనే నినాదాన్ని ఇచ్చారు. ప్రయివేటీకరణను అనుమతించి, విదేశాల నుంచి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకొని, పరిశ్రమలను ఆధునీకరించి, వీలయినంత త్వరగా అభివృద్ధి చెందిన దేశాల సరసన భారత దేశాన్ని నిలబెట్టాలనేది ఆయన లక్ష్యం. ఆయన పరిపాలనలోనే ప్రభుత్వ రంగ సంస్థలు, బ్యాంకుల మీద బాణాలను సంధించటం ప్రారంభించాయి. కాని ఆయన అనూహ్యంగా హత్యకు గురికావటంతో ఆ విధానం అమలుకు బ్రేకులు పడ్డాయి. ఆ తర్వాత వచ్చిన సంకీర్ణ ప్రభుత్వాల కాలంలో ఈ మార్పులు, చేర్పులు మందగించాయి. అదే సమయంలో ఆర్థిక పరిస్థితి దిగజారుతూ వచ్చింది. చంద్రశేఖర్ ప్రధాని పదవినలంకరించిన తర్వాత దుస్థితి తీవ్రతరమై మన దేశ బంగారు నిల్వలను బ్రిటన్‌కు కుదువపెట్టి నిధులు తెచ్చుకోవాల్సి వచ్చింది. అంతేకాదు. ప్రపంచబ్యాంకు నుంచి తెచ్చుకొన్న రుణాలు, ముఖ్యంగా అంతర్జాతీయ ప్రయివేటు బ్యాంకుల నుంచి తెచ్చుకొన్న రుణాలు, వడ్డీలు చెల్లించలేని పరిస్థితి ఏర్పడింది; ఈ చెల్లింపులు డాలర్లలో జరగాలి. కాని మన ఖజానాలో డాలర్లు నిండుకొన్నాయి. దేశంలోకి దిగుమతులు తక్కువ స్థాయిలో ఉండి ఎగుమతులు ఎక్కువ స్థాయిలో ఉంటే, మన ఇనప్పెట్టెలో డాలర్లు జమ అవుతాయి. ఆ డాలర్లతో రుణాలు చెల్లించవచ్చు. కాని అది జరగలేదు. ఈ డాలర్ల నిల్వలు రెండు వారాలు దిగుమతులకు చెల్లింపులకు కూడా చాలని సంకట పరిస్థితి. ఈ నేపథ్యంలో 1991లో అధికారంలోకి వచ్చిన పి.వి.నరసింహరావు ప్రభుత్వం, రుణాలు, వడ్డీలు చెల్లించడానికి ప్రపంచబ్యాంకు నుంచి రుణం తీసుకొని అర్జంటుగా తీర్చాల్సిన రుణాలు తీర్చి సంక్షోభం నుంచి బయటపడింది. కాని ప్రపంచబ్యాంకు ఈ రుణాన్ని ఊరకనే ఇవ్వలేదు; కొన్ని షరతులు విధించి, ఆ షరతుల మేరకే తీసుకోవాల్సిన చర్యలను తీసుకొంటానని ఒప్పందం మీద సంతకం పెట్టించుకొంది. ఆ షరతుల ముద్దు పేరే సంస్కరణలు.

ఇవి మనకు మనం రూపొందించుకొన్న సంస్కరణలు కావు; ప్రపంచబ్యాంకు షరతులను కేంద్ర ప్రభుత్వం తాను ప్రవేశపెడుతున్న సంస్కరణలే అని ముద్ర వేసుకొంది. ఇది మన సర్వం సహాధికారత విధానానికే విరుద్ధం. ప్రభుత్వం అంగీకరించిన ప్రధాన షరతులు: 1) ప్రభుత్వం తన బాధ్యతను పరిపాలనకే పరిమితం చేసుకోవాలి. వ్యాపారం చేయటం ప్రభుత్వ బాధ్యత కాదు. 2) ప్రభుత్వరంగ సంస్థలను ప్రయివేటీకరించాలి. 3) సబ్సిడీలు తగ్గించాలి. 4) పన్నుల ద్వారా ప్రభుత్వాదాయాన్ని పెంచాలి. 5) తల బరువుగా ఉన్న ప్రభుత్వ యంత్రాంగాన్ని కుదించాలి. 6) విదేశీ పెట్టుబడులకు తలుపులు బార్లా తెరవాలి. 7) బ్యాంకులను విజాతీయం చేయాలి. ఇన్సూరెన్సు రంగంలో విదేశీ పెట్టుబడులను అనుమతించాలి. 8) కొత్తగా భారీ నీటిపారుదల ప్రాజెక్టులు చేపట్టదలిస్తే వాటి ఆర్థిక భారాన్ని రైతులే మోయాలి. 9) ప్రభుత్వం అందించే ప్రతీ సేవకు యూజర్ ఛార్జీలు వసూలు చేయాలి. 10) ద్రవ్యలోటును తగ్గించాలి. ఇవన్నీ ఈ రోజున ప్రభుత్వ విధానాలుగా చలామణీ అవుతున్నాయంటే, అది ప్రపంచబ్యాంకు చలవే.

సంస్కరణలుగా పిలువబడుతున్న ఈ షరతుల గురించి ప్రధానంగా రెండు భిన్నాభిప్రాయాలున్నాయి. ఇవి షరతులు కాదు, సూచనలు, సలహాలు మాత్రమే. అవి మన దేశానికి మేలు చేస్తాయి, అభివృద్ధికి తోడ్పడతాయి, మన ఆర్థిక పరిస్థితి గండం గడిచి బయటపడుతుంది. పేదరికం తొలగి, ప్రజల జీవన ప్రమాణాలు పెరుగుతాయి. అందుచేత ఈ సలహాలను మేము అంగీకరించి, అవి మా ప్రభుత్వ విధానాలుగా భావిస్తున్నాం అంటున్నారు పాలకులు. ఈ అభిప్రాయాన్ని దేశంలోని పారిశ్రామికవేత్తలు, కొందరు ఆర్థికశాస్త్రవేత్తలు బలపరుస్తున్నారు. ఇది ఒక అభిప్రాయం.

కాదు, షరతులనే గొలుసులతో మన దేశాన్ని కట్టిపడవేసి ప్రపంచబ్యాంకు మన సర్వం సహాధికారాన్ని పూర్తిగా హరించి వేస్తుంది; రుణం పేరుతో మన దేశ అంతర్గత విషయాల్లో జోక్యం చేసుకొంటుంది. మన విధానాలను తనకనుకూలంగా మలుచుకొనేలా ఒత్తిడి చేస్తుంది. పేదరికాన్ని పారద్రోలడానికి సహాయం చేస్తానన్న పేరుతో పేదరికాన్ని పెంచిపోషిస్తుంది. మన భారతీయ సంస్కృతిని కలుషితం చేస్తుంది. ప్రపంచబ్యాంకు సహాయం చేసిన సుమారు 80 ప్రపంచ దేశాల్లో సరిగ్గా ఇలాగే జరిగింది. రుణం అనే ఉచ్చులో చిక్కుకొని విలవిలలాడుతున్నాయి. మన వ్యవసాయం కార్పొరేట్ పరమవుతుంది. ఇలా సాగుతుంది రెండో అభిప్రాయం. రెండూ రెండు భిన్న ధృవాలు. ముందు ప్రపంచబ్యాంకు కథా కమామిషు ఏమిటో క్లుప్తంగా తెలుసుకోవటం అవసరం.

ప్రపంచంలో అనేక దేశాలకు రుణాలిచ్చుకొంటూ పోవడానికి ప్రపంచబ్యాంకుకు అంత డబ్బెక్కడ నుంచి వచ్చింది? మీరూ, నేను బ్యాంకులో డబ్బు జమచేస్తే, వడ్డీతో సహా తిరిగి చెల్లిస్తుంది. మనం జమ చేసిన సొమ్మును అవసరమైన వారికి హెచ్చు వడ్డీకి ఇచ్చి, వాళ్లు చెల్లించిన వడ్డీ నుంచే బ్యాంకు మనం జమ చేసిన సొమ్ము మీద వడ్డీ చెల్లించి, మిగతాది తన ఖర్చులకు ఉంచుకొంటుంది. ప్రపంచబ్యాంకు అలాకాదు. అభివృద్ధి చెందిన దేశాల్లో బహుళజాతి కంపెనీల లాభాలు, పెన్షన్ ఫండ్స్ లాంటి వాటిలో కోట్లాది డాలర్ల డబ్బు మూలుగుతోంది. ఆ దేశాల్లో వడ్డీ రేటు మనలాంటి దేశాల్లో కన్నా చాలా తక్కువ. అందుచేత ఏ దేశంలో డబ్బు వడ్డీకిస్తే ఎక్కువ వడ్డీ వస్తుందో, లాభం వస్తుందో ఆదేశంలో పెట్టుబడి పెట్టమని, మంచి వడ్డీ సంపాదించి పెట్టమని ఆ సంస్థలు ప్రపంచబ్యాంకుకు డబ్బు మదుపు పెడతాయి. ప్రపంచబ్యాంకు చేసే పనేమిటంటే ఏయే దేశాలు నిధుల కోసం కటకటలాడుతున్నాయి, ఏ దేశాలు రుణ సహాయం కోసం వెతుకులాడుతున్నాయి అని దుర్భిణీ వేసి చూడడం, ఆ దేశాలకు రుణ సహాయం చేయటం, వడ్డీతో సహా తిరిగి రాబట్టి, తన బ్యాంకులో జమ చేసిన వారికి ఆ వడ్డీలను చెల్లించటం. అయితే, అసలే ఆర్థికంగా కష్టాల్లో ఉన్న దేశాలకు రుణం ఇవ్వటం రిస్కుతో కూడుకొన్న పని కాబట్టి, ఆ దేశాలు 'మేము తిరిగి చెల్లించలేం' అని చేతులెత్తేస్తే? అందుచేత రుణం ఇచ్చేటపుడు, ఆ రుణ ధనంతో ప్రభుత్వాలు ఏం చెయ్యాలో, ఎలా చేయాలో, ఎక్కడెక్కడ పెట్టుబడి పెడితే ఆ ధనం క్షేమంగా ఉంటుందో, ఏ కార్యక్రమాలు చేపడితే తను రుణంగా ఇచ్చిన డబ్బు గ్యారంటీగా తిరిగి వస్తుందోనని తెలుసుకొని, ఆ పద్ధతుల్లోనే ఖర్చు చేస్తేనే రుణం ఇస్తాననే షరతు విధిస్తుంది. అలా రుణం ఇచ్చిన తర్వాత, అనుకొన్న షరతు ప్రకారం పనులు జరుగుతున్నాయా లేదా అని తరచుగా పరిశీలిస్తూ, ఆ మేరకు ఆ దేశాల ప్రభుత్వాల అంతర్గత పరిపాలనా విషయాల్లో జోక్యం చేసుకొంటూ ఉంది. అప్పులిచ్చే అందరిలాగే, అసలు కన్నా, వడ్డీ మీద ప్రపంచబ్యాంకుకు మక్కువ ఎక్కువ. ప్రతి సంవత్సరం వడ్డీ మాత్రం తనకు తిరిగి చెల్లించేలా, బడ్జెట్లలో అందుకు కేటాయింపులు చేసేలా జాగ్రత్త పడుతుంది. ఈ వడ్డీ వ్యాపారాన్ని ప్రపంచబ్యాంకు ఒక్కటే కాదు, అంతర్జాతీయంగా అనేక సంస్థలు వర్ధమాన దేశాలతో చేస్తుంటాయి. ప్రపంచబ్యాంకు వైఖరి ఇదయితే, రుణం తీసుకొన్న వర్ధమాన దేశాలు వడ్డీ భారంతో కుంగిపోతుంటాయి; అసలు చెల్లింపులు అనుకొన్నట్లు జరగవు. దానితో వడ్డీ మరింత పెరుగుతుంది. వాటిని చెల్లించడానికి మళ్లా ఆ బ్యాంకు దగ్గరే రుణం తెచ్చి చెల్లింపులు చేస్తూంటాయి. దానితో రుణభారం ఇంకా పెరిగిపోతుంది. ఇదే సమయంలో ప్రపంచబ్యాంకు విధించిన షరతుల మేరకు తీసుకొని రావాల్సిన మార్పులను, చేయాల్సిన పనులను వేగంగా అమలు పరచాలని, అమలు పరచక పోతే, మీరింకా ఊబిలో దిగబడిపోతారని, మీ ఆర్థిక సమస్యలు తీరవని ఒత్తిడి తీసుకొని వస్తూంటుంది. వర్ధమాన దేశాలు ఈ విష వలయంలో చిక్కుకొని, ఆ సంస్కరణలను అమలు చేయకపోతే ప్రపంచబ్యాంకు నుంచి, అమలు పరిస్తే తమ దేశ ప్రజల నుంచి నిరసనలెదుర్కొంటూ గిలగిలలాడుతుంటాయి. కాని వడ్డీ వ్యాపారస్తునికి రుణం తీసుకొన్న వాళ్లు తిరిగి చెల్లించలేక పడే ఇబ్బందులు పట్టవు; తన వడ్డీ, అసలు తిరిగి రాబట్టుకోవాలి.

ఈ సంస్కరణలతో పాటు (సరళీకరణ అని కూడా అంటారు) ప్రయివేటీకరణ, ప్రపంచీకరణ విధానాలు కూడా మన దేశంలో కాలుపెట్టాయి. ప్రయివేటీకరణ అంటే కేవలం ప్రభుత్వరంగ పరిశ్రమలనే కాదు, యావత్ ఆర్థిక విధానాన్ని ప్రయివేటు రంగం స్వాధీనం చేయటమే. ప్రభుత్వ రంగం అంటే ప్రభుత్వం చేతుల్లో ఉంటుంది కాబట్టి, ప్రభుత్వం పార్లమెంటుకు జవాబుదారీ కాబట్టి, పార్లమెంటు అంటే ప్రజాప్రతినిధుల సభ కాబట్టి, ఆ సంస్థలు ప్రజలకు జవాబుదారీగా ఉంటాయి.

ఉత్పత్తుల ధరలను ప్రభుత్వం నియంత్రిస్తుంది. ప్రయివేటు రంగానికి వదిలిపెడితే, ధరలను మార్కెట్ నియంత్రిస్తుంది. ప్రయివేటు రంగానికి లాభాలార్జించటం ప్రధానం కాబట్టి వాటి ధరలను వారిష్టం వచ్చినట్లు నిర్ణయిస్తారు. ఆర్.టి.సి.ని ప్రయివేటీకరిస్తే ఛార్జీలు పెరుగుతాయి. ఈ కారణాలన్నిటి వల్లా ప్రయివేటీకరణను కొంతమంది, ముఖ్యంగా ఉద్యోగులు, కార్మికులు వ్యతిరేకిస్తుండగా, ప్రభుత్వం ప్రయివేటీకరణ, మార్కెటీకరణ చేస్తే, వస్తువుల, సేవల నాణ్యత, సమర్థత, ఆధునికత సాధ్యపడుతుందని, ప్రయివేటు సంస్థలు మార్కెట్‌లో పోటీ పడతాయి కాబట్టి వినియోగదారులకు లాభమని,

ప్రయివేటీకరణను తన విధానంగా చేపట్టింది; కంట్రోళ్లు ఎపుడో ఎత్తివేసింది. తిండిగింజలు, మందులు లాంటి కొన్ని వినియోగ వస్తువుల మీద ప్రభుత్వ ధరల నియంత్రణ కొనసాగుతుంది. అయితే ఈ ఉత్పత్తుల వ్యాపారంలో ఉన్న ప్రయివేటు సంస్థలు ప్రభుత్వ విధానాలను తమకనుకూలంగా మార్చుకోవడానికి, ప్రభుత్వ ప్రమేయం పూర్తిగా తొలగించడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాయి.

సరళీకరణ విధానాన్ని ప్రకటించటంతో పాటు వెన్వెంటనే నూతన పారిశ్రామిక విధానాన్ని కూడా ప్రకటించారు. ప్రపంచబ్యాంకు సూచనల మేరకు ప్రకటించిన విధానం ప్రకారం-

1) విదేశీ వాణిజ్యంలో లైసెన్సింగ్ విధానాన్ని ఉపసంహరించారు.
2) పారిశ్రామిక విధానంలో గత ఏభై సంవత్సరాలుగా కొనసాగిన విదేశీ పెట్టుబడుల నిష్పత్తి శాతంపై ఉన్న ఆంక్షలను తొలగించారు. ఎవరు ఏ పరిశ్రమలోనైనా ఎంతైనా పెట్టుబడి పెట్టవచ్చు.
3) ప్రభుత్వరంగం సంస్థలకు కేటాయించిన కొన్ని కీలక పరిశ్రమల్లో ప్రయివేటు భాగస్వామ్యం ఉంటుంది. ప్రభుత్వరంగ సంస్థల ఈక్విటీలను ప్రయివేటు వ్యాపార సంస్థలు కొనుగోలు చేయవచ్చు. అవి విదేశీ సంస్థలయినా ఫర్వాలేదు.
4) ద్రవ్యలోటును తగ్గించడం కోసం అనవసర ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించాలి. అంటే సబ్సిడీలను ఎత్తివేయటం; విద్య, ఆరోగ్యం, సంక్షేమం లాంటి రంగాలపై బడ్జెట్‌లో కోత విధించారు. ద్రవ్యలోటును జాతీయాదాయంలో 5 శాతానికి తగ్గించాలి.
5) ప్రభుత్వరంగం పరిశ్రమలను ప్రయివేటీకరించాలి. వాటి ఈక్విటీని అమ్మివేయాలి.
6) పోటీని, సమర్థతను పెంచుకోవాలనే వాదనతో ప్రపంచ మార్కెట్‌లో ప్రవేశం.
7) గతంలో ఉన్న ఎం.ఆర్.టి.పి. చట్టాన్ని కుదించి, అది విధించే పరిమితులు తగ్గించాలి.
8) విదేశీ సాంకేతిక ఒప్పందాలకు ప్రభుత్వ అనుమతి అవసరం లేదు.
9) కంపెనీల చట్టం సవరించి ఇపుడున్న శ్రామికుల, పెట్టుబడి సంబంధిత అడ్డంకులను తొలగించాలి.
10) విదేశీ కన్సల్టెంట్లు, నిపుణుల సలహాలను వాడుకోవాలి. ప్రపంచీకరణకు అన్ని విధాలా దేశాన్ని బార్లా తెరవాలి.

ఈ సూచనలను అంగీకరించిన భారతదేశం మన పారిశ్రామిక రంగాన్ని విదేశీ, బహుళజాతి సంస్థల దయాదాక్షిణ్యాలకు వదలిపెట్టిందనే విమర్శ ఉంది. ఎందుచేతనంటే ప్రభుత్వ రంగ సంస్థలన్నీ ప్రజలు ప్రభుత్వానికి పన్నులు, తదితర విధాలుగా అందచేసిన నిధులతో నిర్మితమయ్యాయి. ప్రపంచ పారిశ్రామిక పటంలో భారత దేశానికి ఒక స్థానాన్ని సంపాదించి పెట్టింది. వాటిని అమ్మి వేయడమంటే అది మళ్లీ పారిశ్రామిక పరాధీనతకు దారితీస్తుంది.

**ప్రపంచీకరణ**

ఇటీవల వినపడుతున్న మరోమాట ప్రపంచీకరణ (గ్లోబలైజేషన్). డబ్బు, వస్తువులు, మనుషులు దేశాల ఎల్లలను మరచి, ఒక దేశం నుంచి మరో దేశానికి ప్రపంచమంతా నిర్నిబంధంగా ప్రయాణించడమే ప్రపంచీకరణ, వివిధ దేశాలు పరస్పరాధారంగా మనుగడ సాగించడమే ప్రపంచీకరణ. ఒక రకంగా చూస్తే ప్రపంచీకరణ అనే ఆలోచన కొత్తదేమీ కాదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పరిపాలించిన దేశాలన్నిటినీ కలిపి కామన్‌వెల్త్ అని నామకరణం చేశారు. అలాగే సోవియట్ యూనియన్ ప్రపంచ పటం నుంచి నిష్క్రమించిన తర్వాత అమెరికా ఏక ధృవ ప్రపంచంగా తయారై ప్రపంచాన్నంతటినీ తన అధికార ఛత్రఛ్ఛాయ ల్లోకి తీసుకోవాలని సంకల్పించి ఆ దిశగా పావులు కదుపుతోంది.

అమెరికాలో టన్నులకు టన్నుల డబ్బు మూలుగుతోంది. బ్యాంకుల్లో, పెన్షన్ ఫండ్స్‌లో, బహుళజాతి సంస్థల ఇనప్పెట్టెల్లో డబ్బే డబ్బు. ఆ డబ్బు పిల్లల్ని పెడితేనే గాని, అంతకు మరింత అయితే గాని తప్ప అమెరికాకు తోచదు. అదెలా సాధ్యం? 1) ఆ డబ్బెక్కడైనా అప్పిచ్చి, వడ్డీ సంపాదించవచ్చు. 2) ఆ డబ్బుతో పరిశ్రమలు స్థాపించి లాభాలు సంపాదించవచ్చు. 3) దేశాలకు దేశాల మధ్య తంపులు పెట్టి, వాళ్లు పరిష్కారం చేసుకోకుండా తగవును ఎగదోస్తూ, ఇద్దరూ పీకల్దాకా సాయుధీకరణ చేసుకొంటూంటే, వాళ్లకు అమెరికాలోని యుద్ధ పరిశ్రమలు ఆయుధాలు తయారుచేసి సరఫరా చేస్తూ లాభాలు చేసుకోవచ్చు. ఆ విధంగా తన సమస్యను పరిష్కారం చేసుకోవాలంటే ఇతర దేశాల్లో సమస్యలు సృష్టించాలి. అంటే తన సమస్యను ప్రపంచీకరణ చేయాలి. ఇపుడు జరుగుతున్నదిదే. అలా జరగడానికి ప్రపంచంలో వివిధ దేశాల్లో నిప్పుల్లో పప్పులేరి పెట్టేవాళ్లను ఎంచుకొంటుంది. ప్రపంచ దేశాలన్నీ అమెరికా గుప్పిట్లో చిక్కుకొని పోవడానికి అలాంటి నాయకులు సహాయపడుతున్నారు.

పై పద్ధతులను మనదేశం మీద అమెరికా, ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్, డబ్ల్యుటివో లాంటి సంస్థల ద్వారా ఎలా అమలు పరుస్తుందో కనపడుతూనే ఉంది. సంస్కరణలు ప్రారంభించినపుడు 90 బిలియన్ డాలర్లుగా ఉన్న విదేశీ రుణభారం నేడు సుమారు 140 బిలియన్ డాలర్లు కావటం ఒక ఎత్తయితే, దానిమీద చెల్లించే వడ్డీలు మన ఆర్థిక వ్యవస్థనంతా తలకిందులు చేస్తున్నాయి. వడ్డీలు చెల్లించడానికి కూడా మళ్లా అప్పు చేయాల్సిన పరిస్థితి. రెండో పక్క ద్రవ్యలోటు తగ్గించుకోవాలని ఒత్తిడి చేస్తుంది. అది తగ్గించుకోవడానికి ప్రభుత్వ ఖర్చులు అంటే ఉద్యోగుల జీత భత్యాలు, ప్రభుత్వ ఖర్చులు, రక్షణ ఖర్చు తగ్గించుకోవాలి. అవి తగ్గించుకోలేక, సంక్షేమ పథకాల కేటాయింపుల మీద వేటు వేస్తుంది. ఇందువల్ల అటు బడ్జెట్‌నూ సంభాళించుకోలేదు, ఇటు ప్రజల క్రోధాగ్నులెదుర్కోవడం తప్పడం లేదు. ప్రభుత్వం బలహీనపడుతుంది. మళ్లా అమెరికా వైపే చూస్తారు. ప్రపంచబ్యాంకుకు కావాల్సింది సరిగ్గా ఇదే. ఇదంతా ప్రపంచీకరణలో భాగం. అంటే దేశం ఆర్థిక దుస్థితిని ఎదుర్కోవటానికి ప్రపంచీకరణే కారణం.

రెండవది పరిశ్రమలు స్థాపించి డబ్బు చేసుకోవటం. కాని పరిశ్రమలు పెట్టకుండానే డబ్బును రెండింతలు చేసుకోగలిగితే అంతకన్నా ఇంకేమి కావాలి? అందుకోసం రెండు పనులు చేసింది. డబ్ల్యుటివోను సృష్టించి, దేశాల మధ్య వ్యాపారానికున్న అడ్డంకులను తొలగించేసుకొని, స్వేచ్ఛగా వారి ఉత్పత్తులను ఆ దేశాలకు ఎగుమతి చేసి, స్థానిక పరిశ్రమలను దెబ్బతీసి, మార్కెట్‌ను కైవసం చేసుకొంటూంది. ఇంత సులువు లాభాలు చేసుకోగలిగినపుడు, వచ్చి పరిశ్రమలెందుకు పెట్టాలి? అలాగని పరిశ్రమలు పెట్టడం లేదని అనుకోవడానికీ వీలులేదు. వారి వారి దేశాల్లో కన్నా, వర్ధమాన దేశాల్లో చవకగా కార్మిక శక్తి లభ్యత, రకరకాల మినహాయింపులు, ప్రోత్సాహకాల లభ్యతను బట్టి, పరిశ్రమలు స్థాపించి ఉత్పత్తి ఖర్చు తగ్గించుకొని, తిరిగి తమ దేశానికి ఎక్కువ ధరకు అమ్ముకొని లాభాలు సంపాదించవచ్చు. ఏ విధానాన్ని అవలంబించేది ఆయా దేశాల్లో పరిస్థితిని బట్టి నిర్ణయించుకొంటాయి. ఇలా చేయటం వల్ల ఆయా దేశాల స్వదేశీ పరిశ్రమలనూ అడ్డు తొలగించుకోవచ్చు, ఆ మార్కెట్లూ కాజేయవచ్చు, లాభాలూ సంపాదించవచ్చు.

మూడవది దేశాల మధ్య ఆరని చిచ్చు రగిలించిం దనడానికి భారత-పాకిస్తాన్ యుద్ధ వాతావరణమే తిరుగులేని సాక్ష్యం. అమెరికా అటు పాకిస్తాన్‌తో, ఇటు భారతదేశంతో సత్సంబంధాలు పెట్టుకొంటున్నట్లే నటిస్తూ, తెర వెనుకనుంచి, ఇద్దరూ ఒకరి పీకలు మరొకరు కోసుకోవడానికి, యుద్ధ సన్నాహాలు చేయడానికి, అందుకు కావాల్సిన ఆయుధాలను సరఫరా చేస్తూ తోడ్పడుతూ, ఆ ఆయుధాలు తయారుచేసే అమెరికన్ సంస్థల లాభాలకు తోడ్పడుతూ, ఈ చేత్తో ఇచ్చే ఆర్థిక 'సహాయం' మరో చేత్తో పరోక్షంగా తమ దేశానికే లాభాలతో సహా తిరిగి చేరేలా చూసుకొంటున్నారు. విధాన స్థాయిలో, ఎత్తుగడల స్థాయిలో ప్రపంచీకరణను వివిధ దేశాల మీద రుద్దుతున్నాయి. కేవలం దేశాల ఆర్థిక విధానాలను దేశాధిపతులను ప్రభావితం చేయడమే కాక, ప్రజలను కూడా హద్దుల్లేని దోపిడీకి గురి చేస్తున్నారు. తామిచ్చిన ఆర్థిక 'సహాయం'కు షరతులను తగిలించి రైతాంగాన్ని సబ్సిడీల కోత, విద్యుచ్ఛక్తి, నీటి పారుదల ఛార్జీల పెంపు, ధరల పెరుగుదల, యూజర్ ఛార్జీల ద్వారా ఉత్పత్తి ఖర్చుల భారాన్ని పెంచి, గిట్టుబాటు ధర లభించక, అయినకాడికి అమ్ముకోవాల్సి రావటంతో, చేసిన అప్పులు తీర్చలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారంటే, మరోవైపు కార్పొరేట్ వ్యవసాయాన్ని ప్రవేశపెట్టించి, సన్న, చిన్నకారు రైతులను రిక్షా లాక్కొని బతకాల్సిన పరిస్థితికి నెట్టుతున్నారంటే అదంతా ప్రపంచీకరణ ఫలితమే.

ఇక కార్మికులు, మధ్య తరగతి ఉద్యోగులకు మళ్లా అదే ప్రపంచబ్యాంకు షరతుల మేరకు 1) యాజమాన్యాలకు హైర్ అండ్ ఫైర్ అధికారం, 2) కాంట్రాక్టు లేబరు పద్ధతి ప్రవేశ పెట్టడం, 3) పదుల సంవత్సరాల పోరాటాలతో, బలి దానంతో సాధించుకొన్న సౌకర్యాలు, హక్కులు అన్నింటినీ ఉపసంహరించడం, 3) డౌన్‌సైజు, రైట్‌సైజు అనేక రకాల పేర్లతో, ఉద్యోగుల సంఖ్యను తగ్గించటం, 4) కాజువల్ లేబర్ పద్ధతి విస్తృతంగా ప్రవేశ పెట్టడం, 5) పని భారాన్ని పెంచడం, 6) నిరుద్యోగుల సంఖ్యను విఆర్ఎస్ ద్వారా పెంచడం, 7) ఉద్యోగంలో ఉన్న వారికి జీతాలు తగ్గించటం. ఇవన్నీ కొన్ని ఉదాహరణలు మాత్రమే. క్లుప్తంగా చెప్పాలంటే ఉద్యోగంలో ఉన్న వాడికి రక్షణ లేదు, లేని వాడికి ఉద్యోగ వసతి కల్పించే ప్రశ్నే లేదు. ఇవన్నీ ప్రపంచీకరణ దుష్ఫలితాలే. ఇలాంటి ప్రపంచీకరణను బలపర్చాలట.

ప్రపంచీకరణలో మరో ముఖ్యమైన పరిణామం వస్తువులను ఎగుమతి చేయటమే కాదు డబ్బునే ఎగుమతి చేయటం. దీనినే ఫైనాన్స్ కాపిటల్ అంటారు. ప్రపంచ దేశాల మధ్య కేవలం రెండుశాతం డబ్బు మాత్రమే వ్యాపారానికి సంబంధించిన లావాదేవీల ద్వారా వరాటా అవుతుండగా, మిగతాదంతా ఫక్తు డబ్బు పరాటాతో ప్రపంచమంతటా ఎక్కడ ఎక్కువ లాభాలు వస్తే అక్కడకు టూర్ చేస్తుంటుంది. దీనికి మరో పేరే 'డబ్బు ప్రపంచీకరణ'. డబ్బు ఒక వ్యాపార సరుకయిపోయింది. అదే వ్యాపార సరుకయినపుడు, ఆ డబ్బుకు వస్తువుల ఉత్పత్తి ప్రమేయం ఉండదు. ఒక చోట నుంచి ఒక చోటకు అంటే ఎక్కడ ఆ డబ్బుతో స్పెక్యులేషన్ చేసి, డబ్బుతో పిల్లలు పెట్టించవచ్చునో అక్కడకు ఒక బటన్ నొక్కితే వెళ్లిపోతుంది. అందుకనే ఇది ధనం ప్రపంచీకరణ అనవచ్చు. అయినా, ప్రపంచ ఆర్థిక వ్యవస్థలన్నీ పెనవేసుకుపోతున్నాయ్. మనం మడి కట్టుకుని కూర్చుంటే ఎలా? ఆ గ్లోబలైజేషన్ భాగస్వాములం కావాలని మన పాలకులు అంటున్నారు.

గ్లోబలైజేషన్ ప్రభావం గురించి వివరిస్తూ హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్ట్, పెరుగుతున్న సంపద వెల్లువలో పెద్ద పడవలు తేలియాడుతుండగా చిన్న తెప్పలు, దోనెలు ప్రవాహపు వాలుకి కొట్టుకుపోయి క్రమంగా మునిగి పోతున్నాయని పేర్కొంది. అంటే ధనికులు విపరీతంగా లాభం పొందుతుండగా పేదలు తీవ్రంగా నష్టపోతున్నారని ఈ రిపోర్టు తేల్చి చెప్పింది. యుఎన్‌డిపి ప్రపంచ వ్యాప్తంగా సమాచారాన్ని సేకరించి ప్రపంచీకరణ ఎటువంటి దుస్థితికి దారితీసిందో వివరిస్తోంది.

- ప్రపంచంలోకెల్లా ధనికులైన ముగ్గురి ఆదాయం 36 పేద దేశాల ఆదాయం కన్న ఎక్కువ.
- ప్రపంచంలోని అత్యంత సంపన్నులైన 200 మంది సంపదలో ఒక్కశాతం (అంటే 8 బిలియన్ డాలర్లు) ఖర్చు పెడితే ప్రపంచంలోని పసి పిల్లలందరికీ ఒక సంవత్సరం పాటు ఉచిత ప్రాథమిక విద్యను అందించవచ్చు.
- ప్రపంచంలో రూపొందుతున్న స్థూల జాతీయాదాయాల మొత్తంలో 86 శాతాన్ని కేవలం సంపన్న దేశాలలో నివసిస్తున్న 20 శాతం మంది ధనికులు సొంతం చేసుకుంటున్నారు. ఆ ఇరవై శాతం మంది చేతుల్లోనే ప్రపంచంలోని ఎగుమతి మార్కెట్లలో 82 శాతం, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల్లో 68 శాతం, ప్రపంచంలోని టెలిఫోన్లలో 74 శాతం ఉన్నాయి.

( మిగతా 23వ పేజీలో)

# సామాన్యుని నట్టింట్లో సామ్రాజ్యవాదం!

| విద్యాభూషణ్ |

ఇటీవల పత్రికల్లో చూసిన ఓ వార్తాకథనం ప్రకారం ఆదిలాబాద్‌కు చెందిన గిరిజన అటవీ ప్రాంతాల్లో విద్యుత్ బకాయిలు చెల్లించలేదని ట్రాన్స్‌కో అధికారులు పల్లెలకు పల్లెల్లో విద్యుత్ సరఫరా నిలిపివేశారట. దీంతో అక్కడి ప్రజాజీవనం అతలాకుతలం అయిపోయిన వైనం మన ముందుకొచ్చింది. వివరాల్లోకి వెళ్తే, ఆయా ప్రాంతాల్లో మీటర్లు బిగించకుండానే వేలాది రూపాయల్లో బిల్లుల వంపిణీ చేపట్టి, ఆయా బిల్లులు చెల్లించలేదన్న సాకుతో విద్యుత్ సరఫరా నిలిపివేశారన్నది సారాంశం. విద్యుత్ శాఖ అధికారుల నిర్వాకంతో ఈ గిరిజన ప్రాంతాల్లో వ్యవసాయ బావులతో పాటు చివరకు రక్షిత మంచినీటి పథకాలు పనిచేయక గుక్కెడు మంచినీళ్లకు సైతం అలమటించే పరిస్థితులూ నెలకొన్నాయి. మరోవైపు ఆయా ప్రాంతాల్లోని పిండిమరలు సైతం పనిచేయక తినే రొట్టెకు సైతం కటకట లాడాల్సిన పరిస్థితి. ఈ ధోరణి నేడు మారుమూల గిరిజన ప్రాంతాల్లో ప్రారంభం అయి, అక్కడితో ఆగిపోతుందనుకుంటే మనం పప్పులో కాలేసినట్టే! ఉత్తరోత్తరా ఈ పరిస్థితి పట్టణాలకూ విస్తరించే వీలుంది. ఈ నేపథ్యం దేన్ని సూచిస్తుందనే వివరాల్లోకి వెళ్తే, సంస్కరణల రెండో విడత ప్రభావంతో సామ్రాజ్యవాద ప్రభావం సామాన్యుని నట్టింట్లో తిష్ట వేయనుందనే వాస్తవం వ్యక్తమౌతుంది.

**వ్యాఖ్య**

తమ ఉత్పత్తులకు మూడో ప్రపంచ దేశాల మార్కెట్‌ను వినియోగించుకునే లక్ష్యంతోనే సామ్రాజ్యవాదం సంస్కరణల ముసుగులో తమ పంజాను విసరనారంభించింది. గత పదిహేనేళ్ల అనుభవాన్ని సమీక్షించుకుంటే ఇది ఎవ్వరూ కాదనలేని వాస్తవంగా రూఢవుతుంది. గతంలో ఎప్పుడో, వలస పాలనలతో విస్తరించనున్న సామ్రాజ్యవాదం 'అభివృద్ధి' పేరిట 'సంస్కరణ'లనే దగ్గరి మార్గాన్ని ఎంచుకుంది. ప్రజాహితాన్ని గాలికొదిలేసిన పాలకవర్గాలు యిందుకు సరిజోడీగా తరతమ భేదం లేకుండా వంతపాడటం మన మెరిగిందే. ఇదే అదనుగా సామ్రాజ్యవాదం వ్యవసాయరంగం మీద ప్రప్రథమంగా పట్టుబిగించ ప్రారంభించింది. ప్రారంభంలో ఆయా భౌగోళిక- నైసర్గిక పరిస్థితులను పక్కకు నెట్టేసి సాంప్రదాయ వ్యవసాయ విధానాలకు మంగళం పాడేసి, కార్పొరేట్ వ్యవసాయ విధానాలకు బీజం వేసింది. దీంతో మెజార్టీగా ఉన్న చిన్న-సన్నకారు రైతాంగం జీవనాధారమైన తమ సేద్యాన్నే వదులుకుని, వలసలకు నెలవైన వాస్తవమూ మనముందు ఉంది. సరిగ్గా యిదే అదునుకోసం ఎదురు చూస్తూ ఉన్న, నల్లధన నిల్వలున్న పెట్టుబడిదార్లు కార్పొరేట్ వ్యవసాయ రంగాన్ని కైవసం చేసుకున్నారు. ఈ రోజు కొల్లేరు సరస్సులో సాగుతున్న కపట నాటకం దీన్నే సూచిస్తుంది. వ్యక్తి అభివృద్ధినే కాంక్షించే సంస్కరణలను ఎలాగూ ఈ వర్గం ఆహ్వానిస్తుంది. ఇందుకు సైదోడుగా భూసంస్కరణల మాటున ఉన్న భూస్వాములు సైతం పనిలో పనిగా వీరికి జతకావడం సహజంగానే జరిగింది. ఇక్కడ ప్రధానంగా మనం గుర్తించాల్సిన పరిణామం, కౌలుదార్ల స్థానం నుంచి చిన్న-సన్నకారు రైతాంగం తప్పుకుంటే, పెట్టుబడిదార్లు కౌలుదార్లుగా ఆవిష్కరించారు. వీరినే పరోక్ష భూస్వామ్య కౌలుదార్లుగా మనం పేర్కొనవచ్చు. ఇందుకు చేయగలిగిన సహాయాన్నంతా పాలక వర్గాలు అందిస్తున్న కారణంగానే, ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఓ)తో రాజీ ధోరణులను అనుసరించాల్సి వస్తుందన్నది మరో వాస్తవం. ఇంత జరుగుతున్నా అణగారిన ప్రజానీకం భూసంస్కరణల అమలుకై డిమాండు చేస్తున్న కారణంగా, సామ్రాజ్యవాదం, వ్యవసాయరంగంలో భూవసతి తరువాతి ప్రాధాన్యతా అంశమైన విత్తనం (సీడ్స్)పై తన పట్టును బిగించి, రైతాంగం చేపట్టిన సేద్యానికి గిట్టుబాటే లేని పరిస్థితిని కల్పించింది. దీంతో అరకొరగా ఉన్న పేద రైతాంగం తమ ఉత్పత్తికి కీలకమైన విత్తనాలకై ఆందోళనలు చేపట్టాల్సి వచ్చింది. మరో వైపు ఆరుగాలం కష్టించి పండించిన పంట గిట్టుబాటు ధరకై ఉద్యమించడమూ మనం చూశాం.

మార్కెట్ విస్తరణే ప్రధాన లక్ష్యంగా సాగుతున్న సంస్కరణలు, గిట్టుబాటు ధర లభ్యం కానందుకు ఒక వైపు రైతులను ప్రకోపింపజేస్తూనే, మరోవైపు గిట్టుబాటు ధర కల్పించలేని విపత్కర పరిస్థితుల్లో తిండిగింజల ఉత్పత్తి స్థానంలో వాణిజ్య పంటలను పండించమని రైతులకు, స్వయానా పాలక వర్గాలే హితవు పలికేలా చేయగలిగింది. వెరసి అరకొర సేద్యాన్ని నమ్ముకున్న రైతాంగం తమకు కావలసిన తిండిగింజల స్థానంలో - బతుకు వెళ్లదీసుకునేందుకనువైన వాణిజ్య పంటలనే విశ్వసించాల్సిన దయనీయ పరిస్థితులకు నెట్టేయబడ్డారు. దీంతో 'అభివృద్ధి' ముసుగులో తిండిగింజల కొరత, ఫలితంగా దిగుబడులపై ఆశలు నింపుకోవడం అనివార్యమయింది.

ఇక, సామ్రాజ్యవాదపు రెండో ఎత్తుగడ - ఆర్థిక సహకారం. తాము పెట్టిన అన్ని షరతులకూ తలవొగ్గి, 'దేహీ' అని చేతులు చాపి రుణాన్ని ఆశించడానికి పాలక వర్గాలు పెట్టుకున్న ముద్దు పేరు - 'ఆర్థిక సహకారం'. ఇందుకు పాలకులు ఘోషిస్తున్న అభివృద్ధి సూత్రం - పారిశ్రామికీకరణ. స్వాతంత్ర్యానంతరం సోషలిస్టు దేశాల సహాయ సహకారాలతో దేశంలో కొద్ది మేరకైనా పారిశ్రామికీకరణ జరిగిందనేది అందరూ ఆమోదించదగిన వాస్తవం. ఈ నేపథ్యంలోనే

ప్రభుత్వరంగం వేళ్లానుకుంది. అయితే ఈ సంస్కరణలు వచ్చేనాటికి ఆధునిక సాంకేతికత లేనిదే అభివృద్ధి మృగ్యమని, పచ్చగా ఉన్న పరిశ్రమలన్నింటినీ మూసివేసే ప్రయత్నాలకు తలుపులు తెరిచేలా చేశారు. ఫలితంగా ఉద్యోగులు నిరుద్యోగులుగా రోడ్డున పడగా, ప్రజాధన వినియోగంతో ఏర్పర్చుకున్న ప్రభుత్వ రంగ ఆస్తులను ప్రైవేటు వ్యక్తుల పరం చేయడానికి రంగం సిద్ధమయింది. ఈ ఎత్తుగడలో మరో ప్రధానాంశం - సంఘటిత కార్మిక శక్తిని అసంఘటిత రంగంలోకి నెట్టేసి, సోషలిస్టు తరహా వాదనలకు కీలకమైన కార్మిక శక్తిని నిర్వీర్యం చేయటమే నన్నది ఎల్లరూ గుర్తెరగాల్సిన వాస్తవం.

ఈ రకంగా ప్రభుత్వ ఆధిపత్యాన్ని ప్రైవేటు పరం చేసేయడంతో ఊరుకోకుండా, సామాన్యుడిపై ఎనలేని ఆర్థిక ఒత్తిడి తీసుకురావాలన్న యత్నమూ జరిగింది. వినియోగ రంగాన్ని ఎడాపెడా విస్తరింపజేసి, అధునాతన జీవన సరళికి సామాన్యులు అర్రులు చాచేలా చేసింది సామ్రాజ్యవాదం. దీంతో సాంప్రదాయ వృత్తులపై జీవనాన్ని వెళ్లదీసే వర్గాలు చేష్టలుడిగి బజారున పడాల్సిన పరిస్థితులకు నెలవైనారు. ఈ రోజు రైతాంగ ఆత్మహత్యల మాదిరిగా, చేతివృత్తుల వారూ ఆత్మహత్యలకు చేరువవుతున్న వాస్తవాలు వెలుగు చూస్తున్నాయి. ఇంతటితో ఆగిపోకుండా ద్రవ్య కొరత ఉండకూడదని పాలక వర్గాలకు 'హితవు' చెప్తూనే, సామాజిక సేవలకు అడ్డుకట్టవేయడంతో - సామాజిక ఆర్థిక వ్యవస్థ ఛిద్రమయ్యేలా చేయడం జరుగుతోంది. ప్రభుత్వ వ్యయం తగ్గించాలని శాసిస్తూనే, ప్రైవేట్ రంగాన్ని విస్తృతం చేయడం, తద్వారా ప్రైవేటు పెట్టుబడులకు ప్రోత్సాహాన్నివడమూ జరుగుతోంది. దీంతో సామ్రాజ్యవాదులు ఆశిస్తున్న ప్రభుత్వపర ద్రవ్య పెట్టుబడులు తగ్గేందుకు మార్గం సుగమం అవుతుంది. మరోవైపు బ్యాంకింగ్ రంగాల్లో వడ్డీరేట్లను కుదింప చేయడం ద్వారా, ప్రభుత్వ రంగాల్లో ప్రజల పెట్టుబడులు తగ్గి, అనివార్యంగా, స్టాక్ మార్కెట్ రంగాన్నే ఆశ్రయించడం ద్వారా విస్తరింపజేయడం మరో అంతర్గత కుట్ర. మరింతగా ఆర్థిక అస్తవ్యస్తానికి పాల్పడితే అంతిమంగా జరిగేది ఆయా దేశాలు మరింతగా ఆర్థిక పరాధీనతకు తలొగ్గటమే అవుతుంది. ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణ మెక్సికో. మెక్సికో దివాలా తీసిన సందర్భంలో సామ్రాజ్యవాదం కయ్యానికి కాలు దువ్వక మరింతగా పునర్వ్యవస్థీకరణ పేరిట పెట్టుబడుల విస్తరణకే పూనుకోవడం గమనించదగ్గది.

వ్యవసాయ-ఆర్థిక రంగాల్లో ఈ తరహా ధోరణులతో సామ్రాజ్యవాదం తన పట్టు బిగిస్తూనే, అంతిమ ఆయుధంగా ఇంధనం విషయంలో జోక్యం కల్పించుకో చూస్తుంది. అయితే ఈ ఇంధన విషయానికొచ్చే సరికి ఓ గుణాత్మక పరిణామాన్ని మనం చూడొచ్చు. అదేంటంటే, వ్యవసాయ-ఆర్థిక రంగాల్లో ఎక్కడా పొక్కని 'యుద్ధ సంసిద్ధత'ను ఇక్కడ సామ్రాజ్యవాదం వ్యక్తం చేస్తుంది.

సోవియట్ యూనియన్ కుప్పకూలిన తరువాత అమెరికా చేపట్టిన యుద్ధాలన్నీ ఇంధన ఆధారిత యుద్ధాలేనని మనం గుర్తెరగాలి. గతంలో వెనిజ్యులా, బ్రెజిల్, సిరియాలపై యుద్ధాలు. నిన్నటి ఇరాక్. ఇరాక్‌లో ఎదుర్కొన్న ప్రతిఘటనల కారణంగా నేడు ఇరాన్‌పై బెదిరింపులకే పరిమితమైన వైనం గుర్తించాలి. ఇంధన రంగాన్ని తన గుప్పెట్లో ఉంచుకుంటే, మంచి నీళ్లకు సైతం కటకట లాడాల్సిన పరిస్థితులు నెలకొంటాయి. వ్యాసం ప్రారంభంలో ప్రస్తావించిన గిరిజన అటవీ ప్రాంతాల పరిస్థితే ఇందుకు తార్కాణం. గిరిజన పల్లెల్లో పరిస్థితే ఇలా ఉంటే నగర జీవనం ఎంత అస్తవ్యస్తంగా తయారవుతుందో ఊహించుకోలేం. రవాణా దగ్గర్నుంచి - మంచినీళ్ల వరకూ అలమటించి పోవాల్సిందే. సామాన్యుడి 'దీపం' వెలగాలన్నా విద్యుత్ లేదా కనీసం కిరోసిన్ అయినా లభ్యం కావాలిగా. లేకుంటే బ్రతుకే లేదు. సరిగ్గా ఇది గుర్తించే సామ్రాజ్యవాదం ఇంధనంపై తన పట్టు బిగిస్తుంది. ఇందుకు నజీవ ఉదాహరణ, ఇరాన్ ఒప్పందానికి వ్యతిరేకంగా భారత్‌చే ఓటు వేయించడం. గతంలో సైతం మైన్మార్ నుండి గ్యాస్‌లైన్‌ను బంగ్లాదేశ్, చైనాల మీదుగా మన దేశానికి ఏర్పాటు చేసుకునే విషయంలో అమెరికా మోకాలడ్డింది. ఇందుకు తాను చెప్పిన కారణం మైన్మార్‌లో మానవ హక్కులు మృగ్యమైపోయాయనడం. మైన్మార్ గత 40 ఏళ్లుగా సైనిక పాలనలో మగ్గుతూ ఉండగా, ఈ రోజున అక్కడి మానవ హక్కుల విషయాన్ని ప్రస్తావించడం హాస్యాస్పదంగా లేదూ? అలాగే సిరియాలో మన దేశం పెట్టుబడులు పెట్టేందుకు సంసిద్ధం కాగా, అమెరికా నిరాకరించింది. మరిప్పుడు తాజాగా ఇరాన్ నుండి పాకిస్తాన్ మీదుగా మన దేశానికి పైప్‌లైన్ ఏర్పాటుకు రంగం సిద్ధం కాగా అడ్డుకునే యత్నానికి అమెరికా ఒడిగడుతుంది. ఆ మేరకు మన దేశ పాలక వర్గాల మెడలు వంచి ఇరాన్ అణు ఒప్పందానికి వ్యతిరేకంగా ఓటు వేయించనూ గలిగింది. ఇందుకు సానుకూలంగానే ఇటీవల మన దేశ ప్రధాని మా దేశం అమెరికాకు మరింత చేరువవుతుందని ప్రకటిస్తుండగా, పార్లమెంటు సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి అమెరికాతో మరింత సఖ్యతని ప్రకటించడం దేన్ని సూచిస్తుంది.? పాలకుల పరాధీనతను కాదూ?

తెల్లవారితే అమెరికా సామ్రాజ్యవాద దుష్కర్మల గురించి గొంతు చించుకునే వామపక్షాలు, విప్లవకర పార్టీలు ఇందుకు భిన్నంగా ఏమైనా వర్తిస్తున్నాయా అంటే అదీ లేదు. కేంద్ర సంకీర్ణ ప్రభుత్వంలో భాగస్వాములుగా ఉన్న వామపక్షాలు ఇరాన్ ఒప్పందం విషయంలో ప్రభుత్వ వైఖరిని నిలేస్తాం, అవసరమైతే మద్దతునైనా ఉపసంహరించుకుంటామని బీరాలు పలికి, మొన్నటి అఖిల పక్ష సమావేశంలో బిజెపి ప్రభుత్వ అనుకూలతను వ్యక్తం చేసే సరికి చతికిలపడ్డ వైనం మన ముందుంది. మనుగడ రాజకీయాలకు స్వస్తి పలికి, సామ్రాజ్యవాద ఎత్తుగడలను, ధోరణులను అనుభవాలకు జోడించి సామాన్యుడ్ని చైతన్య పర్చాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది. అలా బాధ్యత వహించని కారణంగానే సామ్రాజ్యవాద ధోరణి నిరాటంకంగా కొనసాగుతూనే ఉంది. ❑

కాంగ్రెస్ ప్లీనరీ

# అసలు సమస్యలు వదిలి, రాజవంశ భజన!

ఎస్.జనార్దన్

భారత జాతీయ కాంగ్రెస్ 82వ ప్లీనరీ సమావేశాలు జనవరి 21-23 తేదీలలో హైదరాబాదులో అట్టహాసంగా జరిగాయి. ఇవాళ దేశాన్ని పాలిస్తున్న యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయెన్స్ నాయకత్వ పార్టీగా, దేశంలో సగం కన్న ఎక్కువ రాష్ట్రాలలో అధికారాన్ని చలాయిస్తున్న పార్టీగా కాంగ్రెస్ రాజకీయార్థిక అంశాలపై ఏం ఆలోచిస్తున్నదో ఆసక్తిగా చూడడం సహజమే. పైగా గత ప్లీనరీ కాంగ్రెస్ అధికారంలో లేనప్పుడు జరగగా ప్రస్తుత ప్లీనరీ ఎన్నో రాష్ట్రాలలోను, కేంద్రంలోను కాంగ్రెస్ అధికారాన్ని చేపట్టిన తర్వాత జరుగుతోంది. తన ఎన్నికల విజయాన్ని ఆ పార్టీ ఎట్లా సమీక్షిస్తుందో చూడడం ఆసక్తికరంగా ఉంటుంది. అట్లాగే, దేశంలో ప్రపంచీకరణ క్రమాన్ని, నూతన ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టిన రాజకీయ పార్టీగా కాంగ్రెస్ ఈ పదిహేనేళ్ల అనుభవం తర్వాత ఆ విధానాల గురించి ఏమి ఆలోచిస్తున్నదో కూడ పరిశీలించవలసి ఉంటుంది.

వ్యాఖ్య

అయితే కాంగ్రెస్ ప్లీనరీ ఇంత లోతయిన, గంభీరమైన విషయాలను తగినంత శ్రద్ధాసక్తులతో ఆలోచించడానికి సిద్ధంగా లేదని ఆ మూడు రోజుల సమావేశాలు రుజువు చేశాయి. చాల తీవ్రంగా తన ముందుకు వచ్చిన విషయాలు వేటినీ కూడ కాంగ్రెస్ అంతే తీవ్రతతో సమీక్షించదలచుకోలేదని, వాటిని విస్మరించి, పక్కన పెట్టి, మసిపూసి మారేడుకాయ చేసి, పనికిమాలిన చిల్లర విషయాలపై, వంశపారంపర్య అధికారంపై, అధినాయకుల భజనపై కేంద్రీకరించిందని ప్లీనరీ రుజువు చేసింది. నెహ్రూ-గాంధీ వంశపు నాలుగో తరం నాయకుడికి అధికార పగ్గాలు అందించడం ఎట్లా అనే అంశం మీద పెట్టిన శ్రద్ధలో వందో వంతు కూడ ఈ దేశంలోని వంద కోట్ల ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారాల గురించి పెట్టలేదంటే ప్లీనరీ, కాంగ్రెస్ ఎట్లా ఆలోచిస్తున్నాయో అర్థమవుతుంది.

సాధారణంగా రాజకీయ పార్టీల పనితీరు, ఆచరణ ఎట్లా ఉన్నా వాటి ఆలోచనలు, ప్రకటనలు గంభీరంగా, ఆకర్షణీయంగా ఉండడం పరిపాటి. నూట ఇరవై సంవత్సరాల చరిత్ర గల కాంగ్రెస్ కూడ 1990 ల వరకు అదే విధంగా ఆకర్షణీయమైన వాగాడంబరాన్ని ప్రదర్శిస్తుండేది. కనీసం మాటల్లోనైనా ప్రజా ప్రయోజనాల గురించి, ప్రజా సంక్షేమం గురించి, దేశం గురించి మాట్లాడుతుండేది. ప్రపంచీకరణ క్రమంలో ఇటువంటి ప్రజాపక్ష ప్రకటనలు కూడ కరవైపోయాయి. కాంగ్రెస్ బహిరంగంగానే కొన్ని వర్గాలకు మేలు చేయడం గురించి, సామ్రాజ్యవాద సంస్థల, సంపన్న దేశాల ప్రయోజనాలు నెరవేర్చడం గురించి మాట్లాడుతూ వస్తోంది. ఎక్కడైనా పాత ప్రజానుకూల ప్రకటనల వాసనలు మిగిలినా, అవి ఎందుకూ పనికిరాని, నిస్సారమైన ప్రకటనలుగానే ఉంటున్నాయి.

కాంగ్రెస్ 82వ ప్లీనరీలో ప్రవేశపెట్టిన, ఆమోదించిన నాలుగు తీర్మానాలు, వాటిపై చర్చ ఈ మారుతున్న ధోరణికి అద్దం పడుతున్నాయి. ఆ తీర్మానాలన్నీ కూడ ప్రజాసంక్షేమం గురించి, ప్రజా జీవన అభివృద్ధి గురించి మౌనమైనా వహించాయి, అర్థం లేని, ఆచరణకు రాని వాగ్దానాలయినా చేశాయి. ప్రపంచీకరణ వల్ల లాభపడే వర్గాలకు మేలు చేసే పనుల గురించి మాత్రం నిర్దిష్టంగా మాట్లాడాయి.

కాంగ్రెస్ ప్లీనరీలలో రాజకీయ తీర్మానం, ఆర్థిక తీర్మానం, విదేశాంగ తీర్మానం అనే మూడు తీర్మానాలను ప్రవేశపెట్టడం, చర్చించి ఆమోదించడం ఆనవాయితీ కాగా, ఈసారి వ్యవసాయం-ఉపాధి పేరుతో మరో తీర్మానాన్ని కూడ చర్చించారు.

రాజకీయ తీర్మానాన్ని అర్జున్ సింగ్ ప్రతిపాదించగా, వివిధ రాష్ట్రాల నుంచి పదమూడు మంది సభ్యులు చర్చించారు. కేంద్రంలోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ ఇతర పార్టీలతో అధికారాన్ని పంచుకుంటూ సంకీర్ణ ప్రభుత్వాలను ఏర్పాటు చేసిన కాంగ్రెస్, తాను సంకీర్ణ ప్రభుత్వ నియమాలను సంపూర్ణంగా పాటిస్తున్నానని, కొన్ని భాగస్వామ్య పక్షాలు హద్దుమీరి ప్రవర్తిస్తున్నాయని ఈ తీర్మానంలో చెప్పుకుంది. 'మేం చేసిందంతా ఒప్పు, ఇతరులు చేసిందంతా తప్పు' అనే పద్ధతిలో ఈ తీర్మానం సాగింది.

నిజానికి ఒక సంకీర్ణ, మిశ్రమ ప్రభుత్వం ఏ ఒక్క భాగస్వామ్య పక్షానికీ సంపూర్ణ నిర్ణయాధికారం ఇవ్వగూడదు. అసలు సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడేటప్పుడే, దాని విధివిధానాలు పకడ్బందీగా నిర్ణయించుకోవాలి. ఎవరి అధికారాలేమిటో, పరిమితులేమిటో, పరిమితులు దాటితే పర్యవసానాలేమిటో ఒక లిఖితపూర్వక ఒప్పందం ఉండాలి. ఆ ఒప్పందానికి అన్ని భాగస్వామ్య పక్షాలు పూర్తిగా కట్టుబడి ఉండాలి.

ఇవాళ కాంగ్రెస్ ఈ సంకీర్ణ నియమాలను పాటిస్తున్నదా లేదా చూడడానికి రెండు ఉదాహరణలను నిశితంగా పరిశీలించాలి. ఒకటి - కేంద్ర ప్రభుత్వం పని తీరు. రెండు - రాష్ట్ర ప్రభుత్వం పని తీరు.

కేంద్ర ప్రభుత్వంలోని సంకీర్ణం ఎన్నికలకు ముందే అన్ని భాగస్వామ్య పక్షాలు ఒప్పందానికి వచ్చిన ఫలితంగా ఏర్పడినది. ఆ సంకీర్ణం తన ప్రభుత్వ కర్తవ్యాలన్నిటినీ కనీస ఉమ్మడి ప్రణాళిక రూపంలో లిఖితంగా నిర్వచించుకున్నది. కాని గత 20 నెలల పాలనలో అధికార పక్షం, చిన్న భాగస్వామ్య పక్షాలను నిర్లక్ష్యం చేస్తూ కనీస ఉమ్మడి ప్రణాళికను ఎన్నో సందర్భాలలో ఉల్లంఘించింది. ప్రణాళికలో రాసుకోని, భాగస్వామ్య పక్షాల మధ్య వివాదాస్పదమైన అంశాలెన్నిటినో అమలు చేసింది. ఒక్కమాటలో చెప్పాలంటే సంకీర్ణ స్ఫూర్తికి కాంగ్రెస్ అనేకసార్లు తూట్లు పొడిచింది.

మరోవైపు ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ రాష్ట్ర సమితితో ఎన్నికల పొత్తు పెట్టుకుని ప్రభుత్వాన్ని కూడ సంకీర్ణ స్ఫూర్తితోనే ఏర్పరచింది. కేంద్రంలో రాసుకున్నట్టుగా ఒక స్పష్టమైన కనీస ఉమ్మడి కార్యక్రమం ఏదీ లేకపోయినా, అలిఖితంగానైనా కాంగ్రెస్, తెరాసల మధ్య స్నేహ పూర్వక ఒప్పందం ఉండింది. కాని ఆ మిశ్రమ మంత్రివర్గం కొనసాగిన పదహారు నెలల కాలంలోను కాంగ్రెస్ తెలంగాణ ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరిస్తూ, తెరాసని పొమ్మన లేక పొగబెట్టినట్టుగా వ్యవహరించింది. తెరాస మంత్రులను అవమాన పరిచింది. తెరాస లక్ష్యాలకు భిన్నమైన, వ్యతిరేకమైన పనులను చేపట్టింది. చివరికి తెరాస మంత్రివర్గం నుంచి వైదొలగే పరిస్థితి కల్పించింది. ఒక్క మాటలో చెప్పాలంటే సంకీర్ణ మంత్రివర్గం లో ప్రవర్తించగూడని పద్ధతిలో ప్రవర్తించింది.



ఈ అనుభవాల తర్వాత జరుగుతున్న ప్లీనరీలో నిర్మొహమాటమైన ఆత్మ విమర్శ కాకుండా, తాను చేసిందంతా సరైనదని, ఇతరులు చేసిందంతా తప్పు అని అనడం కాంగ్రెస్ సంస్కృతికి సహజంగానే ఉంది.

సరిగ్గా ఆ తీర్మానంలోనే రానున్న శాసన సభ ఎన్నికలను ప్రస్తావించి, ఇప్పటి భాగస్వామ్య పక్షాలతో ఆ ఎన్నికలలో తాడోపేడో తేల్చుకోవలసిందేనని ప్రతిపాదించింది. తీర్మానం తర్వాత చర్చలో బెంగాల్, కేరళ సభ్యులు మాట్లాడిన మాటలు గాని, స్వయంగా సోనియా గాంధీ మాటలు గాని కేంద్రంలో అవసరాల కోసం పొత్తు పెట్టుకున్నా, రాష్ట్రాల్లో కయ్యానికి దిగక తప్పదని స్పష్టంగానే వెలువడ్డాయి. అంటే ఇతర రాజకీయ పక్షాల పట్ల తన వైఖరి 'అందితే జుట్టు, అందకపోతే కాళ్లు' పట్టుకోవడమేనని కాంగ్రెస్ మరోసారి స్పష్టం చేసింది.

రాజకీయ తీర్మానంలో గుర్తించవలసిన మరొక అంశం నక్సలైట్ల గురించి కాంగ్రెస్ చేసిన ప్రకటనలు. అన్ని పార్లమెంటరీ రాజకీయ పార్టీల లాగనే కాంగ్రెస్ కూడ నక్సలైట్లను 'సమస్య' గా గుర్తించడంలో ఆశ్చర్యం లేదు గాని దేశంలోనే మొట్టమొదటిసారిగా నక్సలైట్లతో చర్చలకు తలుపులు తెరిచి, రాజకీయ పరిష్కారం కోసం ఎంతో కొంత ప్రయత్నం చేసిన అనుభవం తర్వాత, ఈ తీర్మానంలోని వ్యక్తీకరణలు చూస్తే కాంగ్రెస్ కొత్తగా నేర్చుకున్నదేమీ లేనట్టనిపిస్తుంది. 'నేపాల్ నుంచి ఆంధ్రప్రదేశ్ వరకు నక్సలైట్లు నిర్మించదలచుకున్న కారిడార్ దేశంలో ప్రజాస్వామ్యానికి ముప్పుగా పరిణమిస్తుందని, రెండు దేశాలకు భద్రతా పరమైన సవాలు అవుతుందని, ఈ సమస్య పరిష్కారానికి శాంతి భద్రతల పరమైన చర్యలు తీసుకుం టూనే, సామాజిక, రాజకీయ మూలాలను పరిశీలించి పరిష్కరించాల'ని ఈ తీర్మానం ప్రకటించింది.

నేపాల్ నుంచి ఆంధ్రప్రదేశ్ వరకు నక్సలైట్లు విప్లవ కారిడార్ నిర్మించ దలిచారా లేదా అన్నది ఇప్పటికీ నిర్ధారణ కాని వివాదాస్పద అంశం. ఈ అంశంపై అటు నక్సలైట్ల నుంచి ఇటు పోలీసుల నుంచి కూడ ఖండనలు వచ్చాయి. అటువంటి కారిడార్ గురించి ఆలోచన ఉన్నట్టు అధికారిక ప్రకటనలేవీ వెలువడ లేదు. అలాంటప్పుడు భారత జాతీయ కాంగ్రెస్ వంటి బాధ్యతాయుతమైన పార్టీ ఆ నిప్పులేని పొగ మీద ఆధారపడి రాద్ధాంతం చేయడం విచిత్రం. దాన్ని ప్రజాస్వామ్యానికి ముప్పుగా పరిగణించడం మరీ విచిత్రం. కాంగ్రెస్ ఆరు దశాబ్దాల పాలనలో దేశంలో ప్రజాస్వామ్యం ఎట్లా వర్ధిల్లుతున్నదో అందరికీ తెలుసు. దానికి ముప్పు తేవడానికి కారిడారే కావాలా?

ఈ తీర్మానంలో మరొక అంశం నేపాల్ భద్రతా అంశాలను కూడ కాంగ్రెస్ తన భుజాన వేసుకోవడం. పార్లమెంటరీ వ్యవస్థను కూలదోసి, నిరంకుశ రాజరిక వ్యవస్థను నెలకొల్పిన రాజు జ్ఞానేంద్ర పట్ల భారత జాతీయ రాజకీయ పక్షం ఇంత ప్రేమాభిమానాలను ప్రదర్శించడానికి కారణం ఏమిటి?

తీర్మానంలో ఉన్న విషయాలు ఒక ఎత్తయితే, ముందు రోజు ముసాయిదాను వర్కింగ్ కమిటీ చర్చించినప్పుడు వెలువడిన అభిప్రాయాలు మరొక ఎత్తు. తాను ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నిషేధం విధించి, కఠినంగా వ్యవహరించాననీ, ప్రస్తుత ప్రభుత్వం నిషేధం ఎత్తివేసి, నక్సలైట్లను చర్చలకు పిలిచిందని నేదురుమల్లి జనార్ధనరెడ్డి విమర్శించారు. వాళ్లను చర్చలకు పిలిచి ఏం సాధించారు అని ఆయన ప్రశ్నించారు. ఆయన అభిప్రాయాలను అక్కడ బలంగా ఎవరూ ఖండించలేదు. అంటే చర్చల ద్వారా సాగించిన ఒక చరిత్రాత్మక ప్రయత్నాన్ని తప్పు పట్టే దశకు, అంతకు

ముందరి కఠిన నిర్బంధమే సరైనదనుకునే దశకు కాంగ్రెస్ చేరిందన్న మాట.

రాజకీయ తీర్మానంలో రెండు ప్రధాన అంశాల మీద, అదీ ప్లీనరీ హైదరాబాద్‌లో జరుగుతున్న సందర్భంలో, మౌనం వహించడం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. రాజకీయ తీర్మానం తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం గురించి, ఆంధ్రప్రదేశ్‌లో ముస్లిం రిజర్వేషన్ల ప్రతిపాదన - దాన్ని నాయస్థానాలు కొట్టివేయడం గురించి ప్రస్తావన కూడ చేయలేదు. తెలంగాణ నడిబొడ్డున జరుగుతున్న ప్లీనరీలో, తెరాసతో ఐక్యత-ఘర్షణల్లో ఘర్షణది పై చేయి అవుతున్న తరుణంలో జరుగుతున్న ప్లీనరీలో తెలంగాణ గురించి మాట మాత్రం కూడ ఎత్తక పోవడం కాంగ్రెస్ కుటిల నీతికి అద్దం పడుతోంది.

ఇక ప్లీనరీ ఆర్థిక తీర్మానంలో నూతన ఆర్థిక విధానాల దుష్ఫలితాల గురించిన ప్రస్తావన లేదు సరిగదా, ఆ ఆర్థిక విధానాలనే మరింత తీవ్రంగా కొనసాగిస్తామన్న ప్రకటనలున్నాయి. కాకపోతే ఆర్థిక సంస్కరణలకు మానవీయ కోణం కలుపుతామన్న చక్కెరపూత ఉంది. నిజానికి ఇప్పుడు ప్లీనరీ జరుగుతున్న ఆంధ్రప్రదేశ్‌లో 2004 మే ముందు వరకూ చంద్రబాబు నాయుడు ప్రభుత్వం అమలు చేసిన ఆర్థిక సంస్కరణలను అందరికన్న తీవ్రంగా విమర్శించింది వైఎస్ రాజశేఖర రెడ్డి నాయకత్వం లోని

## భద్రతా సిబ్బంది చక్రబంధంలో ప్లీనరీ

ప్లీనరీ కి హాజరయిన మొత్తం కాంగ్రెస్ కార్యకర్తల, నాయకుల సంఖ్య ఎంత ఉదారంగా లెక్కవేసినా పది, పన్నెండు వేలకు మించలేదు. కాగా అధికారిక లెక్కల ప్రకారమే ప్లీనరీ కి భద్రతా సిబ్బంది సంఖ్య ఇరవై వేలకు పైచిలుకే. అంటే ప్రతి ఇద్దరు కాంగ్రెస్ వాదులకు ముగ్గురు పోలీసులు కాపలా కాశారన్న మాట. ఇందులో పదివేల మంది హైదరాబాద్, సైబరాబాద్ పోలీసులని, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి రప్పించిన పోలీసులు మరొక ఏడు వేల మంది అని, వీరితో పాటు పన్నెండు కంపెనీల సిఐఎస్ఎఫ్, సిఆర్‌పిఎఫ్ బలగాలు, మూడు వేల మంది ఎపిఎస్‌పి సిబ్బంది, 500 గ్రేహౌండ్స్ కూడ ఈ రక్షణ ఏర్పాట్లలో ఉన్నారని పత్రికలు రాశాయి. సోనియా గాంధీ, మన్మోహన్ సింగ్‌లకు భద్రత కల్పించే నేషనల్ సెక్యూరిటీ గార్డ్స్, స్పెషన్ ప్రొటెక్షన్ గ్రూప్ సిబ్బంది సరేసరి.

ఈ మూడు రోజుల ప్లీనరీ కి ఖర్చు లెక్కలు ఇప్పటికీ బైట పడలేదు. గాని అధికారికంగా ప్రకటించిన రు.2 కోట్లు ఏ మూలకూ సరిపోవని అందరికీ తెలిసిందే. కేవలం కాంగ్రెస్ పార్టీ చేతి నుంచి పెట్టిన ఖర్చు రు.20 కోట్లు ఉండవచ్చునని, మొత్తంగా ప్రభుత్వ శాఖలన్నీ పెట్టిన ఖర్చుతో కలుపుకుంటే ప్లీనరీ సమావేశాలకు రు.100 కోట్లు ఖర్చయి ఉంటాయని ఒక అంచనా.

కాంగ్రెస్ పార్టీ. చంద్రబాబు నాయుడును 'ప్రపంచబ్యాంకు జీతగాడు' గా విమర్శించిన వారిలో రాజశేఖర రెడ్డి అగ్రభాగాన ఉన్నారు. అధికారంలోకి రాగానే అవే విధానాలను అమలు చేయడంలో ఆయన ఒక ఆకు ఎక్కువ చదువుకున్నానని చూపుతున్నారు. ఇప్పుడు ప్లీనరీ ఆయన విధానాలకు కితాబునిచ్చినట్టయింది. అంతేగాక, కనీస ఉమ్మడి కార్యక్రమాన్ని ఉల్లంఘిస్తూ ఈ తీర్మానం పెట్టుబడుల ఉపసంహరణ గురించి కూడ మాట్లాడింది. ప్రైవేటు రంగ ప్రాధాన్యతను నొక్కి చెప్పింది.

ప్లీనరీ విదేశాంగ తీర్మానం స్పష్టంగా అమెరికా అడుగులకు మడుగులొత్తడానికి ప్రయత్నించింది. మారుతున్న అంతర్జాతీయ పరిస్థితులలో అలీనోద్యమం కూడ తన వ్యూహాన్ని మార్చుకోవాలని సూచించింది. అమెరికాతో భారత ప్రభుత్వం కుదుర్చుకున్న రక్షణ ఒప్పందాన్ని సమర్థించింది. అమెరికాతో మరిన్ని ద్వైపాక్షిక ఒప్పందాలు కుదుర్చుకోవాలని ప్రతిపాదించింది. అంతర్జాతీయ అణు ఇంధన సంస్థ సమావేశంలో ఇరాన్‌కు వ్యతిరేకంగా భారత్ తీసుకున్న వైఖరిని ఈ తీర్మానం సమర్థించింది.

ఈ విదేశాంగ తీర్మానం కచ్చితంగా భారత ప్రజా ప్రయోజనాలకు వ్యతిరేకమైనది. అమెరికాకు, సామ్రాజ్యవాదానికి దాసోహం అని ప్రకటిస్తున్నది. నిజానికి మారిన అంతర్జాతీయ పరిస్థితులలో అమెరికా, బ్రిటన్‌లు ఎదురు లేదన్నట్టుగా యుద్ధోన్మాదంతో ప్రపంచ దేశాలన్నిటి మీదా విరుచుకు పడుతున్నాయి. ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ వాణిజ్య సంస్థల సాయంతో బహుళజాతి సంస్థలు రవి అస్తమించని బహుళ జాతి సంస్థల దోపిడీ సామ్రాజ్యాన్ని నెలకొల్పుతున్నాయి. ఈ సమయంలో అమెరికా, బ్రిటన్ లను ఎదిరించి నిలవడం ప్రతి ప్రజాస్వామిక వాది కర్తవ్యం. పాత అలీనోద్యమ నాయకురాలిగా భారతదేశంపైన ఈ బాధ్యత మరింతగా ఉంది. భారతదేశమే మిగిలిన పేద దేశాలన్నిటికీ నాయకత్వం వహించి అగ్రరాజ్యాల కుట్రలను ఎదిరించి పోరాడవలసి ఉంది. ఈ సమయంలో అలీనోద్యమ వ్యూహం మారాలని అంటే అలీనోద్యమం అమెరికాకు అనుకూలంగా మారాలని అనడం ద్వారా భారత జాతీయ కాంగ్రెస్ తన దివాళా కోరుతనాన్ని బయట పెట్టుకుంది. అమెరికాతో రక్షణ ఒప్పందాన్ని సమర్థించడం, ఇంకా ఎక్కువ ఒప్పందాలు చేసుకోవాలని కోరడం, ఇరాన్ విషయంలో అమెరికాకు తాన తందాన అనడం భారత సార్వభౌమాధికారాన్ని దెబ్బతీయడమే.

ఇక వ్యవసాయం, ఉపాధి అనే కొత్త తీర్మానంలో మొదట రెండో హరిత విప్లవానికి పిలుపునివ్వడం, తర్వాత జాతీయ గ్రామీణ ఉపాధి పథకానికి సొంత డబ్బా వాయించుకోవడం మినహా కొత్తదనమేమీ లేదు. మొదటి హరిత విప్లవం దేశంలో వర్గ అసమానతలను మరింతగా ఎలా పెంచిందో సమీక్షించకుండా, దోపిడీ పీడనలను మరింతగా ఎలా పెంచిందో తేల్చకుండా రెండో హరిత విప్లవం గురించి మాట్లాడడం మోసపూరిత వాగాడంబరం తప్ప మరేమీ కాదు.

ఈ తీర్మానాలలో ఏమి రాసుకున్నప్పటికీ, పార్టీ అధ్యక్షురాలు సోనియా గాంధీ, పార్టీ తరపున సంకీర్ణ ప్రభుత్వంలో ప్రధాన మంత్రిత్వం వహిస్తున్న డాక్టర్ మన్మోహన్ సింగ్‌లు ఏమి మాట్లాడారన్నదే ప్రధానం.

సోనియా గాంధీ ఉపన్యాసంలో కొన్ని అంశాలపై విస్పష్టమైన ప్రకటనలున్నాయి. యుపిఎ ఆమోదించిన కనీస ఉమ్మడి కార్యక్రమం కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక నుంచే తయారయిందని ఆమె అన్నారు. కేంద్రంలో మద్దతు ఇస్తున్న మిత్ర పక్షాలతో రాష్ట్రాలలో శత్రుత్వం ఉండవచ్చునని ఆమె తేల్చి చెప్పారు. సంకీర్ణ ప్రభుత్వాలున్నప్పటికీ పార్టీని బలోపేతం చేసుకోవడానికి ప్రయత్నించాలన్నారు. కొన్ని దశాబ్దాలుగా పేద, దళిత, ఆదివాసి, మైనారిటీ, మహిళా సమూహాలను ఆకర్షించడానికి కాంగ్రెస్ ప్రయోగిస్తున్న వాగాడంబరాన్నే సోనియా ప్రయోగించారు.

ఒక రకంగా చెప్పాలంటే ఆమె ఉపన్యాసం త్వరలో జరగనున్న శాసనసభ ఎన్నికలకు మాత్రమే గాక 2009 పార్లమెంటు ఎన్నికలకు కూడ శంఖారావం పూరించినట్టుగా సాగింది. తప్పనిసరి పరిస్థితులలో 2004 ఎన్నికలలో కుదుర్చుకున్న పొత్తులు, ఆ తర్వాత ప్రభుత్వాల ఏర్పాటులో మద్దతులు అన్నీ కూడ సైద్ధాంతిక నిబద్ధతకు సంబంధించిన అంశాలేమీ కావని, కేవలం సౌలభ్యం కోసం కుదుర్చుకున్న ఎత్తుగడలని ఆమె చెప్పకనే చెప్పారు. అంటే కాంగ్రెస్ గత రెండు సంవత్సరాలుగా అవలంబిస్తున్న విధానాలు సంపూర్ణంగా అవకాశవాద ఎత్తుగడలు మాత్రమేనని ఆమె అన్నారు. అంటే సంకీర్ణ భాగస్వామ్యంలోని మిగతా రాజకీయ పక్షాల ఎత్తుగడలలో కూడ ఇటువంటి అవకాశవాదమో, అమాయకత్వమో ఉండి ఉండాలని ఆమె అన్నారన్నమాట. ఆ రకంగా దేశ రాజకీయ రంగంలోని ప్రధాన పక్షాల విధి విధానాలు అవకాశవాదం మీద ఆధారపడినవి మాత్రమేనని హైదరాబాద్ ప్లీనరీ తేల్చి చెప్పిందన్న మాట.

ఇక ప్రధాని మన్మోహన్‌సింగ్ ఉపన్యాసం ఈ ఇరవై నెలలలో తాము చేసిన కార్యక్రమాలను ఏ కరవు పెట్టడానికే పరిమితమైంది. అంటే ఆయన తనను తాను ఒక దూరదృష్టి గల ప్రధానమంత్రిగా కాక, మరెవరో చలాయించే రాజ్యంలో ఖాతా పుస్తకాలు రాసిపెట్టే గుమస్తాగా గుర్తించుకుంటున్నారని ప్లీనరీలో ఆయన ఉపన్యాసం స్పష్టం చేసింది.

నిజంగానే రాజ్యం ఆయనది కాదని, ఇది రాహుల్ రాజ్యమని ప్లీనరీ మూడు రోజులూ అడుగడుగునా రుజువయింది. రాజకీయానుభవమేమీ లేని, ఈ లోక్‌సభ లోనే మొదటిసారిగా సభ్యుడిగా ఎన్నికయిన ఒక ముప్పై నాలుగేళ్ల యువకుణ్ణి వేదిక మీదికి పిలవాలని, ఆయనతో మాట్లాడించాలని సభంతా గగ్గోలు పెట్టిందంటే అర్థం ఏమిటి? కేవలం ఆయనలో నెహ్రూ-గాంధీ కుటుంబ అనువంశిక రక్తం ప్రవహిస్తుండడం తప్ప ఆయనకు భారత రాజకీయాలకు నాయకత్వం వహించదగిన అర్హతలేమీ లేవు. కాని భూస్వామ్య, రాచరిక యుగంలో ముసలి చక్రవర్తులు, రాణులు తమ అనుంగు పుత్రులకు పట్టాభిషేకం చేసిన పద్ధతిలోనే రాహుల్ గాంధీకి పట్టాభిషేకం జరపమని కాంగ్రెస్‌లోని భజన బృందాలు కోరుతున్నాయి. పేరుకు ప్రజాస్వామిక పార్టీ అయినా రాజవంశపు భజన పరుల సమూహంగా మారిపోయిన భారత జాతీయ కాంగ్రెస్ ఏ ఒక్క నాయకుణ్ణయినా, నాయకురాలినయినా వారి వారి శక్తి యుక్తులు, అనుభవం, నవ్యోహక శక్తి, ప్రజాభిమానం, ప్రజల పట్ల సేవాభావం వంటి లక్షణాలతో కాక ఇతరేతర లక్షణాలతో, డబ్బు, కులం, ప్రాపకం వంటి లక్షణాలతో కొలుస్తున్న వాతావరణం ఉంది.

ఆ వాతావరణం వల్లనే రాహుల్ గాంధీని గద్దెమీదికి పిలవాలని అంత గందరగోళం జరిగింది గాని దేశం ముందున్న ప్రధాన సమస్యలలో ఏ ఒక్కటయినా గద్దెమీద చర్చకెందుకు రాలేదని ఒక్క ప్రశ్న రాలేదు. చివరికి కాంగ్రెస్ అంతర్గత విభేదాలకు, ముఠాతగాదాలకు పెట్టింది పేరు అయినా, ఏ ఒక్క అంశం మీదా చిన్నమెత్తు విభేదం కూడ, చర్చ కూడ జరగలేదు. ప్రజల సమస్యలు పట్టించుకోక పోవడంలో, ఆధిపత్య స్థానంలో ఉన్నవారికి భజనలు చేయడంలో అఖండమైన ఐక్యతను ప్రదర్శించింది హైదరాబాదు ప్లీనరీ. □

---

( 17 వ పేజీ తరువాయి)

- ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ ఏదో గొప్ప మార్పు సాధించబోతున్నదని, దాని వల్ల సమాజంలో సమానత్వం సిద్ధిస్తుందని, నాణ్యమైన సేవలు అందుతాయని మన పాలకులు చెబుతున్నారు. కంప్యూటర్ రంగంలో వచ్చిన మార్పుకు, ప్రపంచీకరణకు అసమానతకు ఉన్న సంబంధాన్ని నిశితంగా అధ్యయనం చేసిన మానవాభివృద్ధి నివేదిక ఈ కింది నిర్ధారణలు ప్రకటించింది.
- ప్రపంచమంతటా ఎన్ని కంప్యూటర్లున్నాయో, అమెరికాలో అంతకన్నా ఎక్కువ కంప్యూటర్లున్నాయి.
- ప్రపంచ జనాభాలో దక్షిణాసియా వాటా 23 శాతం కాగా ఇంటర్‌నెట్ వినియోగదార్లలో దక్షిణాసియా వాటా ఒక్క శాతం కన్న తక్కువ.
- ఇంటర్‌నెట్ వినియోగదారులు సాధారణంగా పురుషులు. 35 ఏళ్లలోపు వారు. విశ్వవిద్యాలయ పట్టభద్రులు. ఉన్నతాదాయ వర్గానికి చెందినవారు. పట్టణంలో నివసించేవారు. ఇంగ్లీషు మాట్లాడేవారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఒక అత్యల్ప సంఖ్యాక ఉన్నత వర్గానికి చెందినవారు. ఈ అన్ని స్థాయిలలోను ఇంటర్‌నెట్ అసమానత కొనసాగుతున్నది.
- మొత్తం ప్రపంచంలో ఇంగ్లీషు మాట్లాడగల వాళ్ల సంఖ్య పదిశాతానికన్న తక్కువ కాగా, వెబ్‌సైట్లలో 80 శాతంకన్న ఎక్కువ ఇంగ్లీషులోనే ఉన్నాయి. □

# చేనేత రంగానికి బడ్జెట్‌లో మొండిచేయి

పులుగుజ్జు సురేశ్

గత వందేళ్లుగా భారత చేనేత పరిశ్రమ అనేక విదేశీ, స్వదేశీ సవాళ్లను ఎదుర్కొంటూ తన ఉనికిని కాపాడుకునే ప్రయత్నాలు చేస్తున్నది. అయితే గత పదేళ్లుగా ఆర్థిక ప్రపంచీకరణ, సరళీకృత విధానాల నేపథ్యంలో కొన్ని సరికొత్త సవాళ్లను ఎదుర్కోవలసి వస్తుంది. ఇందులో ముఖ్యంగా ఆధునిక యంత్రాలపైన ఆధారపడిన పరిశ్రమ నుంచి వస్తున్న అనైతిక పోటీ ఒక పెద్ద సవాలైతే దానికి అనుగుణంగా ప్రభుత్వాలు రూపొందిస్తున్న విధానాలు కూడా మరో సవాలుగా పరిణమించాయి. గత నాలుగేళ్లుగా చేనేత పరిశ్రమలో విపరీతమైన మార్పులు కనబడుతున్నాయి. దీనికి స్పష్టమైన సంకేతం ఆకలిచావులు, ఆత్మహత్యలు, వలసలు, చేనేత కార్మికులలో పెరుగుతున్న పేదరికం. స్వతంత్రంగా పనిచేస్తూ జాతీయ స్థూల ఉత్పత్తికి దోహదపడుతూ స్వేచ్ఛగా వస్త్ర ఉత్పత్తి చేసే సగటు చేనేత కుటుంబం ఈనాడు తమ పేదరికాన్ని తట్టుకోవడానికి రోజు కూలీలుగా మారుతున్నారు. అనేక కుటుంబాలు తమ సొంత మగ్గాన్ని అటకెక్కించి, షెడ్డులలో దినసరి కార్మికులుగా పనిచేస్తూ చేనేత వస్త్ర ఉత్పత్తిని కొనసాగిస్తున్నారు. ఈ పరిస్థితిని గుర్తించకుండా, గుర్తించినా సరియైన అవగాహన పెంచుకోకుండా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ మార్పులను ఒక సహజమైన సామాజిక పరిణామంగా, ఆధునికతకు తలొగ్గాల్సిన పురాతన అంశంగా భావిస్తూ, కోట్లాది చేనేత కార్మికుల జీవనోపాధికి భంగం కల్గిస్తున్నారు. తద్వారా పేదరికాన్ని పెంచుతూ, పేదరికాన్ని నిర్మూలించే కార్యక్రమాలను చేపడతామని ప్రభుత్వాలు భ్రమలు కలిగిస్తున్నాయి.

గడచిన పలు సంవత్సరాలుగా చేనేత రంగంపై బడ్జెట్ కేటాయింపులను కేంద్ర ప్రభుత్వం వరుసగా తగ్గించుకుంటూ వస్తోంది. ఈ ధోరణి గత ఐదేళ్ల కాలంలో కళ్లకు కట్టినట్టు కనబడుతుంది. చేనేత రంగానికి చేసిన కేటాయింపుల్లో చేనేతకారులకు ప్రత్యక్షంగా మేలు చేకూర్చే పథకాల పద్దులను మరింత కుదించారు. జనతా వస్త్రంపై సబ్సిడీ ఉపసంహరించారు. దీన్‌దయాళ్ ప్రోత్సాహక్ యోజన అనే కొత్త పథకాన్ని ప్రవేశపెట్టినప్పటికీ కేటాయింపులు మాత్రం తగ్గిపోయాయి. మరమగ్గాల ఆధునీకరణ, పునరుద్ధరణ కోసం ఏకంగా మూడు కేంద్ర ప్రయోజిత పథకాలు ప్రవేశపెట్టారు. ఈ పథకాల ఫలితాలను ఇంకా మదింపు వేయవలసి ఉంది. యంత్రాలు సమకూర్చడమే ఆధునీకరణ అని అధికారులు భ్రమిస్తారు. అదే రీతిలో బడ్జెట్‌ను కేటాయిస్తారు. కేవలం ప్రభుత్వ తోడ్పాటుపై ఆధారపడి మగ్గాలు మెరుగుపర్చుకోవడమన్నది ఇంతవరకు జరగలేదు. అయితే టెక్స్‌టైల్ శాఖకు నిధుల కేటాయింపు పెరుగుతూ వస్తోంది. ఇదెంతో ఆసక్తిదాయకమైన విషయం. జౌళి శాఖకు 1997-98, 2002-03 మధ్య కాలంలో కేటాయింపులు దాదాపు రెట్టింపయ్యాయి. జనతా వస్త్రంపై సబ్సిడీ ఉపసంహరించినందువల్ల 1999-2000 సంవత్సరంలో భారీగా బడ్జెట్ తగ్గింది. ప్రణాళికేతర కేటాయింపులు మాత్రం పెరుగుతున్నాయి. గ్రామీణ వ్యవసాయం తర్వాత ఉపాధి కల్పనలో చేనేత రంగానిదే ప్రధాన వాటా అని ప్రణాళికా సంఘం చెబుతున్నప్పటికీ ప్రణాళికా కేటాయింపులు ఎందుకు తగ్గిస్తున్నారనేది ఎవరికీ అర్థం కావడం లేదు చేనేత రంగానికి నిజంగా ఉపయోగపడే పథకాలను ప్రణాళికలో చేర్చడమన్నది ఇప్పటివరకు జరగలేదు. కనీసం 10వ పంచవర్ష ప్రణాళికలోనయినా ఆ పని చేస్తారేమో చూడాలి.

**నివేదిక**

మరోవైపు పవర్‌లూంలకు, ఇతర పథకాలకు బడ్జెట్ పెంచుకుంటూ పోతున్నారు. ఆ మేరకు చేనేతపై టెక్స్‌టైల్స్ మంత్రిత్వ శాఖ సీతకన్ను వేసినట్టే. వేదికలపై చేసే ఉపన్యాసాలకూ బడ్జెట్ కేటాయింపులకూ పొంతన లేని పరిస్థితి కొనసాగుతున్నది. బడ్జెట్ కేటాయింపులు తగ్గించడం ద్వారా పవర్‌లూమ్‌లకు ప్రాధాన్యం పెంచడం ద్వారా చేనేత రంగాన్ని బలహీనపర్చే కార్యక్రమం అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది. ఇప్పుడున్న పథకాలన్నీ సహకార సంఘాల్లోని చేనేత కార్మికులకు ఉద్దేశించినవే కనుక చేనేత కుటుంబాలన్నీ సహకార సంస్థల్లో సమీకృతమయ్యేలా టెక్స్‌టైల్స్ మంత్రిత్వ శాఖ వ్యూహరచన చేయాలని పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ పనిగట్టుకుని చెప్పవలసి వచ్చిందంటే పాలకుల వైఖరి ఎలా ఉందో అర్థం చేసుకోవచ్చు.

పై కృషిని మరింత ముందుకు తీసుకెళ్లడంలో భాగంగా వర్క్‌షెడ్ కం హౌసింగ్ పథకాన్ని విస్తృతంగా అమలు జరపాలని, పట్టణాలకు సమీపంలో నివసించే చేనేత కార్మికులందరికీ ఈ పథకం అందుబాటులోకి వచ్చేలా నిధులు పెంచాలి. సహకార గృహనిర్మాణాన్ని కూడా ప్రోత్సహించాలి.

చేనేతకు అదే పనిగా నిధులు తగ్గిపోతున్నాయని మనం చెబుతుంటే అరకొర కేటాయింపులను కూడా ప్రభుత్వం సవ్యంగా వినియోగించడంలేదని సవరించిన అంచనాల్లో 10 నుంచి 20 శాతం తగ్గుదల తప్పనిసరిగా ఉంటున్నది. ఈ విధంగా ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం నిధులు తగ్గుతున్నాయి. 1997-98 బడ్జెట్‌లో 27.5 శాతం కేటాయింపులు చేసి చివరకు 15.9 శాతానికి సవరించారు. ఇదే ధోరణి తర్వాత కూడా కొనసాగింది. అవినీతి,

బోగస్ దావాలు, అడ్డగోలు ఖర్చులు లెక్కలోకి తీసుకున్నట్టయితే అరకొర కేటాయింపులవల్ల చేనేత కార్మికులకు ఒరుగుతున్నది శూన్యం. స్థూలంగా చూస్తే ప్రపంచ బ్యాంకు షరతులు, సత్యం కమిటీ సిఫార్సులను ప్రభుత్వం అనుసరిస్తున్నట్లు కనబడుతోంది. చేనేత రంగాన్ని ఆధునీకరించాలన్న ప్రభుత్వ తహతహను గమనిస్తుంటే ఈ రంగాన్ని భూస్థాపితం చేసే కార్యక్రమానికి త్వరలోనే శ్రీకారం చుడుతుందేమో అనిపిస్తున్నది. చేనేత రంగాన్ని బాగుపర్చే ఉద్దేశ్యం ప్రభుత్వానికి ఏ కోశానా లేదనే విషయం బడ్జెట్ కేటాయింపులు చూస్తే ఇట్టే తెలిసిపోతుంది. మరో ఆసక్తికరమైన విషయమేమంటే పన్నులు వేయని కాలంలోనే ఈ రంగానికి బడ్జెట్ కేటాయింపులు అధికంగా ఉన్నాయి.

2003-04 బడ్జెట్‌లో కండెనూలుపై పన్నులు ప్రతిపాదించారు. ఈ రంగం నుంచి ఆదాయం రాబట్టుకునేందుకు మరికొన్ని చర్యలను కూడా అందులో ప్రకటించారు. ఆపైన కేటాయింపులు తగ్గించారు. చూడబోతే పన్నులు వేసే అధికారం మాత్రమే ఉంచుకుని ఈ రంగం పట్ల తనకున్న సామాజిక ఆర్థిక బాధ్యతలను గాలికి వదిలివేయాలన్నది ప్రభుత్వ ఉద్దేశంగా కనబడుతున్నది. ఇది సామాజిక న్యాయాన్ని, సమానత్వ సూత్రాన్ని తిరగదోడే చర్య.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేనేత బడ్జెట్‌లో వస్తున్న సందేశం చాలా నిరాశాజనకమైనది. స్థూలంగా బడ్జెట్‌లో బయటపడిన నిజాలు ఇవి:-

1. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్‌లలో చేనేతకు నిరంతరంగా కోత విధించడం కనబడుతున్నది.
2. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చేనేత రంగం అభివృద్ధికై ఒక నిర్దిష్ట విధానమంటూ లేక కేవలం ఊరడింపు కొరకు లేక ఓటు బ్యాంకు రాజకీయాల పరంగానూ, మొక్కుబడిగా కొన్ని కేటాయింపులు జరపడం కనబడుతున్నది.
3. చేనేతకు బడ్జెట్ పెంచినట్టుగా లెక్కలు చూపి చేనేత బడ్జెట్‌లో బయోటెక్ పార్కులకు, పవర్‌లూమ్ రంగాలకు కేటాయింపులు చేయడం చేనేత రంగాన్ని మోసం చేయడమే.
4. చేనేత రంగంలో 60 శాతం మహిళలు పని చేస్తున్నప్పటికీ ప్రభుత్వ పథకాలు వీరికి వర్తించడం లేదు. మహిళల అభివృద్ధికి ఒక నిర్దిష్టమైన విధానంగానీ, ప్రణాళికగానీ లేదు.
5. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్‌ను విశ్లేషిస్తే మనకు కనబడేది చేనేత వ్యతిరేక విధానమైన సత్యం కమిటీ నివేదిక ప్రకారం పథకాలు రూపొందించి అమలు చేయడం. తద్వారా దశల వారీగా ఒక పథకం ప్రకారం చేనేత రంగాన్ని నిర్వీర్యం చేయడమే.
6. ఎంతో కాలం నుండి చేనేత రంగం ఎదుర్కొంటున్నది ముడిసరుకు సమస్య. ఈ సమస్య పరిష్కారానికి తగిన విధానం ఏనాడూ రూపొందించ లేదు. ముడిసరుకును నిరంతరం అందించుటకు బడ్జెట్ కేటాయింపులు జరగలేదు. అధికారంలోకి వచ్చిన పార్టీలు ఆ దిశగా చూడటం లేదంటే చేనేత రంగంపై ఉన్న చిత్తశుద్ధిని అర్థం చేసుకోవాలి.
7. స్వతంత్ర కార్మికులను షెడ్డు కూలీలుగా మార్చే, ప్రాజెక్టు ప్యాకేజీ స్కీంకు అధిక ప్రాధాన్యత, కేటాయింపులు జరపడం కార్మికుల పట్ల ప్రభుత్వానికి ఉన్న నైతిక విలువలు ఏమిటో మనకు అర్థమవుతుంది.
8. చేనేత, జౌళి రంగంలో గత ఎన్‌డిఏ ప్రభుత్వం ఏ విధానాన్నైతే అమలు చేసిందో ప్రస్తుత యుపిఏ ప్రభుత్వం కూడా ఏ విధమైన మార్పులు లేకుండా అదే విధానాన్ని అనుసరించడం బడ్జెట్ గణాంకాలు చూస్తే మనకు స్పష్టంగా తెలుస్తుంది.
9. ఈ సంవత్సరం నుండి అమలు జరుగుతున్న స్వేచ్ఛావాణిజ్యం పోటీలో చేనేత రంగం ఎదుర్కోవాల్సిన సవాళ్ల గురించి, పరిణామాల గురించి ప్రభుత్వం దగ్గర విశ్లేషణలు లేకపోగా బడ్జెట్‌లో దాని ప్రస్తావనే లేకపోవడం విశేషం.
10. చేనేత కార్మికుల ఆర్థికాభివృద్ధికి రాష్ట్రంలో 30 వేల ఆర్టిజాన్ క్రెడిట్ కార్డులు ఇచ్చి వారి అభివృద్ధికి కృషి చేస్తామని చేతులు దులిపేసుకోవడం, ఈ గత మూడు సంవత్సరాల బడ్జెట్‌లో ఇదే ప్రస్తావన చేయడం కార్మికుల ఆర్థికాభివృద్ధికి ఆర్టిజాన్ క్రెడిట్ కార్డులు ఎంతవరకు దోహదం చేస్తుందో ప్రభుత్వానికి, సంబంధిత వర్గాలకే తెలియాలి.
11. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం ద్వారా చేనేతలకు చేనేత గ్రామాలు అభివృద్ధితో పాటు మౌలిక సదుపాయాలు అభివృద్ధి

**జౌళి రంగంలో కేటాయింపులు - ఉపాధి (2005-06)**

జౌళి రంగం బడ్జెట్ కేటాయింపు - రు.2008.25 కోట్లు
చేనేతకు కేటాయింపు - రు.194.89 కోట్లు

మొత్తం జౌళి బడ్జెట్‌లో చేనేత వాటా - 9.7 శాతం
మొత్తం జౌళి ఉపాధిలో చేనేత వాటా - 31 శాతం






కేంద్ర బడ్జెట్‌లో చేనేతకు కొనసాగుతున్న కోతలు

(రు. కోట్లలో)

| సంవత్సరం | చేనేత | | | జౌళి | | | శాతం |
|---|---|---|---|---|---|---|---|
| | ప్రణాళిక | ప్రణాళికేతర | మొత్తం | ప్రణాళిక | ప్రణాళికేతర | మొత్తం | (%) |
| 1997-98 | 107.00 | 96.50 | 203.50 | 260.00 | 479.04 | 739.04 | 27.5 |
| 1998-99 | 89.80 | 61.80 | 151.60 | 260.00 | 726.58 | 986.58 | 15.3 |
| 1999-2000 | 81.80 | 56.50 | 138.30 | 266.00 | 740.10 | 1006.10 | 13.7 |
| 2000-01 | 112.00 | 53.29 | 165.29 | 457.00 | 754.30 | 1211.30 | 13.6 |
| 2001-02 | 116.00 | 40.50 | 156.50 | 650.00 | 660.30 | 1310.30 | 11.9 |
| 2002-03 | 117.00 | 35.83 | 152.83 | 715.00 | 870.50 | 1585.50 | 9.63 |
| 2003-04 | 129.77 | 125.91 | 255.68 | 760.00 | 947.84 | 1707.84 | 14.9 |
| 2004-05 | 119.36 | 132.37 | 251.73 | 878.00 | 902.31 | 1780.31 | 14.1 |
| 2005-06 | 131.00 | 63.89 | 194.89 | 1150.00 | 856.25 | 2008.25 | 9.7 |

చేయడం జరుగుతుంది. కానీ ఈ పథకం చాలా ఉపయోగకరమైనది. గత కొద్ది సంవత్సరాలుగా ఈ పథకానికి నిధులు కేటాయించడం లేదు.

12. దీనదయాళ్ హాత్‌కార్గ్ ప్రోత్సాహక యోజన పథకం రూపొందించి నప్పటి నుండి చేనేత బడ్జెట్‌లో దాదాపు 30 శాతానికి పైగా ఈ పథకానికే కేటాయించి సహకార సంఘాల, సంబంధిత అధికారుల జేబులు నింపే కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది.

13. పవర్‌లూమ్ వస్త్రాలు చేనేత వస్త్రాలుగా మార్కెట్‌లో అమ్మబడుతున్నాయి. చేనేత రిజర్వేషన్ అమలు జరగడం లేదు. ఈ నకిలీ చేనేత వస్త్రాలను నిర్మూలించుటకు తగిన చర్యలు తీసుకునేందుకుగాను ఉన్న ఎన్ఫోర్స్‌మెంట్ వ్యవస్థకు బడ్జెట్ కేటాయింపులు పూర్తిగా తగ్గించబడ్డాయి.

గడచిన పలు సంవత్సరాలుగా చేనేత రంగానికి బడ్జెట్ కేటాయింపులను కేంద్ర ప్రభుత్వం వరుసగా తగ్గించుకుంటూ వస్తుంది. ఈ ధోరణి గత తొమ్మిది సంవత్సరాల కాలంలో కళ్లకు కట్టినట్టు కనబడుతుంది.

పట్టిక ప్రకారం 1997-98లో చేనేతకు కేటాయించిన మొత్తం రు.203.50 కోట్లు కాగా ఈ సంవత్సరం (2005-06) రు.194.89 కోట్లకు కుదించబడింది. అయితే ఈ తగ్గింపు కేవలం రు.8.61 కోట్లు అని అన్పిస్తున్నా, మొత్తం జౌళి రంగం కేటాయింపులో గణనీయమైన తగ్గింపులు కనబడుతున్నాయి. 1997-98లో జౌళి బడ్జెట్‌లో చేనేత రంగం వాటా 27.5% కాగా ఈ సంవత్సరం అది 9.7%కి పడిపోయింది. ఆ విధంగా చేనేత రంగానికి జరిగిన తగ్గింపు దాదాపు రు.357.37 కోట్లు. గడచిన తొమ్మిదేళ్లలో ప్రతి ఏటా జౌళి బడ్జెట్‌లో చేనేత రంగం యొక్క వాటా క్రమంగా తగ్గుతూ వస్తున్నది. దాదాపు 50% తగ్గింపు 1997-98 నుంచి 1998-99 మధ్యలో జరిగింది. కాగా 2003-04లో కొద్దిగా వృద్ధి కనబడినా అది ఎన్నికలకు ముందు అప్పటి ప్రభుత్వం అంకెల గారడీ ఆధారంగా చేస్తున్న మార్పుగా మనం గమనించాలి.

ముఖ్యంగా పోయిన సంవత్సరం బడ్జెట్‌లో 14.1% ఉన్న చేనేత బడ్జెట్ ఈ సంవత్సరం 9.7%నికి పడిపోయింది. దీనిని బట్టి మనకర్థమయ్యేది ఏ పార్టీకి చెందిన ప్రభుత్వమున్నా చేనేత రంగానికి బడ్జెట్‌లో తగ్గింపు ఖాయం. యునైటెడ్ ప్రోగ్రెసివ్ అలయెన్స్ (యుపిఏ) ప్రభుత్వం గడచిన ఎన్‌డిఏ ప్రభుత్వ విధానాలను విమర్శిస్తూ వారి విధాన ప్రాధాన్యాలను ఎండగడుతూ, చేనేత కార్మికుల అభివృద్ధిని నిర్లక్ష్యం చేశారని చెప్పు, చేనేత రంగ అభివృద్ధికి, చేనేత కార్మికుల సంక్షేమానికి మేం అంకితమని తమ మేనిఫెస్టోలలో ప్రమాణం చేస్తూ అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్, లెఫ్ట్ పార్టీలు ఈ బడ్జెట్ ద్వారా తమ ప్రాధాన్యాలు కూడా అవే అని నిరూపించాయి. యుపిఏ పాలక పార్టీల 'కామన్ మినిమమ్ ప్రోగ్రాం'లో చేనేత రంగంపై వ్యతిరేక ప్రస్తావన ఉండటం ఈ పరిస్థితికి ఆద్యంగా భావించవచ్చు.

ఇంకొక విధంగా చూస్తే ప్రభుత్వ విధానాలలో పార్టీలకు అతీతంగా మార్పులు రావనేది స్పష్టమవుతున్నది. ఇది ఒక విధంగా సంతోషకరమే అయినా ఈ విధానాల వల్ల ఎవరు లాభం పొందుతున్నారనేది గమనిస్తే విధానాల రూపకల్పన సామాన్య ప్రజలకు దూరంగా జరుగుతోందనేది ఆందోళన కల్గించే సమాచారం.

విధానాల రూపకల్పనలో ప్రభావం చూపుతున్న వర్గాలను ఎదుర్కోవలసిన అవసరం కనబడుతున్నది. ఈ వర్గాలలో అజ్ఞాత శక్తులు ఉన్నా మనకిప్పుడు స్పష్టంగా కనబడుతున్న వర్గాలు - అధికారులు, ఆర్థిక మేధావులు, బడా పారిశ్రామికవేత్తలు, విదేశీ సంస్థలు. □

# భారతదేశంలో మానవ వనరుల నిర్వహణ - నేపథ్యం

ప్రొ. జి. శ్రీనివాస్ రెడ్డి,
డా. టి. సత్యనారాయణ

**మానవ** వనరుల నిర్వహణకు మూడు ముఖాలు ఉన్నాయని చెప్పవచ్చు. అవి : 1. వృత్తి ముఖం 2. ప్రక్రియ ముఖం 3. సిబ్బంది ముఖం

అంటే మానవ వనరుల నిర్వహణ గురించి ఏ విషయం తెలుసుకోవాలన్నా ఈ మూడు ముఖాల్ని గురించి తెలుసుకోవాలి. ఈ మూడు విభిన్న ముఖాలు కూడా శూన్యంలో ఉండవు. అంటే మానవ వనరుల నిర్వహణ వృత్తి, ప్రక్రియ, సిబ్బంది అన్నీ కూడా ఒక నిర్దిష్ట నేపథ్యంలో లేక పూర్వ రంగంలో ఉంటాయి. ఈ పూర్వ రంగం ఎలాంటిది, అనేది తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

మానవ వనరుల నిర్వహణను ఆవరించి ఉన్న పరిస్థితులను తెలుసుకోవడం నిర్వాహకులకు ఎంతైనా అవసరం. వీటిని తెలుసుకోవడం వలన పరిస్థితులలో ఉన్న సానుకూలమైన-ప్రతికూలమైన అంశాలు ఏమిటో తెలుసుకొని, అవకాశాల్ని వాడుకొని విజయవంతంగా పని చేయవచ్చును. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నప్పుడు వాటిని ఎలా అనుకూలం చేసుకోవాలో ఆలోచించవచ్చు. పరిస్థితులు పూర్తిగా మార్చలేనంతగా ప్రతికూలంగా ఉంటే పనుల్ని మానుకోవడం, వాయిదా వేయడమో చేసి, చేసిన పనిని వృధా కాకుండా జాగ్రత్త పడవచ్చు. ఇందువలనే పరిసరాల అవగాహన లేకుండా, మానవ వనరుల నిర్వహణ సమర్థవంతంగా నిర్వహించడం వీలుకాదని చెప్పవచ్చు.

పరిశోధన

మానవ వనరుల నిర్వహణకు గల నేపథ్యాన్ని లేక పరిసరాల్ని రెండు భాగాలుగా విభజించవచ్చు. అవి :

1. బాహ్య పరిసరాలు లేక నేపథ్యం 2. అంతర్గత పరిసరాలు లేక నేపథ్యం

**బాహ్య నేపథ్యం :**

బాహ్య నేపథ్యం అంటే ఒక పాలనా వ్యవస్థ వెలుపల దాని చుట్టూ ఉన్న స్థితిగతులు అని చెప్పవచ్చు. ఈ బాహ్య పరిస్థితుల్ని స్థూల నేపథ్యం అని కూడా చెప్పవచ్చు. ఏ పాలనా వ్యవస్థ అయినా పరిసరాలతో ద్వివిధ సంబంధాన్ని కలిగి ఉంటుందని ప్రముఖ పాలనా తత్వవేత్తయైన ఎఫ్.డబ్ల్యూ. రిగ్స్ తన పాలనా పరిసర సంబంధం అనే సిద్ధాంతంలో తెలియజేశాడు. పాలనా వ్యవస్థకు దాని పాలనా పరిసరాలతో గల ద్వివిధ సంబంధం అంటే ఈ రెండింటి మధ్యన గల పరస్పర ప్రభావాలని అర్థం. పరిస్థితులు పాలనా వ్యవస్థను ప్రభావితం చేయడమనేది ఒక ప్రభావమైతే, పాలనా వ్యవస్థ పరిస్థితులను ప్రభావితం చేయటం ఇంకొక ప్రభావంగా చెప్పవచ్చు. ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఉన్న పాలనా వ్యవస్థలు అవి ప్రభుత్వ సంస్థలు కావచ్చు, ప్రైవేట్ సంస్థలు కావచ్చు. చుట్టూ ఉన్న పరిస్థితుల సంబంధం లేకుండా స్వచ్ఛందంగా పనిచేయటం ఎంతో కష్టం. సాంప్రదాయబద్ధమైన మన సమాజంలో ఆధునిక సమాజాల కంటే సామాజిక పరిస్థితులు ఎక్కువగా ప్రభావశీలంగా ఉంటాయి. అవి పాలకుల, నిర్వాహకుల పనిని ఎంతగానో అడ్డుకుంటాయి.

బాహ్య పరిస్థితులను సమగ్రంగా, సవివరంగా పేర్కొనటం ఎంతో కష్టం. ఎందుకంటే ఈ పరిస్థితులు నిలకడగా ఉండక ఎప్పుడూ మారుతూ ఉంటాయి. ఈ పరిస్థితులు ఎంతో సంక్లిష్టమైనవి కూడా. వీటిలో స్థానిక, ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ అంశాలు ఇమిడి ఉంటాయి. ఈ నాలుగు రకాల అంశాలలో ఒక్కొక్క దాంట్లో రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంకేతిక తదితర అంశాలు గర్భితంగా ఉంటాయి. ఈ అంశాలు స్పష్టంగా, విడివిడిగా ఉండక పాలల్లో నీళ్ళు కలిసినట్లుగా అవిభాజ్యంగా ఉంటాయి. ఈ విభిన్న అంశాలలో దేని ప్రభావం పాలు ఎంతో తేల్చి చెప్పడం కష్టం.

బాహ్య నేపథ్యంలోని ముఖ్య అంశాల్ని రాజకీయ, ఆర్థిక-సాంకేతిక అంశాలు, సామాజిక-సాంస్కృతిక పరిస్థితులు, చట్టాలు, వినియోగదారులు, ప్రత్యర్థులు అంతర్జాతీయ నేపథ్యం అనే ఉప-శీర్షికల కింద విడగొట్టి అర్థం చేసుకోవచ్చు.

**రాజకీయాలు :**

ఈనాడు రాజకీయాలు ప్రవేశించని చోటులేదు. రాజకీయాలకు అతీతమైన అంశం లేదు. భారత రాజకీయ వ్యవస్థ స్వభావాన్ని ఒక వాక్యంలో చెప్పాలంటే ఇది ఒక బహుళపక్ష, పార్లమెంటరీ, లౌకికవాద, ప్రజాస్వామ్యం అని చెప్పవచ్చు. భారతదేశంలో అన్ని రకాల రాజకీయ పార్టీలు ఉన్నాయి. మతవాద పార్టీలు, మితవాద పార్టీలు, అతివాద పార్టీలు, తీవ్రవాద, ఉగ్రవాద రాజకీయ పక్షాలు అన్నీ కూడా ఉన్నాయి. రాజకీయ పార్టీల సిద్ధాంతాల మధ్యన ఎంతో వైవిధ్యముంది. అయితే ఇటీవలి కాలంలో ఈ వైవిధ్యం పాలు క్రమేపీ తగ్గి అభిప్రాయ స్వామ్యం పెరుగుతూ ఉంది.

1991లో ప్రారంభమైన నూతన ఆర్థిక పారిశ్రామిక విధానం దాదాపు భారతదేశంలోని అన్ని ప్రధాన పార్టీలు అంగీకరించాయి. ఈ విధానం మూలంగా భారతదేశ రాజకీయాలు సామ్యవాద ఉన్ముఖమైన స్థితి నుండి పెట్టుబడిదారి విధానం వైపు పరుగు తీస్తున్నాయి. అయితే ఇప్పటికీ మన రాజ్యాంగ ప్రవేశికలో

సామ్యవాదం ఏది లక్ష్యంగా పేర్కొనబడినప్పటికీ పెట్టుబడిదారీ విధానం వైపే రాజకీయాలు, ఆర్థిక విధానాలు పరిణామం చెందుతున్నాయి. భారత రాజకీయాల్లో ధనబల ప్రభావం, కులమతాల ప్రాధాన్యత, నేరప్రవృత్తి బలంగా ఉన్నాయి. పెట్టుబడిదారీ రాజకీయాలు ప్రైవేటు సంస్థల ప్రయోజనాలను కాపాడుతూ, శ్రామిక వర్గ ప్రయోజనాల్ని నిర్లక్ష్యం చేస్తున్నాయి. ప్రభుత్వరంగ సంస్థల్లో, ఉద్యోగ నియామకాల్లో, పదోన్నతుల్లో, బదిలీల్లో, ఇతర సిబ్బంది పాలనాంశాలలో జరిగే నిర్ణయాలలో రాజకీయాల ప్రమేయం చాలా ఉంది. మానవ వనరుల నిర్వహణకు సంబంధించిన నిర్ణయాలను వస్తుపరంగా, వృత్తి పరమైన పరిగణలతో కాకుండా రాజకీయ ప్రభావాల వలన చేయటం మూలంగా ప్రభుత్వ రంగ సంస్థల పనితీరుపై ఎంతో దుష్ప్రభావం పడింది. ప్రైవేటు రంగ సంస్థలలో కూడా రాజకీయాలు చొచ్చుకుపోయాయి. ఈ సంస్థల యాజమాన్యం, నిర్వాహకులు, రాజకీయ నాయకుల అండ లేనిదే తమ వ్యాపార వర్గాలు ఎన్నికల సమయంలో పెద్ద ఎత్తున ఇచ్చే చందాల మూలంగా ప్రభుత్వ యంత్రాంగం వీరి ప్రయోజనాలకు అనుగుణంగానే పని చేయవలసి వస్తున్నది. ముఖ్యంగా కార్మిక వ్యతిరేకంగా వ్యవహరిస్తున్న యాజమాన్యాలను కట్టుదిట్టం చేయడంలో రాజకీయ జోక్యం వలన వైఫల్యం కలుగుతోంది.

భారత రాజకీయాలు కొంత వరకు తమ స్వేచ్ఛను కోల్పోయాయి. దేశ రాజకీయాలలో ప్రపంచ బ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థ, బహుళజాతి సంస్థల ఆధిపత్యం రోజురోజుకూ పెరుగుతోంది. ముఖ్యంగా ప్రభుత్వ వ్యయానికీ విదేశీ రుణాలపై ఆధారపడడం మూలంగా రుణదాతల షరతుల మేరకు ప్రభుత్వ విధానాలను సవరించడం జరుగుతూ, దేశ రాజకీయ వ్యవస్థ సర్వ సత్తాకత పలుచబడుతూ ఉంది. సర్వ స్వతంత్రంగా తన దేశీయ, విదేశీయ విధానాలను నిర్ణయించుకొనే పరిస్థితి రోజురోజుకూ తగ్గుతోంది.

**ఆర్థిక - సాంకేతికాంశాలు :**

''ధనంమూలం ఇదం జగత్'' అన్నట్లు అన్ని విషయాల్లోనూ ఆర్థిక అంశాల ప్రభావం, ప్రమేయం ఉంటుంది. మానవ వనరుల నిర్వహణ ఇందుకు భిన్నం కాదు. భారతదేశ ఆర్థిక వ్యవస్థ ప్రధాన లక్షణాలలో వ్యవసాయ రంగపు ప్రాథమికత, గ్రామీణత, నిరుద్యోగిత, పేదరికం, పెట్టుబడి కొరత వంటివి ముఖ్యమైనవి. దేశ ఆర్థిక వ్యవస్థ ఈ మధ్య కాలంలో రెండు విషయాలలో బాగా మార్పు చెందింది. ఇందులో ప్రభుత్వరంగ క్షీణత, ప్రైవేటురంగ విస్తరణ ఒకటైతే, ఆర్థిక వ్యవస్థలో వాణిజ్య సేవా రంగాల లేక సర్వీసు సెక్టారు పాత్ర బాగా పెరగడం రెండవది. ఈనాడు కొత్త ప్రభుత్వరంగ సంస్థలు రాకపోగా ఉన్న సంస్థల్లో పెట్టుబడుల ఉపసంహరణ వాటి ప్రైవేటీకరణ జరుగుతూ ఉంది. వీటితోపాటు ప్రపంచీకరణ ప్రక్రియ మూలంగా ఆర్థికరంగంలో బహుళజాతి సంస్థల పాత్ర ఇతోధికం అవుతోంది. పారిశ్రామిక - వాణిజ్య రంగాలలో పోటీ పెరిగి చిన్న సంస్థలు తమ ఉనికిని కోల్పోతున్నాయి. జాతీయ ఆదాయంలో హెచ్చుభాగం ఈనాడు దేశ ఆర్థిక సౌష్టవానికి అవశ్యమైన ప్రాథమిక, మాధ్యమిక రంగాల నుండి కాకుండా సర్వీసు సెక్టారు నుండి రావడం అనారోగ్యకర పరిణామం. పారిశ్రామిక, వ్యవసాయ రంగాలు స్తబ్దంగా, క్షీణంగా ఉంటున్నాయి. వర్తక వాణిజ్యాలు పెరుగుతున్నాయి. కుటీర పరిశ్రమలు, చేతి వృత్తులు పూర్తిగా దెబ్బతింటున్నాయి. వ్యవసాయరంగంలోని వృద్ధి రేటులో స్తబ్దత వచ్చింది. వ్యవసాయంలో పెట్టుబడి-రాబడుల మధ్యన ఉన్న వ్యత్యాసం హరించుకుపోతూ, రైతాంగపు మనుగడే ప్రశ్నార్థకమౌతుంది. వ్యవసాయరంగం సంక్షోభంలో ఉంది. పారిశ్రామికరంగంలో వృద్ధిరేటు మందగించింది. ఉపాధి అవకాశాలు పెరగడం అటుంచి తరుగుతున్నాయి.

భారతదేశ ఆర్థిక వ్యవస్థలోని ఇంకో ముఖ్యాంశం సమాంతర ఆర్థిక వ్యవస్థ అవినీతి, పన్నుల ఎగవేత వంటి వాటి వలన బ్లాక్‌మనీ పాత్ర బాగా పెరిగింది. పరిశ్రమల మూలంగా వచ్చే కాలుష్యపు స్థాయి పెరుగుతోంది. దీనిని ప్రభుత్వం సరిగా నిరోధించలేక పోతుంది. ఫలితంగా పర్యావరణ సంక్షోభం తలెత్తుతూ ఉంది.

ఇన్ని సమస్యలున్నప్పటికీ భారతదేశపు ఆర్థికవృద్ధి ఇతర ప్రపంచ దేశాలతో పోలిస్తే మెరుగుగానే ఉంది. ఇదే విధంగా ఈనాడు దేశంలో నెలకొంటున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ విజయానికి కావలసిన వినియోగదారుల వర్గం సంఖ్యా బలం పెరుగుతూ ఉంది. కంప్యూటర్ రంగంలో భారతదేశం ప్రశంసనీయమైన ప్రగతి సాధించింది. వినియోగ వస్తువుల ధరలు కూడా మితిమీరి పెరగడం లేదు. కొన్ని రకాల టీ.వీలు, రిఫ్రిజరేటర్లు, ఎలక్ట్రానిక్ వస్తువుల ధరలు పెరుగకపోగా ఒకింత తగ్గినాయి కూడా.

ఈ ఆర్థిక నేపథ్యం వలన మానవ వనరుల నిర్వహణకు గల పర్యవసనాల్లో ముఖ్యమైనవి ఈ కింద పేర్కొనబడినవి.

- పరిశ్రమలల్లో పెద్ద ఎత్తున కుదింపులు లేక తగ్గింపు జరుగుతోంది. ఉద్యోగాలు కోల్పోయిన కార్మికుల పునరావాసానికి గాను నేషనల్ రెన్యూవల్ ఫండ్, ఎంప్లాయి అసిస్టెన్స్ స్కీం వంటివి ఏర్పాటు చేసారు. అయినా ఉద్యోగాలు కోల్పోయిన కార్మికుల పునరావాసం పెద్దగా జరగడం లేదు.
- బహుళజాతి కంపెనీల ప్రవేశం మూలంగా ఉద్యోగుల సాంస్కృతిక వైవిధ్యం పెరుగుతూ ఉంది. కంపెనీలలో దిగువ స్థాయిల్లో దేశీయులు ఉండగా ఉన్నత స్థాయిల్లో విదేశీయులు ఉన్నారు. ఒక రకంగా ఈ కంపెనీల్లో విదేశీయుల పెత్తనం వ్యవస్థీకృతమౌతోంది.
- ఆర్థిక వ్యవస్థలో 'న్యూ ఎకానమీ' అనే ఒక కొత్త ఆర్థిక ఉపరంగం రూపుదిద్దుకుంటోంది. కంప్యూటర్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, కంపెనీలతో కూడిన ఈ ఉపరంగంలోని ఉద్యోగుల్ని 'జ్ఞాన కార్మికులు' అని అంటున్నారు. వీరు విద్యాధికులు, శారీరక శ్రమ కాకుండా 'మానసిక శ్రమ' చేసే ఉద్యోగులు, వీరి మూలంగా 'న్యూ ఎకనామీ' పరిశ్రమల్లోని వాతావరణం పాత పరిశ్రమల కంటే ఎంతో భిన్నంగా ఉంది.

* రోజురోజుకూ కార్మిక సంఘాల పాత్ర తగ్గుతూ ఉంది. న్యూ ఎకానమీ పరిశ్రమల్లో దాదాపు ట్రేడ్ యూనియన్లు లేవు. సమష్టి బేరసారాల పాత్ర తగ్గుతూ వ్యష్టి బేరసారాలు పెరుగుతూ ఉంది. ఇది కార్మిక వర్గానికి ప్రతికూలమైన పరిణామంగా భావించవచ్చు.

* సిబ్బంది కుదింపు మూలంగా పని ప్రత్యేకీకరణ తగ్గుతూ ఒకే ఉద్యోగి విభిన్నమైన పనులు చేసే బహుళ నిపుణత ఉద్యోగిగా మారుతున్నాడు. ఈనాడు వైట్‌కాలర్ ఉద్యోగులకు తమ తమ వృత్తి నిపుణతతో పాటు కంప్యూటర్ నైపుణ్యం కూడా విధిగా ఉండాల్సి వస్తోంది.

* సాంకేతిక రంగంలో వస్తున్న మార్పుల మూలంగా ప్రత్యేకించి కంప్యూటరీకరణ, ఇంటర్‌నెట్ వంటి సదుపాయాల మూలంగా పాలనా వ్యవస్థల స్వభావంలో గణనీయమైన మార్పులు వస్తున్నాయి. ఈ మార్పుల్లో వర్చువల్ ఆర్గనైజేషన్స్, ఫ్లాట్ ఆర్గనైజేషన్స్ చెప్పుకోదగినవి.

* వర్చువల్ ఆర్గనైజేషన్ అనగా నామమాత్రపు వ్యవస్థలని అర్థం. ఈనాడు కొన్ని పరిశ్రమల్లో ఇంటర్‌నెట్ సదుపాయంతో ఉద్యోగులు ఆఫీసుకు పోకుండానే ఇంట్లో నుండే పని చేయటం కూడా జరుగుతోంది. వీటి మూలంగా ఆఫీసుల సైజు కూడా తగ్గుతోంది. ఆఫీసుకు రాకుండానే పని జరుగుతోంది. భవిష్యకారుల ఊహ ప్రకారం కార్యక్రమంలో వ్యవస్థలు లేని పనితీరు, పద్ధతులు రావచ్చును. ఇదే విధంగా అనేక బహుళజాతి కంపెనీలు మన దేశంలో కాల్ సెంటర్లు ఏర్పాటు చేసి సంపన్న దేశాలలో ఉన్న కంపెనీల పనులను వీటి ద్వారా నిర్వహించుకుంటున్నారు.

* ఫ్లాట్ ఆర్గనైజేషన్ అంటే క్రమానుగత శ్రేణి తక్కువగా ఉండి పాలనా అంతరువులు కనీస స్థాయిలో ఉన్న సంస్థలు. వీటి మూలంగా ఉద్యోగుల మధ్యన ఆధిపత్య ఆధీన భావన స్థానంలో సమానత్వపు భావన చోటు చేసుకుంటోంది. ఇది మంచి పరిణామమే. ఈ పరిణామం వలన వ్యవస్థలలో ప్రజాస్వామిక వాతావరణం పెరుగుతుంది.

**సామాజిక - సాంస్కృతికాంశాలు :**

భారతీయ సమాజపు విశిష్ట లక్షణాలలో కులం, ఉమ్మడి కుటుంబం, స్త్రీల పట్ల వివక్ష, భిన్నమతీయత, బంధుత్వపు ప్రాధాన్యత, సాంప్రదాయబద్ధత, సాంస్కృతిక వైవిధ్యం ముఖ్యమైనవి. పాలనా సంస్థల్లోని క్రమానుగత శ్రేణిలో ఉన్నత కులాల వారు పై హోదాలలో ఉండగా, నిమ్న కులాల వారు కార్మికులుగా, దిగువస్థాయి ఉద్యోగులుగా ఉండడం జరుగుతున్నది. తరతరాలుగా ఉన్న నిరక్షరాస్యత మూలంగా నిమ్న కులాల వారు ఆలస్యంగా పాలనా పదవుల్లోకి రావడం జరిగింది. ఇంకా నిమ్న కులాలకు వారి జనాభా నిష్పత్తికి సమానంగా ఉన్నత పదవులు రాలేదు. ఇదైనా ప్రభుత్వ రంగ సంస్థల్లో ప్రభుత్వ ఉద్యోగాల్లో జరిగిందే గాని ప్రైవేటు రంగ సంస్థల్లో ఉన్నతోద్యోగాలు ఇంకా ఉన్నత కులాల ఆధిపత్యంలోనే ఉన్నాయి. దీనివలననే ప్రైవేటు రంగంలో కూడా రిజర్వేషన్లు పాటించాలనే డిమాండ్ వస్తోంది. ప్రైవేటు పరిశ్రమల్లో, వ్యాపార సంస్థల్లో ఉద్యోగాలు ఇవ్వడంలో యాజమాన్యం ఎక్కువగా కులం, తమ ప్రాంతం వారికి, బంధువులకు ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతోంది. ఉద్యోగులలో మహిళల శాతం కూడా తక్కువే. ఇప్పుడిప్పుడే ఇది పుంజుకుంటోంది.

భారతదేశంలో అనాదిగా ఉన్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ దాదాపుగా క్షీణించి వ్యష్టి కుటుంబాలు ఏర్పడ్డాయి. అయినప్పటికీ ఉమ్మడి కుటుంబపు బంధాలు పోలేదు. వీటితోపాటు బంధుత్వం, కులం వంటి సంబంధాలు బలీయంగా ఉండడం చేత సంస్థల్లో పని చేసే వారి పనికి ఆటంకం జరుగుతోంది. పెళ్లి, పేరంటాలకు, చావు పుట్టుకలకు, చుట్టపుచూపులకు ఎంతో కాలం వెచ్చించవలసి వస్తోంది. ఈ సామాజిక కారకాల మూలంగా వ్యవస్థల ఉత్పాదకత పాశ్చాత్య దేశాల్లోలా లేకుండా పోతోంది.

భారతీయ సంస్కృతిలో వైవిధ్యం, పరమార్థకత, కర్మ సిద్ధాంతం ప్రధానాంశాలు. వైవిధ్యతకు భిన్న మతాలతో పాటుగా వేలకొలదిగా గల కులాలు, భాషా వైవిధ్యం, ప్రాంతీయ భేదాలు కూడా కారణాలే. పరమార్థకత కారణంగా వ్యక్తి జీవితంలో ఐహిక విషయాలలో శ్రద్ధ లేకపోవడం, తీర్థయాత్రలు, జాతరలు, కర్మకాండలు వంటి వాటిపై అధికంగా ఖర్చు పెట్టడం జరుగుతూ ఉంది. కర్మ సిద్ధాంతం వలన కూడా కొంత మేరకు నిష్క్రియత తలెత్తుతూ ఉంది.

భారతీయ సామాజిక-సాంస్కృతిక నేపథ్య విషయాలలో ప్రశస్తమైనది సహనగుణం. ప్రపంచంలోనే ఇంతటి వైవిధ్యం ఉండి కూడా సాంఘిక విచ్ఛిత్తి విస్ఫోటం జరుగకుండా సుదీర్ఘంగా సజీవమైన సమాజం, సంస్కృతి వేరొకటి లేదనటం అతిశయోక్తి కాదు. అయితే ఈ సఖ్యత కొంత మేరకు ఛాందస రాజకీయ శక్తుల, పార్టీలవలన అప్పుడప్పుడు సడలినప్పటికీ మొత్తంగా చూస్తే భారతీయత సమాజమంతటి సఖ్యత కలిగిన సమాజం తృతీయ ప్రపంచ దేశాల్లో మరొకటి లేదు అని చెప్పడం అతిశయోక్తి కాదు.

**కార్మిక చట్టాలు :**

పారిశ్రామిక రంగానికి సంబంధించినంత వరకు బాహ్య ప్రభావకాల్లో కార్మిక చట్టాలు చాలా ముఖ్యమైనవి. మానవ వనరుల నిర్వహకులు ఈ చట్టాల గురించి విధిగా తెలుసుకోవాలి. వీటి ప్రకారం నడచుకోవాలి. వీటి ఆధారంగానే కార్మికులతో ఇతర సిబ్బందితో వ్యవహరించాలి.

భారతదేశంలో అనేకమైన కార్మిక చట్టాలున్నాయి. ఈ చట్టాల్లో బ్రిటీష్ పాలనా కాలంనుండి ఈనాటి వరకు అమలులో ఉన్నవి కొన్నయితే, స్వాతంత్ర్యానంతరం రూపొందించినవి మరికొన్ని. వీటిలో ప్రధానమైనవి ఇవి :

శ్రామికుల నష్టపరిహారపు చట్టం (1923), కార్మిక సంఘాల చట్టం (1926), వేతనాల చెల్లింపుల చట్టం (1936), పారిశ్రామిక ఉపాధి (స్థాయి ఉత్తర్వుల) చట్టం (1946), ఉద్యోగుల రాజ్య బీమా చట్టం (1948), కనీస వేతనాల చట్టం (1948), ఫ్యాక్టరీల చట్టం (1948), ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్ (ఉద్యోగ ఖాళీల నిర్బంధ ప్రకటన) చట్టం (1959), అప్రెంటీస్ చట్టం (1961), ప్రసూతి సహాయక చట్టం (1961), బోనస్ చెల్లింపుల చట్టం (1965), గ్రాట్యుటీ చెల్లింపుల చట్టం (1972).

పై చట్టాలలో కొన్నింటిని సవరించడం కూడా జరిగింది. ఈ చట్టాలు అమలు చేయడానికి ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరేట్, లేబర్ కమీషనరేట్, చీఫ్ లేబర్ కమీషనరేట్, మైన్స్ సెక్యూరిటీ డైరెక్టరేట్ ప్రావిడెంట్ ఫండ్ కమీషనర్, ఇ.ఎస్.ఐ. కార్పొరేషన్ వంటి పాలనా సంస్థల ఏర్పాట్లున్నాయి. అయితే ఇవన్నీ ఉన్నప్పటికి కార్మిక చట్టాల అమలు విషయంలో ఎన్నో అవకతవకలున్నాయి. ప్రైవేట్ యాజమాన్యాల విషయంలో పర్యవేక్షణ చేసే యంత్రాంగం చాలా వరకు ఉదాసీనంగా ఉండడం జరుగుతోంది. ఇందుకు గల కారణాల్లో అవినీతి, రాజకీయ ఒత్తిళ్లు ముఖ్యమని చెప్పవచ్చు.

**అంతర్జాతీయ అంశాలు :**

త్వరితగతిన మారుతున్న ప్రపంచ పరిస్థితులలో దేశాలకు పూర్వమున్న ఏకాకితనం పోతోంది. ప్రపంచం మొత్తం ఈనాడు ఒక గ్రామంలాగా అయిందంటే అతిశయోక్తి కాదు. ఇన్ఫర్మేషన్, కమ్యూనికేషన్, టెక్నాలజీలలో వచ్చిన గణనీయమైన ప్రగతి మూలంగా ప్రపంచమంతా ఒక్కటైపోయింది. వీటితోపాటు ప్రచ్ఛన్నయుద్ధం పరిసమాప్తి, ప్రపంచ వాణిజ్య సంస్థ ఆవిర్భావం, బహుళజాతి సంస్థల విస్తరణ, ప్రపంచ వాణిజ్యం పెరుగుదల వంటి కారణాల వల్ల మనదేశంలోని మానవ వనరుల నిర్వహణ రంగం ప్రపంచ వ్యాప్త ప్రభావాలకు లోనవుతోంది. మానవ వనరుల నిర్వహణలోని వివిధ ప్రక్రియలు క్రమంగా మారుతున్నాయి. అంతర్జాతీయ అంశాల్లో అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) పాత్ర ముఖ్యమైనది. ఈ సంస్థ అంతర్జాతీయ కార్మిక ప్రమాణాల్ని రూపొందించింది. ఈ ప్రమాణాల్ని భారతదేశం కూడా ఆమోదించింది. కానీ అమలులో మాత్రం పూర్తి శ్రద్ధ చూపడం లేదు. ప్రత్యేకించి సామాజికాంశాల విషయంలో అశ్రద్ధ మరీ ఎక్కువగా ఉంది.

**వినియోగదారులు :**

ఒక వ్యవస్థ ఉత్పత్తుల్ని, సేవల్ని వినియోగించుకొనేవారు వినియోగదార్లు లేక వాడకందార్లు. వినియోగదార్ల అభిరుచుల్లో అవసరాల్ని, ప్రాధాన్యతల్ని ఏ సంస్థ అయినా తెలుసుకొని వ్యవహరించవలసి ఉంటుంది. వీటికి ప్రతికూలంగా వ్యవహరించినప్పుడు వ్యవస్థ చేసిన ఉత్పత్తులకుగాని అందించే సేవలకుగాని గిరాకీ ఉండదు. ముఖ్యంగా సేవల రంగంలో వినియోగదారుల అభిరుచులకు అధిక ప్రాధాన్యత ఉంది.

**ప్రత్యర్థులు :**

ప్రతీ వ్యాపారం లేక పారిశ్రామిక సంస్థకు పోటీ సంస్థలుంటాయి. ఈ పోటీ సంస్థల్నే ప్రత్యర్థులు లేదా కక్షిదారులు అని చెప్పవచ్చు. ఏ సంస్థలోనైనా మానవ వనరుల నిర్వహణ అయినా కొంతవరకు వ్యవస్థ ప్రత్యర్థుల మీద ఆధారపడి ఉంటుంది. సమర్థులైన ఉద్యోగుల్ని ఆకర్షించడంలో వేతన భత్యాల విషయంలో, సంక్షేమ కార్యక్రమాల విషయంలో వ్యవస్థల మధ్యన పోలిక రావడంగాని, పోటీ రావడంగాని సర్వసాధారణం. ఇలాంటి పోటీ ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ వలన రోజురోజుకూ పెరుగుతోంది. ఈ పోటీ వాతావరణంలో ఒక సంస్థలోని మానవ వనరుల నిర్వహణ పద్ధతుల్ని మరో సంస్థ అనుకరించడానికీ, అధిగమించడానికీ ప్రయత్నిస్తోంది. ఈ ప్రయత్నంలో విజయం లభిస్తే మనుగడ లేకపోతే మరణం అన్న పరిస్థితి వస్తూ ఉంది.

**అంతర్గత నేపథ్యం :**

ఒక పరిశ్రమలోని మానవ వనరుల విభాగం పనితీరు, అందులోని వివిధ విభాగాల మీద ఆధారపడి ఉంటుంది. సర్వసాధారణంగా ఒక పరిశ్రమలో మానవ వనరుల అభివృద్ధిశాఖ, ఉత్పత్తి విభాగం, మార్కెటింగ్ విభాగం, ఫైనాన్స్ విభాగం, సెక్యూరిటీ విభాగం, లీగల్ సెల్, మెయిన్‌టెనెన్స్ విభాగం వంటివి ఉంటాయి. మానవ వనరుల నిర్వహణ శాఖ అన్ని శాఖలకు కావలసిన సిబ్బందితో వ్యవహారాల్ని చూస్తూ ఉంటుంది. కనుక ఈ విభిన్న శాఖల నిర్మాణం, పనితీరు తెలిసి ఉండాలి. ఇదే విధంగా డైరెక్టర్ల బోర్డును గురించిగాని, పరిశ్రమలోని కార్మిక సంఘం గురించిగాని నాయకత్వం, దానిలోని ముఠాలు, చీలికలు వంటి విషయం అవగాహన ఉండాలి. వీటితోపాటు వ్యవస్థలో ఉన్న లాంఛనేతర వ్యవస్థ గురించి కూడా తెలిసి ఉండాలి. వ్యవస్థలోని కట్టుబాట్ల గురించి, రీతిరివాజుల గురించి, మర్యాదల గురించి కూడా తెలిసి ఉండాలి. కర్మాగారంలో ఉన్న ఇతర సామాజిక-సాంస్కృతిక కారకాల గురించి కూడా తెలిసి ఉండాలి. కొన్ని కంపెనీలలో డ్రెస్‌కోడ్ వంటి నియమాలు, ప్రవర్తనా నియమాలు ఉంటాయి. ఇవి కూడా మానవ వనరుల నిర్వాహకులకు తెలిసి ఉండాలి. ఇంతవరకు వివరించిన వ్యవస్థ బాహ్య, అంతర్గత నేపథ్యాలను స్థూలంగా పై చిత్రపటంలో చూడవచ్చు.

**ముగింపు :**

మానవ వనరుల నిర్వహణ అవగాహన చేసుకోవడానికి పాలనా వ్యవస్థల బాహ్య పరిస్థితుల్ని లోపలి స్థితిగతుల్ని సక్రమంగా అర్థం చేసుకోవడం అవసరం. పై చర్చలో ఈ అవసరాన్ని తీర్చుటకుగాను వ్యవస్థల నేపథ్యాన్ని స్థూలంగా చిత్రీకరించడం జరిగింది. ఈ చిత్రీకరణ సమగ్రం, నిర్దిష్టం కాదు. ఎందుకంటే అన్ని వ్యవస్థల బాహ్య అంతర్గత నేపథ్యాలు అచ్చుగుద్దినట్లు ఒకే రకంగా ఉండవు. అందువల్ల వీటి అవగాహనకు ఆయా పరిస్థితుల వివరాల్లోకి పోవడం ఎంతైనా అవసరం. ❑

## రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

- సంపాదకులు

# ప్రపంచీకరణ : వ్యవసాయ సంక్షోభం - తెలంగాణ అనుభవం

వకుళాభరణం వంశీచరణ్

అమెరికాలోని యూనివర్సిటీ ఆఫ్ మసాచుసెట్స్ అమ్‌హర్స్ట్ అర్థశాస్త్రశాఖలో పిహెచ్‌డి కొరకు సాగిన ఈ పరిశోధనాపత్రం ప్రపంచీకరణ వల్ల వ్యవసాయ రంగంలో ఎలాంటి మార్పులు వచ్చాయో తెలంగాణను కేంద్రంగా చేసుకుని వివరించడానికి ప్రయత్నించింది. ప్రపంచీకరణ వల్ల అందరి ఆదాయాలు పెరుగుతాయన్న వాదన ఎంత అర్థరహితమో ఈ పరిశోధనా పత్రం వివరిస్తుంది.

వ్యవసాయ ప్రపంచీకరణ, ఆ దిశగా అమలవుతున్న విధానాలు కలుగజేసిన ప్రభావాన్ని అభివృద్ధి సరళి, పంపకాల సరళి, వ్యవసాయం వాణిజ్య పంటల పరమవ్వడం, ఉత్పత్తి సరళిలో మార్పులు మొత్తంగా తెలంగాణలో 1985-2000 మధ్య సంభవించిన మార్పులు ఇందులో చర్చించడం జరిగింది. 1970-2000 మూడు దశాబ్దాల కాలంలో తెలంగాణ ప్రాంతంలో అభివృద్ధి గణనం, నేషనల్ సర్వే సాంపిల్ డాటా ఆధారంగా పంపిణీ సరళిలో మార్పులను వివరించడం జరిగింది. రెండేళ్ల (2000-2001 మధ్య) కాలం తెలంగాణ ప్రాంతంలో పర్యటించి వ్యవసాయ సంక్షోభాన్ని అధ్యయనం చేయడమైంది.

## పరిశోధనా ఫలాలు

205 పేజీల ఈ సిద్ధాంతపత్రం, 42 సమాచార పట్టికలూ, డజను గ్రాఫులతో 8 అధ్యాయాలుగా నా పరిశోధన పత్రం తెలంగాణ వ్యవసాయ సంక్షోభాన్ని ప్రపంచీకరణ నేపథ్యంలో వివరిస్తుంది. వందకు పైగా జాతీయ, అంతర్జాతీయ ఆర్థిక, సామాజిక వేత్తల గ్రంథాలు, వ్యాసాలు ఆ క్రమంలో అధ్యయనం చేయడమైంది. ప్రపంచ బ్యాంకు ఒకపక్క, పాలకులు మరోపక్క ప్రపంచీకరణ వల్ల జరిగే 'అభివృద్ధి', 'పెరిగే జీవన ప్రమాణాల గురించి' ప్రణాళికాబద్ధంగా ఊదరగొడుతుంటే అదంతా అబద్ధమని ఈ పరిశోధనా పత్రం ద్వారా చెప్పే ప్రయత్నం జరిగింది. పరిశోధనకు ఎంచుకున్న పదిహేనేళ్ల కాలం కూడా చాలా కీలకమైనది. హరిత విప్లవం పేరుతో సాధించిన వ్యవసాయ అభివృద్ధి, తొంభైల ప్రారంభంలో మొదలుకుని పాలకులు చేపట్టిన నూతన ఆర్థిక విధానాలు (సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ) ఒక దశాబ్ద కాలాన్ని పూర్తి చేసుకున్నాయి. సరిగ్గా ఇలాంటి తరుణంలో (సెప్టెంబర్ '2004) పరిశోధనాకాలంగా 1985-2000 ను పరిగణనలోకి తీసుకోవడం జరిగింది.

స్వేచ్ఛా విపణిలో వ్యవసాయ అభివృద్ధి - తెలంగాణ ఉదాహరణ; చిన్న, సన్నకారు వ్యవసాయం - వ్యవసాయ రంగంలో మార్పులు - తెలంగాణ (1925-85); తెలంగాణలో వ్యవసాయాభివృద్ధి - నీటి పారుదల (1970-2001); వైరుధ్యం-1 సరళీకరణ క్రమంలో తెలంగాణలో సంక్షుభిత అభివృద్ధి; వైరుధ్యం - 2 వ్యవసాయ సరళీకరణ క్రమంలో - తెలంగాణలో అసంబద్ధ ఉత్పత్తి సరళి; తెలంగాణలో చారిత్రక మలుపుల విశ్లేషణ; ద్వంద్వ వైరుధ్యాలు - ప్రపంచీకరణ నేపథ్యంలో తెలంగాణలో అసంగత అభివృద్ధి-ఉత్పత్తుల సరళి, ఉపసంహారం: అభివృద్ధి చెందుతున్న దేశాల్లో వ్యవసాయ ప్రపంచీకరణ - రైతాంగ ఆర్థిక స్థితిగతులు అనే 8 అధ్యాయాల్లో మొత్తం ఈ పరిశోధన పత్రం వివరించబడింది.

ఈ పరిశోధనలో రెండు సంభ్రమపరిచే విషయాలు తెలుస్తాయి. మొదటిది ఉత్పత్తికి సంబంధించినది. రెండోది పంపిణీకి సంబంధించినది. అవి, 1991-2000 మధ్య వాణిజ్య పంటల ధరలు గణనీయంగా తగ్గిపోతున్నా వీటి ఉత్పాదకత, విస్తీర్ణంలో పెరుగుదల ఉంది. రెండోది, అభివృద్ధి రేటు వార్షిక సూచీల్లో వ్యవసాయోత్పత్తిలో నిజ పెరుగుదల (దక్షిణ భారతదేశంలో) తెలంగాణలో 4% కన్నా ఎక్కువగా, వేరే ప్రాంతాలతో పోలిస్తే అగ్రభాగాన ఉంది. అయినా తెలంగాణ రైతాంగం తీవ్రమైన ఆదాయ/వ్యయ నష్టాలను చవిచూసింది. వందలాది రైతులు ఆత్మహత్యల పాలయ్యారు. ఈ అసంబద్ధ అభివృద్ధిని చరిత్ర మూలాల్లోకి పోయి (1925-85) చూడాలి. వ్యవసాయ రంగాన వచ్చిన మార్పులకు కారణాలు అంచనా కట్టాలి.

ప్రపంచీకరణ వలన ముఖ్యంగా ఆహారేతర పంటల ధరలు పడిపోతూ వచ్చాయి. మరోవక్క సంస్థాగత రుణ సదుపాయం తగ్గిపోయింది. ప్రైవేటు శక్తుల వద్ద అంటే వడ్డీ వ్యాపారుల వద్ద అప్పు చేయడం పెరిగింది. ఆహారేతర పంటల విస్తీర్ణం పెరగడానికి, అప్పు చేయడానికి మధ్య ఉన్న సంబంధాన్ని అర్థం చేసుకుంటేనే ఈ విషాద గాథ మనకు అర్థమవుతుంది. చేపట్టిన పథకాలు కలిగిన పరిణామాలు ఈ పరిశోధన పత్రంలో చర్చించడమైంది.

తెలంగాణ వ్యవసాయ సంక్షోభాన్ని చర్చించడానికి పరిగణనలోకి తీసుకున్న కాలాన్ని కూడా మూడుసందర్భాలుగా విభజించవచ్చు. 1925-45 నిజాం కాలం; 1945-1956 తెలంగాణ రైతాంగ సాయుధ తిరుగుబాటు తదనంతర కాలం; 1956-85 తెలంగాణ ఆంధ్రప్రదేశ్‌లో విలీనమవ్వడం తదనంతర పరిణామాలు.

**1925-45:** రైతాంగం కలిగి ఉన్న భూమి కమతాల్లో తీవ్ర వ్యత్యాసాలు, భూమిలేని వ్యవసాయ కూలీలు, శతాబ్దాల తరబడి ఉన్న కులవ్యవస్థ ప్రధాన లక్షణాలుగా ఉన్న సమాజం.

తెలంగాణ - ఆంధ్రప్రదేశ్‌లో మొత్తంగా అభివృద్ధి (1970-2001)

(పట్టిక - 1) (శాతం)

| కాల వ్యవధి | విస్తీర్ణం | | దిగుబడి | | పంటల సరళి | | పెరుగుదల రేటు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర |
| 1970-2001 | -0.3 | 0.1 | 2.6 | 2.1 | 1.3 | 0.6 | 3.6 | 2.8 |
| 1970-1985 | -0.2 | -0.2 | 2.4 | 2.6 | 1.6 | 0.6 | 3.8 | 3.0 |
| 1986-2001 | -0.1 | 0.6 | 3.5 | 1.9 | 1.3 | 0.5 | 4.7 | 3.0 |

తె - తెలంగాణ; ఆం.ప్ర - ఆంధ్రప్రదేశ్

కొనసాగుతున్న భూస్వామ్య దోపిడీ అప్పటి ప్రధాన లక్షణాలు. ఇదే కాలంలో సంభవించిన తీవ్ర ఆర్థిక మాంద్యం, రెండవ ప్రపంచయుద్ధం ఇక్కడి భూస్వామ్యాన్ని మరింత తీవ్రతరం చేశాయి.

**1945-56:** రైతాంగ తిరుగుబాటుతో రైతు ఆర్థిక వ్యవస్థ పెను చలనానికి లోనయ్యింది. ప్రధానంగా సమానత, ఉన్నతమైన విలువల లక్ష్యంతో సాగిన ఈ పోరాటం కొన్ని విలువలైతే సాధించింది గాని పూర్తిగా లక్ష్యాన్ని చేరుకోలేదు. జాగిర్దారీ వ్యవస్థ రద్దు. కౌలుదారీ సంస్కరణలు చోటు చేసుకున్నాయి. హైదరాబాద్‌తో సహా తెలంగాణ భారత యూనియన్‌లో విలీనమవడం జరిగింది.

**1956-85:** కొంత చిన్న, సన్నకారు రైతు వ్యవసాయం, కొంత పెట్టుబడి పద్ధతి చోటు చేసుకున్న కాలం. అంతకు ముందుతో పోలిస్తే రైతాంగం మధ్య వ్యత్యాసాలు కొంత వరకూ తగ్గాయి. ఇదే కాలంలో హరిత విప్లవం రూపంలో కొత్త సాంకేతిక పరిజ్ఞానం వ్యవసాయంలోకి రావడం, ఆంధ్ర నుంచి వలస వచ్చిన వారి ప్రభావం తెలంగాణ వ్యవసాయంపై ఉన్నాయి. ఇలాంటి అనేక మార్పులకు లోనవుతున్న దశలో వాస్తవానికి ప్రభుత్వం రైతులకు అన్ని విధాల సహాయపడాలి. అయితే దానికి విరుద్ధంగా సంస్థాగత సహకారాన్ని ఉపసంహరించుకుంటూ వచ్చింది. చిన్న, సన్నకారు రైతులు నిలదొక్కుకునే పద్ధతిలో కాక మళ్లీ మళ్లీ వారు దోపిడీకి గురయ్యే పరిస్థితులే కొనసాగాయి. ఈ కాలం మొదటి సగ భాగం వరకూ భూస్వాముల ఆధిపత్యం, పట్టు యథావిధిగా కొనసాగించే క్రమం ఉంది. 1971-85 మావోయిస్ట్ రైతాంగ ఉద్యమం ఈ వైరుధ్యాలను పరిష్కరించే దిశగా అడుగులు వేయడం జరిగింది. పాలకులు కూడా భూసంస్కరణలు కొంత చేపట్టారు. రెండు తిరుగుబాట్ల కాలంలోనూ భూస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడటం ఉంది. కుల, లింగ విబేధాలు మరచి వర్గ స్పృహతోనే పోరాడారు. తెలంగాణకు వలస వచ్చిన ఆంధ్ర ప్రాంత రైతులు హరిత విప్లవం సాంకేతికతనూ ఇక్కడికి దిగుమతి చేశారు. అయితే ఈ ప్రాంత రైతులు రుణ సదుపాయాల లేమి, నీటి వసతుల లేమితో, పాలకుల నిర్లక్ష్యంతో అవస్థ పడుతూ ఉన్నారు. దీనితోపాటు వ్యవసాయ విస్తరణ సేవలు కూడా లేవు. మొదటి దశలో హరిత విప్లవాన్ని ప్రవేశ పెట్టడానికి ఇచ్చిన రాయితీలు, సబ్సిడీలు 1990ల తరువాత ఉపసంహరించుకున్నారు. ఇవన్నీ వెరసి ఇప్పుడు తెలంగాణ రైతాంగం సమస్యల వలయంలో కూరుక పోయింది.

ఇక మూడవ అధ్యాయంలో తెలంగాణలో వ్యవసాయాభివృద్ధి, నీటి పారుదల గురించి, 1970-2001 కాలంలో ఎలా ఉందో చర్చించారు. దిగుబడిలోనూ, పెరుగుదల రేటులోనూ (పట్టిక -1) తెలంగాణ ఆంధ్రప్రాంతంతో పోలిస్తే మెరుగైన స్థితిలోనే ఉంది. తలసరి వ్యవసాయ ఉత్పత్తి ఆంధ్ర కన్నా తక్కువ ఉన్నా పెరుగుదల రేటు ఆంధ్రప్రదేశ్‌లో 3% ఉంటే తెలంగాణలో 4.7% ఉంది (పట్టిక-1). తెలంగాణలో కూడా ఉత్తర తెలంగాణ జిల్లాల్లో పెరుగుదల రేటు ఎక్కువగాను, దక్షిణ తెలంగాణ జిల్లాల్లో తక్కువగాను ఉంది.

హెక్టారుకు దిగుబడి పెరగడం వలన పెరుగుదల రేటు కనపడుతుంది. అంతే కాకుండా నీటిపారుదల (బోరు బావులు, బావులు) పెరగడం, అధిక దిగుబడినిచ్చే వంగడాలు, పెరిగిన రసాయన ఎరువుల వాడకం, సాంకేతిక పనిముట్లు కొద్దిగా మెరుగుపడడం... కొన్ని కారణాలు. ఇదే కాలంలో ఆహార పంటల నుండి ఆహారేతర పంటలకు వ్యవసాయం మారడం కూడా కనిపిస్తుంది (పట్టిక 2). అయితే తెలంగాణను చూస్తే నీటి పారుదలకై 60 శాతానికి పైగా బోర్లు, బోరు బావులపై (2001) ఆధారపడితే అదే కాలంలో ఆంధ్ర ప్రాంతంలో 70% పైగా కాలువలు, చెరువులపై ఆధారపడి వ్యవసాయం జరుగుతోంది (పట్టిక-3) అదే 1970ల్లో తెలంగాణ చూసినట్టయితే నీటి పారుదల కింద ఉన్న భూమిలో 70% పైగా కాలువలు, చెరువులపై ఆధారపడి సాగింది. 2001 వచ్చేసరికి నీటి పారుదల క్రింద ఉన్న భూమి రెట్టింపయినా అది ఏ రకమైన నీటి కింద అనేది చూస్తే ఈ అభివృద్ధి రైతుకు ఎంతటి భారమైపోయిందో అర్థమవుతుంది.

సాగు విస్తీర్ణంలో వార్షిక పెరుగుదల రేటు - తెలంగాణ

(పట్టిక - 2)

| పంట | 1970-85 | 1985-2001 |
|---|---|---|
| వరి | 0.3% | 3.3% |
| జొన్న | -1.3% | -3.7% |
| సజ్జ | -2.1% | -4.3% |
| మొక్కజొన్న | 1.7% | 3.1% |
| వేరుశనగ | 0.5% | -1.9% |
| పత్తి | 3.9% | 17.2% |
| మిర్చి | 1.2% | 2.6% |

### వివిధ రకాల నీటి పారుదల కింద సాగయ్యే భూముల శాతం
(పట్టిక - 3)

| | 1971 | | | | 1985 | | | | 2001 | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | తె. | రా. | కో. | రాష్ట్రం | తె. | రా. | కో. | రాష్ట్రం | తె. | రా. | కో. | రాష్ట్రం | |
| కాలువలు | 4.5 | 5.2 | 31.3 | 13.5 | 7.2 | 5.9 | 36.4 | 17.1 | 6.8 | 4.5 | 31 | 14.7 | |
| చెరువులు | | 9.1 | 5.1 | 13.3 | 9.5 | 6.8 | 3.7 | 10.6 | 7.4 | 6.1 | 2 | 10 | 6.5 |
| బోర్లు | 0.0 | 0.0 | 1.7 | 0.6 | 0.3 | 0.5 | 4.4 | 1.8 | 10.5 | 9.4 | 8.5 | 9.5 | |
| ఇతర బావులు | 3.5 | 5.8 | 2.6 | 3.8 | 7.7 | 8.3 | 3.2 | 6.2 | 13.3 | 6.0 | 3.3 | 7.9 | |
| ఇతరాలు | 0.5 | 0.7 | 1.8 | 1.0 | 0.9 | 0.6 | 1.7 | 1.1 | 1.4 | 0.5 | 3.1 | 1.8 | |
| మొత్తం | 17.5 | 16.7 | 50.7 | 28.2 | 22.8 | 18.9 | 56.2 | 33.6 | 38 | 22.4 | 55.5 | 40.4 | |

తె - తెలంగాణ; రా - రాయలసీమ; కో - కోస్తా ఆంధ్ర

కాలువల కింద సాగుభూమి 1985 వరకు కొద్దిగా పెరుగుదల కనబడి 2001కి తగ్గిపోవడం, చెరువుల కింద సాగయ్యే భూమి క్రమంగా తగ్గిపోవడం కనిపిస్తుంది. అదే ముప్ఫై ఏళ్లలో ఆంధ్రప్రాంతంలో నీటి పారుదల 60% వరకు కాలువలు, చెరువుల ఆధారంగా జరుగుతోంది. తెలంగాణ రైతుకు మాత్రం నీటిపారుదల విపరీతమైన ఖర్చుకు దారితీసింది.

అలాగే పంటలు కూడా ఆహార పంటల నుండి ఆహారేతర పంటలకు మార్పు కనబడుతుంది. వరి, మొక్కజొన్న, పత్తి, మిర్చిల సాగు పెరిగింది. జొన్న, సజ్జ, వేరుశనగ పంటలు విపరీతంగా తగ్గాయి.

తెలంగాణలో నీటిపారుదల కింద ఉన్న భూమి 17.5% (1971) నుండి 38%కి (2001) పెరిగినట్లు కనిపించినా అందులో 75% బోర్లు, బావులపై ఆధారపడింది. ఈ రకంగా తెలంగాణ వ్యవసాయ అభివృద్ధి తీవ్రంగా ఖర్చును పెంచేది గాను, సంస్థాగత సహకారం లేక అప్పులపాలవుతూ వచ్చింది. ఎరువులు, పురుగు మందులు, విద్యుత్ బోర్లపై ఆధారపడ్డ నీళ్లు, గ్యారంటీ లేని హైబ్రిడ్ విత్తనం, చివరకు గిట్టుబాటు ధర లేకపోవడం కనబడుతుంది. (పట్టిక-6)

ఒకపక్క ఉత్పత్తిలో పెరుగుదల రేటు కనబడుతున్నా తలసరి వ్యయాన్ని చూస్తే (పట్టిక-4) 1983-84 నుండి 1987-88 మధ్య పెరుగుదల కనబడుతోంది. భూస్వాములు, మధ్య తరగతి రైతుల్లో 1987-88 వరకు చిన్న, సన్నకారు రైతుల్లో 1983-84 - 1993-94 వరకూ తలసరి వ్యయంలో పెరుగుదల కనబడుతోంది. 1999-2000 కొచ్చేసరికి అన్ని వర్గాల రైతుల తలసరి వ్యయం పడిపోతోంది. అదే సరళి వ్యవసాయ కూలీలు, ఇతర కూలీల్లో కూడా కనబడుతోంది. అంటే 1994 నుంచి తీవ్ర సంక్షోభ దిశగా తెలంగాణ రైతుల పయనం కొనసాగుతోంది. దానికి ప్రతీకగా 1997 నుంచి వస్తుతంగా వందలాది సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకోవడంతో ఈ సంక్షోభం బద్ధలయింది. 1987 వరకూ ఆదాయాలు పెరిగాయి. ఇది కొంతవరకు ఉద్యమాల ప్రభావం. తరువాతదశలో ఉత్పత్తి పెరిగినా ఆదాయాలు పడిపోవడం కనిపిస్తోంది.

అలాగే వ్యవసాయ కూలీల నిజ వేతనాలను పరిశీలిస్తే (పట్టిక-5) 1970-1989 మధ్య స్త్రీ, పురుషుల నిజ వేతనాలు పెరుగుదల వరుసగా 4.5%, 4.7% గాను ఉంటే 1994-2000 కొచ్చేసరికి స్త్రీ, పురుషులిరువురికి 0.1% ఉంది.

### తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాల రైతుల్లో వర్గాల వారీగా తలసరి వ్యయాల వివరాలు (రూపాయల్లో)
(పట్టిక - 4)

| | 1983-84 | | 1987-88 | | 1993-94 | | 1999-2000 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర | తె. | ఆం.ప్ర | |
| పెద్ద రైతు | | 149.47 | 151.61 | 180.1 | 183.18 | 169.58 | 166.81 | 168.3 | 164.35 |
| మధ్యతరగతి రైతు | 135.19 | 135.64 | 135.58 | 146.15 | 130.98 | 142.95 | 128.35 | 138.18 | |
| చిన్న రైతు | | 113.53 | 117.2 | 127.27 | 132.84 | 133.8 | 139.93 | 127.02 | 135.02 |
| సన్నకారు రైతు | 112.36 | 120.08 | 121.43 | 124.71 | 131.92 | 124.23 | 116.13 | 125.63 | |
| వ్యవసాయ కూలి | 96.45 | 94.63 | 100.34 | 100.85 | 110.17 | 110.43 | 102.83 | 106.95 | |
| స్వయం ఉపాధి | 117.35 | 115.07 | 135.81 | 134.29 | 132.69 | 135.01 | 125.23 | 126.86 | |
| వ్యవసాయేతర కూలి | 114.35 | 107.57 | 127.29 | 116.84 | 136.69 | 116.15 | 142.38 | 127.55 | |
| ఇతరులు | 135.0 | 148.72 | 167.72 | 169.29 | 204.06 | 196.63 | 155.31 | 178.34 | |
| ప్రాతినిధ్య సరాసరి | 115.6 | 114.51 | 125.72 | 125.58 | 132.14 | 128.68 | 119.57 | 124.30 | |

తె - తెలంగాణ; ఆం.ప్ర - ఆంధ్ర ప్రదేశ్

**1970-2000 మధ్య తెలంగాణలో వ్యవసాయ కూలీల నిజ వేతనాల పెరుగుదల సూచి**

(పట్టిక - 5)

| కాలవ్యవధి | వేతనాలలో పెరుగుదల శాతం | |
|---|---|---|
| | పురుషులు | స్త్రీలు |
| 1970-79 | 2.7 | 3.5 |
| 1980-89 | 4.7 | 4.5 |
| 1990-99 | 1.5 | 1.3 |
| 1994-2000 | 0.1 | 0.1 |

ఈ మొత్తం క్రమంలో మనకు అర్థమయ్యే విషయం ఏమంటే ధరలు తగ్గినా అవే పంటలు (ఆహారేతర పంటలు) ఉత్పత్తి పెరిగింది. విస్తీర్ణం కూడా పెరిగింది. (పట్టిక-6)

మన దృష్టిలోకి వచ్చే వాస్తవమేమంటే 1980ల వరకూ ఉత్పత్తి, సాగు విస్తీర్ణం, ధరలు పెరుగుతూ వచ్చాయి. కాని ఆ తరువాత ధరలు తగ్గుతున్నా పత్తి, మిర్చి లాంటి పంటలనే ఎందుకు వేస్తున్నారు? తెలంగాణకు వచ్చేసరికి (మొత్తంగా ఇలాంటి వ్యవసాయ పరిస్థితులే నెలకొన్న వివిధ ప్రాంతాల్లోనూ) అప్పులిచ్చే వారే పంటను నిర్ణయిస్తారు. 'మేం అప్పులిస్తాం... మాకే అమ్మండి. అదీ ఆహారేతర పంటల రూపంలోనే' అ అప్పు తీర్చాలని, ఈ 'విషయాన్ని కూడా చాలా సున్నితంగానే నిర్దేశిస్తారు. అప్పుడు జరిగేదేమంటే ధరలు తగ్గేకొద్ది తీర్చాల్సిన అప్పుకు ఆహారేతర పంటల ఉత్పత్తి పెంచాలి. అప్పుడు విస్తీర్ణం కూడా పెంచాలి. అంతేకాక ఉన్న విస్తీర్ణంలో దిగుబడి పెంచేందుకు విపరీతమైన పెట్టుబడి పెట్టాలి. ధరలు ప్రపంచ మార్కెట్ నుండి వస్తున్నాయి. స్వేచ్ఛా మార్కెట్ ధరలను అస్తవ్యస్తం చేసేసింది. ఉత్పత్తి పెరుగుతోంది. కాని ఆదాయం పడిపోతోంది. అంటే తెలంగాణ వ్యవసాయ సంక్షోభానికి మూలాలు ప్రభుత్వ గణాంకాలతో, ఎన్.ఎస్.ఎస్ డాటాతో, క్షేత్ర పరిశోధనతో అర్థమవుతాయి. సమస్య లోతు సమగ్రంగా గోచరిస్తుంది.

**చిన్న, సన్నకారు రైతాంగాన్ని నిర్మూలించే దిశగా విధానాలు:**

అభివృద్ధి చెందిన దేశాలు ఒక పక్క తమ రైతులకు విపరీతమైన సబ్సిడీలు ఇస్తూ, అభివృద్ధి చెందుతూ ఉన్నా మనలాంటి దేశాల్లో సబ్సిడీలపై కోత విధించమని విధాన నిర్దేశాలు చేస్తున్నారు. ఈ అసమ పోటీలో ఒక పక్క పెట్టుబడి విపరీతంగా పెరగడం, మరో పక్క సబ్సిడీల కోతతో మన రైతు అభివృద్ధి చెందిన దేశాల రైతులతో పోటీకి నిలబడాల్సి వస్తోంది. ఉత్పత్తి చేయడానికి ఇచ్చే సబ్సిడీలే కాక ఆహార సబ్సిడీలూ ఎత్తివేయడం వలన అటు ఆహార భద్రత కూడా లేకుండా పోయింది. పేదరికం, ఆకలి చుట్టుముట్టి ఆత్మాభిమానంతో ఆత్మహత్యల పాలవుతున్నారు.

**వ్యవసాయంలోకి అనుమతించిన కొన్ని ముఖ్య సరళీకరణ విధానాలు**

1. వాణిజ్య సరళీకరణ - 1998లో 470 వ్యవసాయ ఉత్పత్తులపై పరిణామాత్మక ఆంక్షలు ఎత్తివేసారు. తదుపరి 1400 వ్యవసాయోత్పత్తులను ఓ.జి.ఎల్ లిస్టులోకి చేర్చారు. దిగుమతి సుంకాలు 15-35% తగ్గించారు. చాలా పంటల వాణిజ్యం సరళీకరించారు. ఎగుమతి, దిగుమతుల్లో స్వేచ్ఛా మార్కెట్‌కు తలుపులు తెరిచారు. మన దేశం సాగులో ప్రాధాన్యత వహించే పంటలైనటువంటి వరి, గోధుమ, పత్తి, పప్పు దినుసులు, నూనె గింజలు వంటివన్నీ ఉన్నాయి.

2. ముడిసరుకుల సరళీకరణ -

ఎ. విత్తనాలు - పాక్షికంగా విత్తన పరిశ్రమను, దిగుమతులు (1988) సరళీకరించడం, విత్తన పరిశ్రమ సరళీకరణ ఇప్పటికి కొనసాగుతోంది (2003)

బి. ఎరువులు - ఎరువులపై సబ్సిడీలను క్రమంగా ఎత్తి వేయడం 1991 నుంచి ఈ ప్రక్రియ కొనసాగుతూనే ఉంది. అంతిమంగా పూర్తిగా ఎత్తేయడమే లక్ష్యం.

సి. విద్యుత్ - విద్యుత్ సబ్సిడీలను తగ్గించేశారు (1997-99); విద్యుత్ ఉత్పాదనలో ప్రైవేట్ శక్తులకు, అంతర్జాతీయ కంపెనీలకు భాగస్వామ్యం కల్పించారు. (ఎన్రాన్ - ఒక ఉదాహరణ)

డి. నీటి పారుదల - వివిధ రాష్ట్రాలలో నీటి వాడుక సంఘాలు ఏర్పాటు చేయడం; చెరువులు, కాల్వల వాడకంపై కొత్త తరహా హక్కులను రూపొందించడం.

ఇ. సంస్థాగత రుణాలు - నర్సింహన్ కమిటీ, ఖుస్రో కమిటీ సిఫారసులకు అనుగుణంగా రాష్ట్రాలందించే వ్యవసాయ రుణ సదుపాయాన్ని తగ్గించడం.

3. ఆహార సబ్సిడీ - నిర్దేశిత ప్రజా పంపిణీ వ్యవస్థ (1997); రెండు ధరల పద్ధతి (దారిద్ర్య రేఖకు ఎగువ, దిగువ) - 2000; ఆహార సబ్సిడీల స్థానే ఆహార కూపన్‌ల పద్ధతి ప్రవేశపెట్టడం.

పై మార్పులన్నీ సరళీకరణలో భాగంగా చేపట్టారు.

**తెలంగాణలో ధరల సూచికలు, ధరల రిస్క్, విస్తీర్ణం, దిగుబడుల సరాసరి విలువలు:**

(పట్టిక - 6)

| కాల వ్యవధి | ఆహారేతర పంటల ధరల సూచిక | ఆహారేతర పంటల ధరల రిస్క్ | ఆహారేతర పంటల మొత్తం విస్తీర్ణం | ఆహారేతర పంటల మొత్తం దిగుబడి |
|---|---|---|---|---|
| 1985-1991 | 146 | 68 | 26% | 39% |
| 1992-2000 | 127 | 68 | 33% | 48% |

రెండవది: వ్యవసాయ ప్రపంచీకరణ స్థానిక పరిస్థితులతో, అవసరాలతో సంబంధం లేకుండా అమలు అవుతోంది. అందువల్ల అది చివరకు వ్యవసాయ విధ్వంసానికి కారణమవుతోంది.

మూడవది: ఇటువంటి వ్యవసాయ ప్రపంచీకరణను సూచిస్తున్న, సమర్థిస్తున్న వారు మన వ్యవసాయం పురాతనమైందని, చాలా వెనకబడిందని చెపుతున్నారు. దీనిని కార్పొరేట్ వ్యవసాయంతోను, కాంట్రాక్ట్ వ్యవసాయంతోను సరిదిద్దాలని వీరు చేసే వాదన. అయితే వాదనలకే పరిమితం కాలేదు, ప్రపంచ వ్యాప్తంగా చాలా దేశాల్లో ఈ విధానాలు అమలయ్యాయి. సరిగ్గా విజన్-2020లో అప్పటి ప్రభుత్వం రాసుకున్న విధానాలవే... ఆ దిశగా పైలట్ ప్రాజెక్టులు కూడా మన రాష్ట్రంలో అమలు చేయడం మనకు తెలుసు.

**చిన్న, సన్నకారు వ్యవసాయంతోనే ప్రకృతి వైవిధ్యాన్ని కాపాడగలం**

వ్యవసాయ ఉత్పాదకతకు సంబంధించి ఎన్నో వాదనలు, ఆధారాల ద్వారా పెద్ద కమతాల కన్నా చిన్న కమతాలలోనే మంచి దిగుబడులు సాధించవచ్చని తెలుస్తోంది (హెర్రింగ్ 1983, బిన్స్ వాంజెర్ 1995). చరిత్రలో ఎన్నో ఉదాహరణలున్నాయి. వాటిలో ఒకటి, గత 50 ఏళ్లుగా విజయవంతంగా తూర్పు ఆసియా, ఆగ్నేయాసియాల్లో కొనసాగుతున్న చిన్న, సన్నకారు వ్యవసాయం. రెండవ ఉదాహరణ ఇంగ్లీషు వ్యవసాయం (1450-1850ల మధ్య) లాభసాటిగా మనుగడ సాగించడం చూడవచ్చని ఆధారాల ద్వారా తెలుస్తోంది. అలాగే పర్యావరణ జీవ వైవిధ్యాన్ని కూడా చిన్న రైతులే పరిరక్షించగలరని లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా దేశాల అనుభవాల నుంచి అర్థమవుతోంది.

కోట్లాదిగా ఉన్న చిన్న, సన్నకారు రైతులు ఉపాధి కొరకు, జీవనాధారంగా ఈ చిన్న కమతాల వ్యవసాయం పైనే మనుగడ సాగిస్తున్నారు. కొద్దిమంది ఆర్థికవేత్తలు మాత్రం ఇక్కడ పరిస్థితికి సరిపోని ఆధునీకీకరణ, పారిశ్రామికీకరణలను నిర్దేశిస్తున్నారు. ఈ వాదనలను తిరస్కరించవలసిన అవసరం ఎంతైనా ఉంది. అటు పర్యావరణ వైవిధ్యాన్ని కాపాడుకోవడానికి, ప్రజాస్వామిక స్ఫూర్తిని నిలిపి ఉంచడానికి చిన్న కమతాల వ్యవసాయమే మేలు.

**ప్రపంచీకరణ విధానాలకు ప్రత్యామ్నాయాలు**

1. సంస్థాగత రుణ సదుపాయాన్ని పెంచడం: గ్రామీణ రైతాంగాన్ని దళారులు, వ్యాపారులు, అప్పులిచ్చేవారి దయాదాక్షిణ్యాలకు వదిలేసే పద్ధతి కాకుండా సంస్థాగత రుణ సదుపాయాన్ని అందించాలి.
2. భూసంస్కరణలు అమలు చేయాలి: ప్రజా పోరాటాల నేపథ్యం ఉన్న తెలంగాణ ప్రాంతంలో అటు ప్రజల ఆకాంక్షలను దృష్టిలో ఉంచుకుని మరోవైపు న్యాయ, ప్రజాస్వామిక, సమానత సూత్రాల ఆధారంగా భూముల పునఃపంపిణీ చేయాలి.
3. హేతుబద్ధతతో కూడిన సబ్సిడీని కొనసాగించాలి: అభివృద్ధి చెందుతున్న దేశాలలో రైతులకు సబ్సిడీలను కొనసాగించి యూరోపియన్ యూనియన్, యుఎస్, జపాన్ వంటి ధనిక దేశాల రైతులకు, వ్యాపారులకు సబ్సిడీలను తొలగించాలి. తద్వారా పోటీలో సమతుల్యత ఉండేలా చూడాలి.
4. ప్రజా పంపిణీ వ్యవస్థను అభివృద్ధి పరచాలి: ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు తగ్గిస్తూ వచ్చిన ప్రజా పంపిణీ వ్యవస్థను వాస్తవానికి మరింత పటిష్ఠ పరచాలి. ప్రజా పంపిణీ సక్రమంగా జరిగేటట్లు చూడాలి. దీని వలన ఆహార భద్రత కలిగి, ఆకలి దారిద్ర్యాలను కొంతవరకు నిలువరించవచ్చు.
5. సహకార వ్యవస్థలను బలోపేతం చేయాలి: చిన్న, సన్నకారు రైతులంతా చిన్న చిన్న సహకార సంస్థలుగా ఏర్పడి వ్యవసాయానికి అవసరమయ్యే ముడి సరుకులు సమకూర్చుకోవడానికి, ఉత్పత్తిని అమ్ముకోవడానికి సమష్టిగా బయటి మార్కెట్‌ను ఎదుర్కోవాలి.

ఇవే కాక నీటి పారుదల విషయంలో భూగర్భ జలాలు కాకుండా చిన్న, మధ్య తరహా పర్యావరణ అనుకూల ప్రాజెక్టులను నిర్మించాలి. హరిత విప్లవం కలుగచేసిన దుష్ప్రభావాలను దృష్టిలో ఉంచుకొని విమర్శనాత్మక దృష్టితో నిర్మాణ చర్యలు చేపట్టాలి. అంతిమంగా సమానత, సుస్థిరతల ఆధారంగా వ్యవసాయాన్ని ముందుకు తీసుకుపోవాలి. ❑

## చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

- సర్క్యులేషన్ మేనేజర్

# అడవులు - రాజ్యాంగ యంత్రం - ఆదివాసులు

**బిర్సు**

**విధాన విమర్శ**



ఈ మధ్య కేంద్ర ప్రభుత్వ గిరిజన వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో షెడ్యూల్ తెగల అటవీ హక్కుల గుర్తింపు బిల్లు-2005 ముసాయిదాను తీసుకురావడం జరిగింది. ప్రధానంగా ఈ బిల్లులో ఆదివాసులకు జరిగిన చారిత్రక అన్యాయాన్ని గురించి, అడవులను జాతీయ ఆస్తిగా మార్చే క్రమంలో ఆదివాసులు హక్కుల గుర్తింపు, ఉనికి కోల్పోవడం గురించి ప్రస్తావించారు. అధికార మార్పిడి (1947) తరువాత మొట్టమొదటి సారిగా ప్రభుత్వం ఈ చారిత్రక అన్యాయాన్ని ఒప్పుకోవడం, పరిష్కారం కొరకు హక్కుల గుర్తింపు చట్టం అవసరాన్ని గుర్తించడం ఆదివాసి ఉద్యమాల మూలంగానే జరిగింది.

ఈ చట్టం తీసుకురావడంలో మరొక కుట్ర కూడా దాగి ఉంది. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణలో భాగంగా శరవేగంగా దూసుకువస్తున్న నూతన ఆర్థిక విధానాలు ప్రపంచ వ్యాప్తంగా విస్తారంగా ఉన్న సహజ వనరులన్నింటినీ, అడవులతో సహా కారుచౌకగా వీలయినంత వేగంగా వినియోగించుకోవాలనే ఆకాంక్షలను తెలుపుతున్నాయి. ఇటువంటి అవకాశం కోసం ఎదురుచూస్తున్న బహుళజాతి సంస్థలు సహజంగానే అటవీప్రాంత సంపద మీద, వనరుల మీద, విలువైన ముడి పదార్థాల మీద, మరీ ముఖ్యంగా గిరిజన ప్రాంతాల మీద కన్ను వేసాయి. ఇప్పటికే ప్రపంచబ్యాంకు మార్గదర్శకత్వంలో 'సాముదాయక అటవీ యాజమాన్య పథకం', 'వన సంరక్షణ సమితులు' వంటి కార్యక్రమాలు చేపట్టి సహజ వనరులను ప్రయివేటీకరించే ప్రక్రియలో భాగంగా విశాఖ జిల్లా పాడేరు డివిజన్ పరిధిలో రిలయన్స్ కంపెనీ తొంబైతొమ్మిది వన సంరక్షణ సమితులలో నాలుగు కోట్లు పెట్టుబడి పెట్టి తమకు కావాల్సిన మందు మొక్కలు, ఇతరత్రా మొక్కలు పెంచుతున్నారు. ఖమ్మం జిల్లా భద్రాచలం డివిజన్‌లో ఎ.పి. పేపర్ మిల్లు, మురుగప్పన్ కంపెనీలు ముప్పైమూడు వన సంరక్షణ సమితీలలో తొమ్మిది కోట్లు పెట్టుబడి పెట్టి తమ పరిశ్రమలకు కావలసిన ముడి సరుకులను తరలించేందుకు ప్రభుత్వంతో ఒప్పందాలు కుదుర్చుకున్నాయి.

ఈ తరుణంలో తెచ్చిన ఈ బిల్లు ముసాయిదా సహజంగానే ఆదివాసుల అటవీ హక్కుల విషయంలో ప్రభుత్వ నిజాయితీకి సంబంధించి సహజంగానే అనేక అనుమానాలకు - ప్రశ్నలకు అవకాశం కల్పిస్తోంది.

శతాబ్దాలుగా అడవుల నుంచి ప్రయోజనాలు పొందుతున్నది ఆదివాసులు మాత్రమే. వాళ్ల అవసరాలు, విశ్వాసాలు, సాంస్కృతిక, మతపరమైన కార్యకలాపాలు, వాళ్ల సాంప్రదాయక హక్కులు అడవులను పాలించాయి. అడవులతో వాళ్ల సజీవ సంబంధం ఒకే సమయంలో శాస్త్రీయంగానూ, మూఢ నమ్మకాల మయంగానూ ఉంటుంది. ఈ ప్రశాంత వాతావరణం పందొమ్మిదో శతాబ్ద మధ్య భాగం నుంచి భంగపరచబడడం మొదలైంది. ఆ సమయాన బ్రిటిష్ వలస పాలకులు తమ వ్యాపార అవసరాల కోసం అడవుల మీద తమ పాలనాధికారాన్ని స్థాపించుకోవడం మొదలుపెట్టారు. అయితే అంతకు ముందే ఛోటా నాగపూర్ ప్రాంతంలో జరిగిన ఆదివాసీ తిరుగుబాట్లు, 1850లో జరిగిన సంతాల్ తిరుగుబాటు బ్రిటిష్ పాలకులు తమ విధానంలో జాగరూకులై ఉండవలసిన అవసరాన్ని కలిగించాయి. కనుక అడవుల మీద ఒక్కొక్క మెట్టుగా అధికారాన్ని సంపాదించుకునే దీర్ఘకాలిక చర్యగా బ్రిటిష్ అడవుల విధానం రూపొందింది.

ఈ విధానం 1865లో ప్రవేశపెట్టబడిన ప్రభుత్వ అడవుల చట్టం ద్వారా మొదలయ్యింది. ఈ చట్టం ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వం ఏ అడవినైనా ప్రభుత్వ అడవిగా ప్రకటించే హక్కును సంక్రమించుకుంది. అయితే ఈ అధికారానికి కూడా ఒక పరిమితి ఉంది. ప్రభుత్వ అడవి ప్రకటన ఆ ప్రాంత ప్రజలు అనుభవిస్తున్న హక్కులను తగ్గించకూడదు. వాటిపై ప్రభావం వేయకూడదు.

వాళ్ల అవసరాలు పెరుగుతున్న కొద్దీ బ్రిటిష్ వాళ్లు మొదటి చట్టాన్ని రద్దు చేసి దాని స్థానంలో ఒక కొత్త భారత అడవుల చట్టాన్ని 1878లో ప్రవేశపెట్టారు. మొట్టమొదటి సారిగా ఈ చట్టం అడవులను రిజర్వ్ అడవులు, రక్షిత అడవులు, గ్రామ అడవులుగా వర్గీకరించింది. వాటిపై వేరు వేరు అధికారాలను ప్రకటించింది. మొట్టమొదటి సారిగా ఈ చట్టం సాయంతో ప్రభుత్వ ఆదివాసుల

నుంచి అడవిని స్వాధీనం చేసుకుని రిజర్వ్ అడవిగా ప్రకటించుకునే హక్కును పొందింది. ఈ చట్టం అప్పటికీ ఏకైక లాభాల వనరుగా ఉన్న కలపపై పన్ను విధించే నిబంధనలను మొదటిసారిగా ప్రకటించింది. ఇంతేగాక అడవుల్లో కొన్ని పనులు నేరాలుగా ప్రకటించబడి అటవీశాఖ అధికారులకు న్యాయాధికారాలు ఇవ్వబడ్డాయి. ఈ న్యాయాధికారాలు 'తగిన అనుమానం ఉంటే' ఏ వ్యక్తినైనా వారెంట్ లేకుండా అరెస్ట్ చేసే హక్కును అటవీ అధికారులకు కలుగజేశాయి. ఆ తర్వాత 1890లోనూ, 1891లోనూ చేసిన కొన్ని సవరణలతో ప్రభుత్వం మరిన్ని అధికారాలు సంపాదించింది. ఈలోగా కేంద్ర చట్టంతో సమానంగా మద్రాసు ప్రెసిడెన్సీ కూడా 1882లో మద్రాస్ అడవుల చట్టాన్ని ప్రకటించింది.

ఈ చట్టాలూ, సవరణలూ కాక బ్రిటిష్ ప్రభుత్వం 1894లో ఒక సమగ్ర అడవి విధానాన్ని ప్రకటించింది. దానిలోని ముఖ్య లక్షణాలే ఇవాల్టి వరకు ప్రభుత్వ విధానాలను శాసిస్తున్నాయి. 'ప్రజోపయోగ' ప్రయోజనాల కోసం ప్రభుత్వం 'హక్కులను నియంత్రించవచ్చుననీ, అధికారాలపై పరిమితులు విధించవచ్చుననీ' ఈ విధానం స్పష్టంగా ప్రకటించింది. అడవులను వాడుకోవడంలో ఆదివాసులకు మిగతా సమాజానికి మధ్య వైరుధ్యం ఉన్నదని రాజ్యాంగ విధానంలో ప్రకటించబడడం అదే మొదటిసారి. అయితే ఈ విధానం మిగతా సమాజ ప్రయోజనాలకు అనుగుణంగానే మలచబడింది. దాదాపు అన్ని అడవి విధానపు తీర్మానాలలోనూ హోరెత్తే 'ప్రజోపయోగం' అనే మాట సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల వ్యాపార ప్రయోజనాలకు ముసుగుతప్ప మరేమీ కాదని గుర్తించాలి.

ఈ అడవి విధానాన్ని అమలు చేయడానికై అడవులు నాలుగు విధాలుగా వర్గీకరించబడ్డాయి. అవి: 1. వాతావరణ, భౌతిక కారణాల వల్ల తప్పనిసరిగా పరిరక్షించవలసిన అడవులు. ఇవి సాధారణంగా కొండల మీద పెరిగే అడవులు. 2. వ్యాపార అవసరాల నిమిత్తం విలువైన కలపను సరఫరా చేయగల అడవులు. 3. తక్కువ రకం కలపను గానీ, మంచి కలపను కొద్ది స్థాయిలోగానీ ఉత్పత్తి చేసే చిన్నపాటి అడవులు. 4. పశువుల మేతకు ఉపయోగపడే గడ్డి భూములు. ఈ వర్గీకరణ చట్టాలలో అనుసరించిన వర్గీకరణపై ఏ ప్రభావమూ వేయలేదు. చట్టాలలో చేసిన వర్గీకరణ అడవుల మీద అమలవుతున్న అధికారం ఆధారంగా చేయగా ఈ కొత్త వర్గీకరణ వ్యవహారికంగా సాగింది. పాత చట్టాలలో మరి నాలుగు సవరణలు చేసిన తర్వాత చివరికి 1927లో బ్రిటిష్ పాలకులు ఒక కొత్త సమగ్ర శాసనాన్ని ప్రకటించింది.

1927 భారత అడవుల చట్టం 1894 విధానంలోని మార్గదర్శక సూత్రాలను తనలో సంలీనం చేసుకుంది. కానీ ప్రధానమైన రిజర్వ్, రక్షిత, గ్రామ అరణ్యాల వర్గీకరణ అట్లాగే మిగిలిపోయింది. ప్రభుత్వ అధికార స్థాయి దృష్ట్యా చూస్తే రిజర్వ్ అడవులు వాస్తవానికి ప్రభుత్వ అడవులే. ఈ అడవులలో నివసించే ఆదివాసీ ప్రజానీకపు హక్కులు లిఖిత రూపంలో నియంత్రించబడ్డాయి. వీటిని మార్చగల అధికారం ప్రభుత్వానికి లేదు. గ్రామ అడవులలో ప్రజానీకానికి అన్ని హక్కులూ అంగీకరించబడ్డాయి. ఏ పరిమితులు అమలు చేయబడలేదు. ఈ చట్టం ఐదు ప్రధాన పరిణామాలకు దారితీసింది. రిజర్వ్ అడవులుగా వర్గీకరించబడిన అడవులలో ప్రభుత్వానికి చాలా అధికారాలుంటాయి. స్థానిక ప్రజల వ్యాజ్యాలు పరిష్కరించడానికి కొంత కాలపరిమితి ఏర్పరచబడింది. ఈ చట్టం ద్వారా ప్రభుత్వ అడవుల్లోనే గాక ఇతర అన్ని అడవుల్లోనూ ఒక్క కలప మీదనే కాక ఇతర అటవీ ఉత్పత్తులన్నిటి మీద పన్ను విధించే అధికారాన్ని ప్రభుత్వం సంక్రమింపజేసుకుంది. నేరాల జాబితా పెంచబడింది. ఈ నేరాలకు విచారణ లేకుండా ఆరు నెలలు జైలు శిక్ష లేదా ఐదు వందల జరిమానా లేదా రెండు కలిసిన శిక్ష విధించే అధికారాన్ని ప్రభుత్వం పొందింది. పోడు వ్యవసాయ పద్ధతి రాష్ట్ర ప్రభుత్వ పరిధిలో చేర్చబడింది. దానిపై అధికారం, నిర్బంధం, నిషేధం రాష్ట్ర ప్రభుత్వ అధికార పరిధిలోకి తీసుకురాబడ్డాయి. ఐతే ముఖ్యంగా గమనించవలసిన మార్పేమిటంటే ఈ చట్టంలో 'ఆదివాసుల మొత్తం హక్కులు' గురించిన ప్రస్తావన తొలగించబడింది. వాటిని 'వ్యక్తుల హక్కులూ, అధికారాలు' అని ప్రస్తావించారు. 1935 భారత ప్రభుత్వ చట్టం అడవులను ప్రాంతీయ శాసనసభల పరిధిలోకి తెచ్చింది. అయితే ప్రభుత్వ చట్టాలూ, నిబంధనలూ అన్ని అడవులకూ వర్తించవనేది గుర్తుంచుకోవాలి. జమీందార్ల స్వంతమైన వ్యక్తిగత అడవులు, సంస్థానాలలోని అడవులు ఈ చట్టాల నుండి మినహాయించబడ్డాయి.

భారత ప్రభుత్వం 1952లో తన అడవుల విధానాన్ని రూపొందించింది. ఈలోగా రెండవ ప్రపంచ యుద్ధం వల్ల విపరీతంగా పెరిగిన రక్షణావసరాలు పాలకులకు అడవుల ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పాయి. యుద్ధకాలంలో అడవుల నుంచి వసూలయ్యే మొత్తం ఆదాయం ఏడుసార్లు పెంచబడింది. జమీందార్ల అధీనంలోనూ, సంస్థానాలలోనూ ఉన్న అడవులతో సహా దేశంలోని అన్ని అడవులు కొత్త ప్రభుత్వ పరిధిలోకి తీసుకురాబడ్డాయి. ఇప్పటికీ అమలవుతున్న 1894 నాటి అడవుల విధానానికి పునాది అయిన ప్రాథమిక సూత్రాలు ఇప్పటికీ సరిపోతాయనీ 1952 అడవుల విధానం స్పష్టంగా ప్రకటించింది. అయితే ఈ విధానం 1894 విధానం కంటే మించినదేనని చెప్పవచ్చు. ఈ విధానం 'ఆరు శాశ్వత అవసరాల' భూమిక మీద రూపొందించబడింది. 1. భూ ఉపయోగంలో సమతౌల్యమైన, ఉచితమైన విధానం రూపొందించడం. 2. వరదలనూ, భూమి కోతనూ అడ్డుకోవడం. 3. అడవులను పెంచడం. 4. పశువుల మేత, పనిముట్ల కోసం కలప, వంట చెరకు మొదలైన వ్యవసాయ అవసరాలు తీర్చడం. 5. రక్షణ సమాచార సంబంధాలకు, పరిశ్రమలకు అవసరమైన కలప, ఇతర అటవీ ఉత్పత్తులను నిరంతరాయంగా సరఫరా కొనసాగించడం. 6. వీలైనంత ఎక్కువ సాలుసరి ఆదాయం సంపాదించడం.

ఈ విధానం 'పరిసర ప్రాంత ప్రజల సంక్షేమాభివృద్ధి' గురించి కొంత చెప్పింది. అయినప్పటికీ 'అడవిపై దాని ఉత్పత్తులపై పరిసర ప్రాంత ప్రజల ఆధిపత్యపు ప్రాధాన్యతను

అడ్డుకోవలసిన' అవసరాన్ని ఈ విధానం స్పష్టం చేసింది. ఈ చట్టం అడవులను నాలుగు విధాల వర్గీకరించింది. భౌతిక వాతావరణ అవసరాల కోసం కాపాడవలసిన లేదా పెంచవలసిన రక్షిత అడవులు; రక్షణ, సమాచార సంబంధాలు పరిశ్రమల అవసరాలు తీర్చడానికి ఉపయోగపడే జాతీయ అరణ్యాలు; వ్యవసాయదారుల అవసరాలు తీర్చడానికై కాపాడవలసిన గ్రామ అడవులు; భౌతిక పరిస్థితులను క్రమబద్ధం చేయడానికి అవసరమైన చెట్ల భూములు. అందుకు వ్యతిరేకమని ఎంతగా ప్రకటించినప్పటికీ కొత్త విధానం పాత విధానం నుంచి గణనీయమైన తేడాను కనబరుస్తున్నది. కొత్త విధానం ప్రకారం రిజర్వ్ అడవులను దానిలో నివసించే ఆదివాసులకు వదిలివేయడం నిషేధించబడింది. ఆదివాసుల వ్యక్తిగత అడవులపై పరిమితులు విధించబడ్డాయి. పశువుల మేత భూములు ప్రభుత్వ అధికార పరిధిలోకి తేబడ్డాయి.

1952 విధానంలో ప్రధానాంశమేమంటే అది అభివృద్ధి, వ్యాపార అవసరాలకూ, పరిసరాల దీర్ఘకాలిక అవసరాలకూ, ఆదివాసుల సంక్షేమానికి మధ్య ఉన్న వైరుధ్యాలను స్పష్టంగా గుర్తించింది. దేశంలో ఉన్న అడవి ప్రాంతాలను మొత్తం వైశాల్యంలో 24 శాతం నుంచి 33 శాతానికి పెంచే నిర్ణయం ఈ విధానంలో తీసుకోబడింది. హిమాలయాలలోనూ, దక్కన్ కొండలలోనూ వరదలను అరికట్టడానికై 60 శాతం అడవులను పెంచాలనీ సూచించింది. ప్రజానీకపు హక్కులు 1927లో వ్యక్తుల 'హక్కులు, అధికారాలు'గా మారగా 1952లో 'హక్కులు, రాయితీలుగా' మారిపోయాయి.

అయితే 1952 అటవీ విధానం ఆచరణలో అడవుల మీద, ఆదివాసుల మీద వినాశకరమైన ప్రభావాన్ని వేసింది. అడవులలో చెప్పలేనన్ని పాలనా సంబంధమైన మార్పులకు దారితీసింది. బీట్ కాపలాదారు, ఫారెస్ట్ రేంజర్ దగ్గర ప్రారంభించి ఫారెస్ట్ సర్వీస్ అధికారుల దాకా మొత్తం అటవీ అధికారులందరూ స్థానిక ఆదివాసుల మీద పడ్డారు. అధికారుల సంఖ్య 10 వేల నుంచి 93 వేలకు పెరిగింది. ఈ విధానం ఫలితంగా అటవీ అధికారుల నిరంకుశమైన, ఇష్టం వచ్చిన నిర్ణయమే అడవుల వర్గీకరణకు ప్రాతిపదిక కావడం మొదలైంది. రాజస్థాన్, మహారాష్ట్రలలో చెట్లు మచ్చుకైనా కనబడని కొన్ని ప్రాంతాలు అడవి ప్రాంతాలుగా ప్రకటించబడ్డాయి. బీహార్, మధ్యప్రదేశ్, ఒరిస్సాలలోని కొన్ని మామూలు సేద్య యోగ్యమైన భూములు అడవులుగా ప్రకటించబడ్డాయి. ఈ కారణాన అడవి ప్రాంతాన్ని అంచనా వేసే ఏ ప్రయత్నమైనా అర్థరహితంగా మారిపోతుంది. అందువల్లనే 1971 కేంద్ర అడవుల కమిషన్ దేశంలో అడవుల విస్తీర్ణం 74.74 మిలియన్ల హెక్టార్లని అంచనా వేస్తే, వ్యవసాయ గణాంకశాఖ అంచనాల ప్రకారం ఈ సంఖ్య 66 మిలియన్ హెక్టార్లని గుర్తించబడింది. లైసెన్సులు, పర్మిట్లు ఇచ్చే పద్ధతి వల్ల అటవీ అధికారులకు అంతులేని అధికారాలొచ్చాయి. ఇది విపరీతమైన లంచగొండితనానికి దారితీసింది.

చివరకు తేలినదేమంటే విధాన తీర్మానంలో ప్రకటించబడిన 'ఆరు శాశ్వత అవసరాల'లో రెండు మాత్రమే - పారిశ్రామిక అవసరాలు, ఆదాయాన్ని పెంచడం - అత్యధిక ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. ఈ ప్రయోజనాల కోసం అడవులలో ప్రవేశానికి అనుమతించబడ్డ కాంట్రాక్టర్లు అడవిలో పాతుకుపోయారు. ప్రస్తుతం వాళ్లు చిన్నపాటి అటవీ ఉత్పత్తుల వ్యాపారాన్ని తమ గుప్పెట్లో పెట్టుకున్నారు. పరిసర ప్రాంతాలలో భూములు ఆక్రమించుకొని భూస్వాములుగా మారిపోయారు. వాస్తవంగా ఆచరణలో పరిశీలిస్తే మారుమూల ప్రాంతాల అభివృద్ధి అంటే రోడ్లు వేయడమే అయింది. ఈ రోడ్లు అడవుల విధ్వంసానికి రాజమార్గాలయ్యాయి. జాతీయ ప్రయోజనం పేరు మీద జరిగిన ఈ చర్యల వల్ల కలిగిన దెబ్బకు చివరికి ఆదివాసులే భరించవలసి వచ్చింది. ఆదివాసుల సాంప్రదాయిక హక్కులూ క్రమక్రమంగా కొల్లగొట్టబడ్డాయి. లంచగొండి అధికారుల వల్ల ఆదివాసులు నిత్యం కష్టాలు భరించవలసి వచ్చింది. దుర్మార్గులైన కాంట్రాక్టర్లు ఆదివాసుల పట్ల అమానుషంగా ప్రవర్తించారు. ఆదివాసులు తమ బతుకుదెరువు పోగొట్టుకున్నారు. పెద్ద ఎత్తున చిన్నాభిన్నమై పోయారు. ఈ కష్టాలే వాళ్ల జీవన విధానమైపోయాయి. ఆదివాసుల ప్రశాంత జీవనం నాశనమైన సమయంలోనే అడవులు కూడా నాశనమయ్యాయి.

ఈ స్థితిని సమగ్రంగా పరిశీలించడానికి 1961లో భారతదేశంలో అటవీ ప్రాంతాల పాలనపైన, ఆదివాసీల స్థితిగతులపైన దేబర్ అధ్యక్షతన ఒక కమిటీ నియమించింది. ఈ కమిటీ చేసిన కొన్ని ప్రధానమైన సూచనలు: 1. అటవీ వనరులపై ఆదివాసీ తెగల నిర్వహణ, నియంత్రణను సమష్టిగా నెలకొల్పడం. 2. ఆదివాసీ గ్రామాలన్నింటికీ త్రాగునీటి బావులు, పాఠశాలలు, ఆరోగ్య కేంద్రాలు కల్పించడం. 3. గ్రామ అడవుల నుంచి వచ్చే రెవెన్యూలను గ్రామ పంచాయితీ స్వాధీనంలోనే ఉంచడం. 4. అడవులలో లభ్యమయ్యే చిన్న చిన్న అటవీ ఉత్పత్తుల సేకరణ, వాటిని వినియోగపరచుకునే యంత్రాంగం స్థానిక స్థాయిలో ఏర్పర్చడం. 5. మూల అటవీ ఉత్పత్తుల వినియోగంలో ఆదివాసులకు సహకార సంఘాలలో పాత్రను కల్పించడం.

వన్యప్రాణి చట్టం 1972లో వచ్చింది. ఈ శాసనం అటవీ సంరక్షణ చట్టానికి భిన్నంగా ఉంది. వన్యప్రాణులు తిరిగే ప్రాంతంలో నివసిస్తున్న ఆదివాసులను బలవంతంగా తరిమివేసే అధికారాలు ఇచ్చారు. వారికి ఏ విధమైన రీ సెటిల్‌మెంట్ చేయకుండా సంరక్షణ పేరుతో ఆదివాసులను తరిమివేసేందుకు చట్టం రూపొందించారు. దీని ద్వారా రెండు రకాల రక్షిత అడవులను సృష్టించారు. 1.జాతీయ పార్కులు, 2.అభయారణ్యాలు. ఈ ప్రాంతంలో మానవ సంచారంగానీ, పనులుగానీ జరగకుండా కాపాడడం దాని ముఖ్య ఉద్దేశ్యం. అయితే టూరిజంను మాత్రం అనుమతించారు. అడవులే ఆధారం చేసుకుని బతుకుతున్న ఆదివాసులకు ఇది మరణ శాసనంలా తయారైంది. ప్రజలు క్రమంగా ఈ ప్రాంతాల నుండి దూరం చేయబడ్డారు. దీని ద్వారా రక్షితప్రాంత అధికార యంత్రాంగానికి స్థానిక ప్రజల మధ్య అనేక ఘర్షణలు జరుగుతూ వస్తున్నాయి. దీని ద్వారా అర్థం అవుతున్నదేమంటే వేల కుటుంబాలు అటవీ వనరుల నుండి

దూరం కావడం మరొక పక్క సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల పారిశ్రామిక వ్యాపార అవసరాలకు అడవులను నరకకుండా ఆపలేక పోయారు. పైగా యదేచ్ఛగా అడవుల విధ్వంసం కొనసాగుతూనే ఉంది.

1947లో అధికార మార్పిడి జరిగిన తర్వాత రిజర్వ్ ఫారెస్ట్‌గా వర్గీకరించేటప్పుడు ఆదివాసుల భూముల్ని, ఉమ్మడి భూముల్ని, హక్కుల్ని నిర్ధారించకుండానే, రీసెటిల్ చేయకుండానే, ఏకపక్షంగా అడవులుగా ప్రకటించారు. ఆదివాసీ ప్రజల సెటిల్‌మెంట్ హక్కుల గురించి పట్టించుకోలేదు. దీనిని తిరిగి 1988 డిసెంబరులో కొన్ని సవరణలు ప్రతిపాదించి 1990లో కేంద్ర అటవీ పర్యావరణశాఖ కొన్ని సర్క్యులర్స్ తీసుకువచ్చింది.

సర్క్యులర్ నెం. 13-1/90 (ఎఫ్.పి.) - 1,2,3,5లో ఈ వివాదాలను, సమస్యలను చర్చించి వాటి పరిష్కారాలను ఏ విధంగా జరగాలో సూచించింది. 1.అటవీ భూముల ఆక్రమణలను సమీక్షించాలి. 2.అటవీ సెటిల్‌మెంట్ వల్ల తలెత్తిన వివాదాలనూ సమీక్షించాలి. 3. అటవీ భూములలో పట్టాలు/కౌలు/ఈనాములకు సంబంధించిన వివరాలు పొందుపరచాలి. 4. అటవీ గ్రామాలు రెవెన్యూ గ్రామాలుగా మార్చటం. ఇతర పాత నివాస ప్రాంతాలను సెటిల్ చేయడం.

1990లో కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన గైడ్‌లైన్స్ అమలు చేయడంలో రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేస్తున్నాయి. ప్రభుత్వ అధికార్ల వైఫల్యంతో ఈనాడు ఆదివాసులను వారి నివాసాల నుంచి తొలగించే ప్రమాదం ఏర్పడింది. దీని మూలంగా ఆదివాసీ ప్రజలు నిరంతరం నిర్వాసితులు అవుతూనే ఉన్నారు.

ఈ విధంగా వివిధ రకాల చట్టాల పేర్లతో ఆదివాసులను అడవి నుండి దూరం చేస్తూనే నేటి 2005 ముసాయిదా బిల్లు మరో భయంకరమైన షరతు కూడా విధించింది. అదేమంటే అక్టోబరు 25, 1980 ముందుగా కానీ లేక కేంద్ర ప్రభుత్వ అధికార గెజిట్‌లో ప్రకటించే తేదీకి ముందుగా ఆదివాసీ తెగలు అటవీ భూమిని స్వాధీనంలో ఉంచుకొని ఉండి ఉండాలనీ చెబుతూ ఉంది. అంటే 1980 కన్నా ముందు నుండి అడవిలో ఉన్నవారినే గుర్తించి హక్కులు కల్పిస్తామని బిల్లు పెడుతున్నారు. దీనర్థం 1980 తరువాత నుండి సాగుచేస్తున్న అటవీ భూముల నుండి ఆదివాసులను బలవంతంగా తరిమివేసే కుట్ర దాగి ఉంది. అలాగే 1980 కన్నా ముందు నుండే తమ స్వాధీనంలో ఉందని చెప్పే ఆధారం ఏ ఒక్క ఆదివాసీకి కూడా లేదు. అలాంటి ఆధారం (పట్టాలు) ప్రభుత్వం కూడా ఇంతవరకు కల్పించలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే శతాబ్దాలుగా తమ సాంప్రదాయకమైన (అడవులపైన) హక్కులను ఒక్క కలంపోటుతో రద్దుచేసి, ఆదివాసులను అడవుల నుండి తరిమివేయడానికి ప్రజా సమ్మతితో (పాలక ప్రతినిధుల సమ్మతి) చట్టబద్ధతను కల్పించుకోవడానికే ఈ పన్నాగం. ఈ బిల్లు ముసాయిదాలో అనేక అంశాలు లోపభూయిష్టంగా ఉన్నాయి. ఈ బిల్లు ద్వారా వన్యప్రాణుల సంరక్షణకు ఇచ్చిన ప్రాధాన్యత మనుషులకు అంటే ఆదివాసులకు వారి హక్కులకు ఇవ్వడంలేదు. ఆదివాసులకు అడవిపై కనీస అవసరాలు తీర్చుకునే హక్కులు కల్పించబడ్డాయే తప్ప వాణిజ్య పరమైన హక్కులు తిరస్కరించబడ్డాయి. అంటే అడవిలో దొరికే చిన్న చిన్న అటవీ ఉత్పత్తులను సేకరించి వాటిని వినియోగపరుచుకునే హక్కును హరించివేసి, సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకు దఖలుపర్చే ఉద్దేశ్యంతోనే ఈ విధమైన ముసాయిదాను రూపకల్పన చేసింది.

ఈ ముసాయిదా బిల్లు గ్రామసభకు కొన్ని పరిమితులతో కూడిన అధికారాలను కల్పించింది. ముఖ్యంగా అటవీ సంపదను అవసరాలకు వాడుకోవడం, సంపదను దుర్వినియోగం చేసిన వారిపై ఫిర్యాదు చేయడం వంటి వాటిని గ్రామసభకు కల్పించింది. అసలు అటవీ సంపద ఆదివాసుల అవసరాలకు వాడుకునే విధంగా హక్కులు కల్పిస్తారా? అనే గ్యారంటీ లేనపుడు వాటి దుర్వినియోగానికి అవకాశమే లేదు. గ్రామసభల నిర్ణయాలు ఆచరణలోకి రావాలంటే గ్రామసభల కంటే పైస్థాయి కమిటీల అనుమతి తప్పనిసరి. అలాగే ప్రభుత్వ విధానాలకు అనుగుణంగానే జిల్లా, డివిజన్ కమిటీల్లో నిర్ణయాలు చేయాల్సి ఉంటుంది. కావున జిల్లా, డివిజన్ కమిటీల నిర్ణయాలే గ్రామసభల్లో చెల్లుబాటు అవుతుంది. అంతేగానీ ఈ కమిటీల నిర్ణయాలు కాదని నిర్ణయాలు చేసే స్వతంత్రత గ్రామసభలకు ఉందా? ఒకవేళ ఉంటే గ్రామసభ నిర్ణయాలను పై కమిటీలు స్వీకరించే ప్రజాస్వామిక పద్ధతి ఎంతవరకు అమలవుతుందో సందేహమే. మరో విధంగా చెప్పాలంటే అసలైన విధాన నిర్ణయాలు ప్రభుత్వ అధికారుల చేతుల్లో ఉంటే గ్రామసభ నామమాత్రపు ఆమోదసభగా మాత్రమే ఉంటుంది తప్ప నిర్ణయాత్మకమైన పాత్ర పోషించే అవకాశమే లేదు. అయితే గ్రామ సభకు అధికారాలను కట్టబెట్టడం ద్వారా ఆదివాసులకు అటవీ హక్కులు కల్పించామనే భ్రమలు కలిగిస్తున్నది.

ఇప్పటికీ ఆదివాసుల విధానాలకు సంబంధించి అనేక సందర్భాలలో రెవెన్యూ అధికారులకూ, ఫారెస్ట్ అధికారులకూ మధ్య గొడవలు ఉన్నాయి. రెవెన్యూ అధికారులు ఇచ్చిన పట్టాలను (ఇప్పటి వరకు భూములకు పట్టాలివ్వలేదు.) ఫారెస్ట్ అధికారులు గుర్తించడం లేదు. ఆదివాసులు సాగుచేసుకుంటున్న భూములు చాలా వరకు రిజర్వ్ ఫారెస్ట్ కిందకు వస్తాయన్న ఫారెస్ట్ అధికారుల వాదన మూలంగా ఆదివాసులు భూమీమీద హక్కులు కోల్పోతున్నారు. ఈ ముసాయిదా బిల్లులో దీనికి పరిష్కార మార్గం చూపించకపోవడం ద్వారా ఈ రెండు శాఖల మధ్య వైరుధ్యం మరింత జటిలమయ్యే అవకాశమే ఉంది. ఈ బిల్లు పేర్కొన్న మరో గందరగోళ నిర్ణయం ఏమంటే రాష్ట్ర స్థాయిలో ఆదివాసుల హక్కుల చట్టాన్ని పర్యవేక్షించే మానిటరింగ్ కమిటీలో రెవెన్యూ, ఫారెస్ట్ అధికారులతో పాటు పౌర సమాజం ప్రతినిధులుంటారనే విషయాన్ని ప్రకటించింది. పౌర సమాజ ప్రతినిధులంటే - ఆదివాసీ పాలకవర్గ ప్రతినిధులా? ప్రభుత్వం నామినేట్ చేసే సభ్యులా? లేదా ఆదివాసీ తెగల పెద్దలా? అనే విషయాన్ని స్పష్టంగా పేర్కొనాల్సిన అవసరం ఉంది. మరి ప్రస్తుతం రాష్ట్రంలో ఉన్న ఆదివాసీ సలహా మండలి ఉంది కదా! మరి మానిటరింగ్ కమిటీ

ఏర్పడితే సలహామండలి పాత్ర ఏంటి? ఎందుకంటే ఆదివాసీల చట్టాలను పర్యవేక్షించడంలో గానీ, సవరణలు చేయటంలోగానీ, నూతన చట్టాలు తీసుకురావడంలో ప్రభుత్వానికి, గవర్నర్‌కు తగిన సూచనలు, సలహాలు ఇవ్వడంలో దాని పాత్ర అందరికి తెలిసిందే. మరి మానిటరింగ్ కమిటీ ఏం చేయాలనేది కూడా స్పష్టంగా పేర్కొనాల్సి ఉంది.

గ్రామ సభకు విధాన నిర్ణయాలలో భాగస్వామ్యం లేకుండా కేవలం ప్రభుత్వ అధికారుల చేతల ద్వారా ఆదివాసీల హక్కులు కాపాడబడతాయనేది ఆచరణలో సాధ్యం కాదనే విషయం గతంలో రుజువు చేయబడింది. ఇప్పటికీ ఆదివాసీ ప్రాంతంలో నిర్వహిస్తున్న గ్రామసభల్లో అధికార్ల పెత్తనం నడుస్తున్నది తప్ప గ్రామ సభ ప్రతినిధుల అభిప్రాయాలను క్రోడీకరించి గ్రామసభ నిర్ణయంగా ప్రజల్లోకి తీసుకువెళ్ళడమనే ప్రక్రియ దాదాపు ఆచరణలో అమల్లో లేదు. అధికార్ల నియంతృత్వమే ఉంది. అయినా ప్రభుత్వం ఈ ప్రతిపాదన చేయడం ఆదివాసుల పట్ల వివక్ష చూపడమే. ఇది కచ్చితంగా నియంతృత్వానికే దారితీస్తుంది. వన్యప్రాణుల సంరక్షణ, పర్యావరణ పరిరక్షణ, అడవుల సంరక్షణ వంటి అంశాల మీద గ్రామసభకు గల బాధ్యతను నిర్వహిస్తున్న క్రమంలో శాసనసభలు అడ్డుపడకుండా ఉంటాయా అనే విషయంలో ఈ బిల్లు ఒక సందిగ్ధతనే మిగిల్చింది.

అదే విధంగా రిజర్వ్ అడవులు, రక్షిత అడవులు, జాతీయ పార్కులు వంటి అంశాల మీద గతంలో లాగ ప్రభుత్వ అధికార గణానికే పెత్తనం ఉంటుందా? లేదా గ్రామ సభకు సదరు అధికారాలను బదలాయించడం జరుగుతుందా? అనే విషయాల పట్ల ఈ బిల్లు అస్పష్టతనే కలిగి ఉంది. ఈ అంశాల మీద గ్రామసభకు అధికారాలు ఇవ్వడం లేదా ఇవ్వకపోవడం అనే దాని మీదనే ఆదివాసీల అటవీ హక్కుల నిజస్వరూపం తేలుతుంది. దీని మీద ప్రభుత్వం ఒక స్పష్టమైన వైఖరిని ప్రకటించవలసిన అవసరం ఉంది.

అభివృద్ధి పేరిట ఆదివాసీ ప్రాంతాల్లో నిర్మించబడుతున్న భారీ ప్రాజెక్టులు, డ్యాంలు, గనుల తవ్వకాలు, జాతీయ పార్కుల వల్ల నేటికి సుమారు పది లక్షల ఆదివాసులు నిర్వాసితులైనారు. వారికి తగిన ప్రత్యామ్నాయ సదుపాయాలు కానీ, నష్టపరిహారం కానీ, పునరావాస సౌలభ్యం కానీ కల్పించబడడం లేదు. ఆదివాసులకు కనీసం ముందుగా సమాచారం ఇవ్వకుండానే బలవంతంగా తరిమివేయడం జరుగుతోంది.

ఈ బిల్లు మన రాజ్యాంగాన్ని అసలే లెక్కచేయలేదు. జీవికకూ, స్వేచ్ఛకూ ఉన్న ప్రాథమిక హక్కులను అది బహిరంగంగా కాలరాచి వేసింది. ధనవంతుల ఆస్తి హక్కును పరిరక్షించడానికి నిరంతరమూ శ్రద్ధగా ఉండే ప్రభుత్వ ఆదివాసుల స్వంత స్థలాలను నష్టపరిహారం ఇచ్చే సూచనైనా లేకుండా స్వాధీనం చేసుకోవడానికి, నిర్వహణ చేపట్టడానికి అధికారాలు సంతరించుకుంటోంది. రాజ్యాంగపు ఆదేశిక సూత్రాల్లో పొందుపరచబడిన పనిచేసే హక్కు, కావాల్సిన బతుకు దెరువును సంపాదించుకునే హక్కు, పరిసరాల పరిరక్షణనూ, కార్యనిర్వహణ విభాగం నుంచి న్యాయ విభాగం ఏర్పాటునూ ఈ బిల్లు కాలరాస్తోంది. కిందిస్థాయి (గ్రామసభల) సంస్థల స్వతంత్ర ప్రతిపత్తినీ, అధికారాన్ని తృణీకరిస్తోంది.

ఐతే ఈ బిల్లు ప్రధానంగా ఎక్కుపెట్టబడ్డది ఆదివాసుల మీద, ఇతర అడవివాసుల మీదనే. వాళ్ల సాంప్రదాయిక, సామూహిక, ప్రజాస్వామిక హక్కులను ప్రభుత్వం ఒక్క కలం పోటుతో రద్దు చేస్తోంది. అంతేగాకుండా ఇప్పటి వరకు అమలులో ఉన్న అటవీ చట్టాల వల్ల ఉత్పన్నమవుతున్న అపరిష్కృత సమస్యలకు, వైరుధ్యాలకు సరైన పరిష్కార మార్గాలు అన్వేషించకుండానే ఆదివాసులకు అడవిపై హక్కులు కల్పిస్తున్నామని చెప్పడం విడ్డూరమే అవుతుంది.

భారతదేశం అడవుల్లో నివసించే ఆదివాసుల ఏకైక జీవిత వనరు అడవులే. అవే వారి బ్రతుకుదెరువు. చేపల్ని నీటి నుంచి వేరు చేస్తే బ్రతకలేవు. ఆదివాసులకు ఆహారాన్ని, ఆశ్రయాన్ని ఇచ్చేవి అడవులే. శతాబ్దాలుగా వాళ్లు అడవుల్ని వాడుకునే స్వేచ్ఛను, జంతువుల్ని వేటాడే స్వేచ్ఛను అనుభవించడం వాళ్ల సాంస్కృతిక జీవితాన్ని అతి దగ్గరగా పరిశీలిస్తే తప్ప అడవితో వాళ్లు పెనవేసుకున్న జీవితానుబంధం ఎంత బలీయమైందో అర్థం కాదు.

**పెసా చట్టం ఏం చెబుతుంది?**

షెడ్యూల్డ్ ప్రాంత పంచాయతీరాజ్ విస్తరణ 1996 చట్టం ఆదివాసులకు స్వయం పాలనాధికారం, ఉమ్మడి వనరులను కాపాడుకునే అధికారం గ్రామసభలకు ఉంటుందని స్పష్టం చేసింది. షెడ్యూల్డ్ ప్రాంతంలో గల భూమి అటవీ, నీరు, సహజ వనరులపై పూర్తి అధికారం గ్రామ సభలకు ఉండాలనీ కేంద్ర ప్రభుత్వం నియమించిన దిలీప్‌సింగ్ భూరియా కమిటీ సిఫార్సు చేసింది. ఈ చట్టం ప్రకారం షెడ్యూల్డ్ ప్రాంతంలో వనరులపై అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి లేదు. స్థానిక పంచాయితీలకు గ్రామసభలకే ఉంటుంది. ఈ చట్టం షెడ్యూల్డ్ ప్రాంతాలలో శాంతి, మంచి పాలన కొరకు గవర్నర్‌కి విస్తృత అధికారాలను కట్టబెట్టింది. అసెంబ్లీ, పార్లమెంటు జారీచేసిన చట్టాలను పక్కనపెట్టి ప్రత్యేక ఆదేశాలు ఇచ్చే అధికారం గవర్నర్‌కు ఉంది. గవర్నర్ తనకున్న ప్రత్యేక అధికారాలతో ఆదివాసుల సాంప్రదాయక, సామూహిక ప్రజాస్వామిక హక్కులనూ భంగపరిచే విధంగా రూపొందుతున్న 2005 ముసాయిదా బిల్లును అడ్డుకోవాల్సిన బాధ్యత ఉంది. పెసా చట్టంలో కూడ శాంతి సత్పరిపాలన అనేది ఏ దిశగా ఉండాలో రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొనలేదు. అయినా రాజ్యాంగంలో పేర్కొన్న ఉద్దేశ్యాలు ఆదివాసీల సామాజిక, ఆర్థిక పురోగాభివృద్ధి ప్రాతిపదికగా తీసుకోవాల్సిన అవసరం ఉంది.

చట్టాలు తయారు చేసిన మేధావులంతా ముందే ఇటువంటి పరిస్థితి ఆదివాసులకు కలుగుతుందని ఊహించారేమో. ఆదివాసులకు నష్టం జరిగే ఏ పనినైనా అడ్డుకునే అధికారాలను చట్టాల్లోను కలుగజేశారు. ఆదివాసీల ప్రత్యేక చట్టమైన 1 ఆఫ్ 70 చట్టాన్ని సవరించే ప్రతిపాదన అధికారుల్లో, ప్రభుత్వాల్లో ఉండటం విచారకరం. ప్రస్తుతం తీసుకువస్తున్న 2005 ముసాయిదా బిల్లు 1 ఆఫ్ 70 చట్టంలో పేర్కొన్న అంశాలకు మధ్య తీవ్రమైన వైరుధ్యం ఉంది. 2005 ముసాయిదా బిల్లు

# సామ్రాజ్యవాద కుట్ర గురించి సాధికారిక కథనం

ఎన్. వేణుగోపాల్

[జాన్ పెర్కిన్స్ రచన కన్ఫెషన్స్ ఆఫ్ యాన్ ఎకనమిక్ హిట్‌మాన్ తెలుగు అనువాదం ఒక దళారీ పశ్చాత్తాపం (అను: కొణతం దిలీప్) ముందుమాట]

ఈ పదిహేనేళ్లలో ప్రపంచీకరణ మీద తెలుగు సమాజ సాహిత్యాలు ఎక్కువగానే స్పందించాయి. బహుళజాతి సంస్థల వ్యూహాల వెనుక ఉన్న రాజకీయార్థిక ప్రయోజనాల గురించి, ఆ వ్యూహాల ఫలితంగా పేద దేశాల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక జీవనంలో వచ్చిన, రానున్న ప్రభావాల గురించి తెలుగులో వందలాదిగా వ్యాసాలు వచ్చాయి. డజన్ల కొద్దీ పుస్తకాలు వచ్చాయి. కనీసం రెండు డజన్ల మంది రచయితలు విశ్లేషణలు వెలువరించారు. రాష్ట్రవ్యాప్తంగా ప్రసంగించారు. కవులు, కథా రచయితలు, నవలా రచయితలు కూడ ఈ విశ్లేషణను అందుకుని కళారూపం ఇచ్చారు.

నా వరకు నేను ప్రపంచీకరణ మీద, నూతన ఆర్థిక విధానాల మీద నా మొదటి వ్యాసం 1991 జులై 12న రాశాను. ఈ పదిహేను సంవత్సరాలలో ఈ అంశాల మీదనే రెండు మూడు పుస్తకాలు, కనీసం మూడు వందల వ్యాసాలు రాసి ఉంటాను. కనీసం ఐదారు వందల చోట్ల ఉపన్యసించి ఉంటాను.

పుస్తక పరిచయం

అయినా ఇప్పటికీ ప్రపంచీకరణ మీద చెప్పవలసిన విషయాలు మిగిలే ఉన్నాయనిపిస్తుంది. ఎన్నో ముఖ్యమైన ఖాళీలున్నాయనిపిస్తుంది. ఆ ఖాళీలలో ప్రధానమైనది ప్రపంచీకరణ వెనుక ఉన్న కుట్రను విశ్వసనీయంగా, సోదాహరణంగా వివరించలేకపోవడం. "మూడు శతాబ్దాల వలసవాద కుట్రను, ఐదు దశాబ్దాల బహుళజాతి సంస్థల కుట్రను, దానికి సహకరించిన మన దళారీ పాలకుల భాగోతాన్ని ఇంకా విప్పి చెప్పవలసిందెంతో ఉంది" అని 1999లో 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' ముందుమాటలో రాశాను. అంతకు ముందూ, ఆ తర్వాత కూడ నేనీ మాట అన్నప్పుడల్లా నేను గౌరవించే ఇద్దరు అర్థశాస్త్రవేత్తల వ్యాఖ్యలు నాకు గుర్తొస్తుంటాయి. వారిలో ఒకరు మాజీ మార్క్సిస్టు, ప్రస్తుతం ఉదారవాది. 'మీరు వివరించలేని దానికల్లా ఒక కుట్ర సిద్ధాంతం కనిపెడతారు' అని ఆయననేవారు. మరొకరు ఇప్పటికీ మార్క్సిస్టే. 'మీరు చెప్పేదంతా ఐడియలాజికల్ (భావజాలంతో ప్రేరేపితమైనది), వాస్తవం కాదు. గట్టి ఆధారాలతోనే అటువంటి విమర్శలు చేయాలి' అని ఆయనంటారు.

భారత దేశానికీ, లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియాలలోని అనేక దేశాలకూ చెందిన రాజకీయార్థిక చరిత్రలలో సామ్రాజ్యవాద కుట్రల ఆధారాలు దొరుకుతున్నా, ప్రపంచీకరణ యుగంలో ఎన్నో పత్రికా వార్తలు, విశ్లేషణలు ఆ కుట్రలను బయటపెడుతున్నా, కుట్ర గురించి మాట్లాడడానికి కొంత సంకోచమే ఉండేది.

ఆ సంకోచం నుంచి కొంత ఉపశమనం ఇచ్చింది వాస్కోడగామా భారతదేశంలో ప్రవేశించిన చరిత్ర. అది ఒక స్పష్టమైన ప్రయోజనం కోసం, నిర్దిష్టమైన లక్ష్యంతో జరిగిన కుట్రపూరిత ప్రయాణం.

మూడు ఓడలతో, నూటయాభై మంది నావికులతో వాస్కోడగామా కేరళ తీరంలోని కోళిక్కోడు (యూరపియన్ స్వరంలో వాస్కోడగామా దాన్ని కాలికట్ అన్నాడు. ఇప్పటికీ దాన్నట్లాగే పిలవాలని మనం అనుకుంటాం!)కు ఎనిమిది మైళ్ల ఉత్తరాన భూమిని తాకాడు. అది 1498 మే 17. ఆ మలబార్ తీరంలో తనను కలిసిన మొట్టమొదటి మనుషులతో ఆయన తాను "క్రైస్తవులనూ, సుగంధ ద్రవ్యాలనూ వెతుకుతూ" వచ్చానన్నాడు.

ఈ రెండు లక్ష్యాలలోనూ అబద్ధం ఉంది, కుట్ర ఉంది, ద్వేషం ఉంది, స్వార్థ ప్రయోజనాలున్నాయి.

వాస్కోడగామా "రక్షించదలచిన" క్రైస్తవులు ముస్లింల చక్రబంధంలో చిక్కుకుపోయారని, వాళ్లను కాపాడి, తన క్రూసేడ్లలో క్రైస్తవేతరులను, ముఖ్యంగా ముస్లింలను ఊచకోత కోసిన మత

---

సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల పారిశ్రామిక వ్యాపార అవసరాలకు ముడి పదార్థాలను తరలించే అవకాశం కల్పిస్తున్నారు. ఇదే సమయంలో 1 ఆఫ్ 70 చట్టం ఆదివాసీ ప్రాంతంలో ఉన్న సహజ వనరులపై పూర్తి అధికారాన్ని కల్పించింది. అడవిలోని సహజ వనరులను వెలికి తీయడంలో ప్రభుత్వాన్ని కూడ ప్రైవేట్ వ్యక్తిగానే పరిగణించాలనేది స్పష్టంగా న్యాయస్థానాలు పేర్కొంటున్నాయి. ఇన్ని అస్పష్టమైన అంశాలతో కూడుకొని ఉన్న 2005 ముసాయిదా బిల్లు వెనకాల కచ్చితంగా సామ్రాజ్యవాదుల ప్రమేయం ఉంది. భూబదలాయింపు, క్రమబద్ధీకరణ (ఎల్టీఆర్) 1/70 చట్టం ఆదివాసుల రక్షణకే అనే సంగతి పాలకవర్గ పెద్దలు మరచిపోతే ఎలా? తూర్పు కనుమ ఆదివాసుల కొండలు, భూమి క్షేమంగా ఉండాలని కదా ఒకప్పటి చట్టంలో రాసింది చెబుతున్నారు. ఐదవ షెడ్యూల్డ్ ప్రకారం ఆదివాసుల భూములు, ఇతర దోపిడీలకు దూరంగా ఆదివాసులను సంరక్షించడం అందరి బాధ్యత. ❑

యుద్ధాలు) భాగం చేసుకోవాలని అనుకున్నాడట. ఇంతకూ ఆ నాటి మలబార్ తీరంలో ఆయన ఊహించినట్టుగా "ముస్లింల చక్రబంధంలో చిక్కుకున్న క్రైస్తవులు" లేరు. అప్పటికి మలబార్ తీరంలో కొందరు క్రైస్తవులున్నారు గాని వాళ్లకూ ముస్లింలకూ ఘర్షణలేమీ లేవు.

అంటే వాస్కోడగామా మొట్టమొదటి లక్ష్యం అబద్ధం మీద, ముస్లింల పట్ల విద్వేషం మీద ఆధారపడింది. సరిగ్గా ఇవాళ ప్రపంచీకరణ సమర్థకులందరూ కూడ మళ్లీ ఒక అబద్ధం మీద, ఒక విద్వేషం మీద ఆధారపడి ప్రపంచం మీద ఉక్కుపాదం మోపుతున్నారు. మూడో ప్రపంచదేశాల ఆర్థికవ్యవస్థలు సంక్షోభంలో పడ్డాయని, తాము వాటిని రక్షించడానికే వస్తున్నామనేది ఆ అబద్ధం. మూడో ప్రపంచదేశాల ప్రజల అభివృద్ధికి కోట్ల డాలర్ల పెట్టుబడులు అవసరమయ్యే విమానాశ్రయాలు, ఓడరేవులు, ఆనకట్టలు, రహదారులు, బహుళ అంతస్తుల భవనాలు, గోల్ఫ్ కోర్సులు, వగైరా అవసరమని, ఆ పెట్టుబడులు తాము పెట్టడానికి మార్గం సుగమం చెయ్యాలనేది ఆ అబద్ధం.

ఇవాళ ప్రపంచాన్ని నడుపుతున్న చమురు నిల్వల మీద ఆవాసాలున్నందుకు అటు వెనిజులా మీద, ఇటు నైజీరియా మీద, వాటికన్న ఎక్కువగా పశ్చిమాసియా ముస్లింల మీద విద్వేషాన్ని రెచ్చగొట్టడం, ప్రపంచానికి మరొక ప్రత్యామ్నాయ, సమానత్వ మార్గాన్ని చూపిస్తున్నందుకు కమ్యూనిస్టుల మీద విద్వేషాన్ని రెచ్చగొట్టడం ప్రపంచీకరణ లక్ష్యం.

వాస్కోడగామాతో వచ్చిన పోర్చుగీసు వలసవాదం మలబార్ తీరం మీది హిందూ, ముస్లిం పాలకుల మధ్య చిచ్చుపెట్టి ఇరుపక్షాల్నీ ఓడించి లొంగదీసుకుంది. ఆ రాజ్యాల నౌకాశక్తిలోని బలహీనతల్ని గుర్తించి వినియోగించుకుంది. ఏడు సంవత్సరాలు తిరగకుండానే పోర్చుగీసు రాజు భారత భూభాగం మీదికి తన వైస్రాయ్‌ని పంపాడు. అప్పటి నుంచీ ఇవాళ్టి దాకా వలసవాద, సామ్రాజ్యవాద ప్రతినిధులే మన రాజకీయార్థిక విధానాలను నిర్ణయిస్తున్నారు. వాళ్ల పేర్లు వైస్రాయ్, గవర్నర్ జనరల్, ఏజెంట్, అంతర్జాతీయ ద్రవ్య సంస్థ, కన్సల్టెంట్, వగైరాగా మారి ఉండవచ్చు. వాళ్ల జెండాలు మారి ఉండవచ్చు. వాళ్ల కేంద్ర కార్యాలయాలు మారి ఉండవచ్చు. అది ఒకప్పుడు ప్రత్యక్షంగా, మరొకప్పుడు నల్లతోలే ఉన్న దళారీల ద్వారా జరిగి ఉండవచ్చు. అంతిమ సారాంశంలో ఈ ప్రజల మీద దోపిడీ పీడనలకు భూస్వాములకూ రాజులకూ తోడుగా సామ్రాజ్యవాదం తరలి వచ్చిందన్నది నిజం.

ఆ క్రమంలో వాస్కోడగామా రెండో లక్ష్యాన్నీ గమనంలో ఉంచుకోవాలి. ఆ నాటికి యూరప్‌తో పోలిస్తే ముడిసరుకులలో గాని, పరిశ్రమలలో గాని, వ్యవసాయోత్పత్తులలో - ముఖ్యంగా సుగంధ ద్రవ్యాలలో గాని అగ్రభాగాన ఉన్న దేశాలలో భారతదేశం ఒకటి. అప్పటికి సుగంధ ద్రవ్యాల వ్యాపారంలో పైచేయిగా ఉన్న అరేబియన్ వర్తకులను ఓడించి ఆ వ్యాపారాన్ని తమ చేతుల్లోకి తీసుకోవాలన్న యూరపియన్ ఆకాంక్షకు, పోర్చుగీసు ప్రయత్నానికి చిహ్నం వాస్కోడగామా యాత్ర.

ఇవాళ్టికీ మూడో ప్రపంచ దేశాలే వ్యవసాయోత్పత్తులకూ, ఖనిజ వనరులకూ, ముడిసరుకులకూ గొప్ప వనరు. అట్లాగే సామ్రాజ్యవాద పారిశ్రామిక, సేవా రంగాలకు అవసరమైన, వారి దగ్గర లేని గొప్ప మానవ వనరులు మూడో ప్రపంచ దేశాలలోనే ఉన్నాయి. అంతకన్న ముఖ్యంగా వ్యవసాయోత్పత్తులలో వారి మారు బేరానికి, పారిశ్రామిక, సేవా ఉత్పత్తులకు అసంఖ్యాక జన బాహుళ్య మార్కెట్ ఈ మూడో ప్రపంచ దేశాలలోనే ఉంది.

అంటే వాస్కోడగామా లక్ష్యం ఈ ఐదు వందల ఏళ్లలో పరిమాణాత్మకంగానూ, గుణాత్మకంగానూ విస్తరించిందన్నమాట. పైగా ఇప్పుడు ప్రపంచం ఒక కుగ్రామం అయిపోయిందనీ, మార్కెట్లు అనుసంధానించబడుతున్నాయనీ, సమాచార, సాంకేతిక విప్లవం మనుషులనూ, మార్కెట్లనూ ఏకం చేస్తున్నదనీ ఎన్ని కోతలయినా కోయగల హైటెక్ వాచాలత్వం సామ్రాజ్యవాదులకూ దాని దళారీలకూ అబ్బింది.

ఇవాళ దళారీలు వాస్కోడగామాల వంటి సముద్ర ప్రయాణ సాహసికులు మాత్రమే కాదు. జాన్ పెర్కిన్స్ వంటి అత్యాధునిక విజ్ఞాన, వాక్చాతుర్య నిధులు. పేద దేశాల నాయకులతో మంతనాలాడి, వారిని బురిడీ కొట్టించి, వారిని కొనివేసి, వారి దేశాలను ఆక్రమించగల అధర్మయుద్ధ వీరులు.

అటువంటి అధర్మ యుద్ధాల గురించి ఊహిస్తూ, ఆరోపిస్తూ, ఫలితాల ద్వారా పరిణామాల్ని విశ్లేషిస్తున్న మా లాంటి వారికి జాన్ పెర్కిన్స్ అటువైపు కథనాన్ని తన స్వానుభవం నుంచి వివరిస్తున్నాడు. ఇందులో పశ్చాత్తాపం ఉందా, ఇది కూడ ఒక ఎత్తుగడేనా, ఇన్నాళ్లూ ఎన్నో అక్రమాలు చేసి ఇప్పుడీ గంగలో మునిగితే సరిపోతుందా అని ఎన్నో ప్రశ్నలు వేయవచ్చును గాని ఇది సామ్రాజ్యవాద కుట్ర గురించి సాధికారిక కథనం. అనేకానేక సామాజిక రాజకీయ కారణాల వల్ల ఈ పుస్తకం తెలుగు అనువాదం అత్యంత అవశ్యకమైనదవుతోంది. సంపన్నమైన వనరులతో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ 1956 నుంచో, మన అధికారులకు ప్రపంచబ్యాంకు శిక్షణ ఇవ్వడం ప్రారంభించిన 1983 నుంచో, కనీసం పాలకులే స్వయంగా ప్రపంచబ్యాంకు ఆదేశాలను శిరసున పెట్టుకున్న 1995 నుంచో ఎందరెందరు జాన్ పెర్కిన్స్‌లు ప్రవేశించారో, మంతనాలు నడిపారో ఎప్పటికైనా బయట పడుతుందో లేదో తెలియదు. ఆ రహస్యాలు బయట పడేదాకా, ఏమి జరిగి ఉంటుందో ఊహించడానికి మనకు ఈ పుస్తకం అవసరమైన సూచిక.

ఇప్పటికే ఈ పుస్తకం తెలుగులో వెలువడుతుందని తెలిసినప్పటి నుంచీ పాఠకుల నుంచి వస్తున్న ప్రతిస్పందన చూస్తే తెలుగు సమాజానికి ఈ పుస్తకం అవసరం ఎంత ఉందో అర్థమవుతోంది.

ఫ్రమ్ ది హార్సెస్ మౌత్ అని ఇంగ్లీషు నుడికారం చెప్పినట్టు ఇన్నాళ్లూ మనం ఏ సామ్రాజ్యవాద రథ చక్రాలకు కట్టివెయ్యబడ్డామని ఆరోపిస్తున్నామో, ఆ రథాన్ని లాగుతున్న అశ్వాలలో ఒకటి ఇక్కడ మాట్లాడుతోంది. వినండి. ఇది కుట్రనో కాదో తేల్చుకోండి. □

# గీతవృత్తి పరిశీలన

ఆర్. ఎల్. ప్రసాద్

**ఉపోద్ఘాతం - ఉద్దేశ్యం**

భారతీయ సమాజంలో శ్రమ విభజన వల్ల వివిధ వృత్తులు ఏర్పడ్డాయి. ఈ వృత్తులలో గౌడ వృత్తి - గీత పరిశ్రమ ఒకటి. గౌడ వృత్తిని చేసే వారినే ఈ కుల సమాజంలో గౌడ కులంగా వ్యవహరిస్తారు. తరాలుగా సామాజిక సేవలో భాగంగా ఈ కుల వృత్తి మనగలిగింది.

వ్యవసాయ రంగం మీద ఆధారపడిన మన దేశంలో గీత వృత్తి వ్యవసాయానికి అనుబంధంగా ఎదుగుతూ వచ్చింది. ప్రకృతిలోని ఈత, తాటి, కర్జూర వనాల నుండి గీత పనికాడు తన పనితనాన్ని చూపి ఆరోగ్యప్రదమైన చెట్ల రసాన్ని తీస్తాడు.

మెదక్ జిల్లా పరిధిలోని గౌడవృత్తి వారి పరిస్థితులను పరిశీలించి, సమగ్రంగా చర్చించడం, తగు సూచనలివ్వడం ఈ వ్యాసం ప్రధానోద్దేశం. అందు కొరకు గౌడ వృత్తిపై దత్తాంశ సేకరణ (సమాచార), క్షేత్ర పర్యటన ప్రధాన దృష్టి కోణాలుగా ఎంచుకొన్నాం.

**జిల్లా ఎల్లలు:**

భౌగోళికంగా మెదక్ జిల్లా నలుమూలల్లో కొండలు, గుట్టలు, అడవులు, పర్వత శ్రేణులు, వాగులు, వంకలు, చెరువులు, కుంటలు, బావులు, నదులుండడం వలన ఉత్తర దక్షిణ భాగాలలో పర్వత శ్రేణుల నుండి వర్షపు జాలు గుట్టలపై నుండి కిందికి పారుతుండడంతో, ఇందులో సమశీతోష్ణ పరిస్థితుల వలన ఈత వనం మిక్కిలిగా ఉండగలిగింది.

జిల్లాకు ఉత్తరాన కరీంనగర్ వైపు తాటివనం ఎక్కువగా సిద్దిపేట, దుబ్బాక, రామాయంపేట ప్రాంతంలో ఉంది. ఇక్కడ భూగర్భ నీటి వనరులు చాలా లోతుగా ఉంటాయి. ఈ ప్రాంతాలలో నేల స్వభావం రాళ్లతో కూడుకొని ఉంది. ప్రభుత్వం ఈ ప్రాంతాలను డార్క్ ఏరియా అని గుర్తిస్తుంది. తాటి ఎంత ఎత్తుకెదిగితే అంత భూమి లోతుల్లోకి చెట్టు మొదలు పోతుంది.

తేమగల ప్రాంతాలైన మెదక్ నుండి పడమట ఈత వనం ఎక్కువగా విస్తరించింది. దక్షిణాన నర్సాపూర్ ఈత వనమే అధికంగా ఉంది. గజ్వేల్ ప్రాంతంలో ఈత తాటి వనాల మిశ్రమ ప్రాంతంగా కనపడుతుంది. ఇక్కడి ఈ తాటి ఈత వనాల మీద ఆధారపడి జిల్లాలో 12% గౌడ కులస్తులున్నారు.

**చెట్ల రకాలు:**

జిల్లాలో అత్యధిక ప్రాంతాల్లో ఈత చెట్లు ఉన్నాయి. ఈత వనం వాగు వంకల దగ్గర, గుట్ట నీటి జాలు దగ్గర, చెరువు కుంటల దగ్గర ఈత చెట్ల వ్యాప్తి ఎక్కువగా పక్షుల ద్వారా జరుగుతుంది. వర్షాభావ పరిస్థితులవల్ల చెట్ల తరుగుదల మొదలైంది. గతంలో వర్షాలున్న దగ్గర బలమైన ఈదులు ఉండేవి. వీటిని జన్నీదులని పిలిచేవారు. కల్లుగీత వృత్తిలో ఈత చెట్లకే ప్రాధాన్యమిచ్చి పెంచడానికి కారణమేమంటే అవి తొందరగా పెరుగుతాయి. కల్లు త్వరగా వస్తుంది.

తాటి వనంకు ఈత చెట్ల కిచ్చినంత ప్రాధాన్యం ఉండదు. దీని పెరుగుదలకు చాలా సమయం పడుతుంది. తాటిలో సొనగాయ చెట్టు అంటే అది మగ చెట్టని అర్థం చేసుకోవాలి. చెట్టుకు రాలకాయ వలె కొల వస్తుంది. పొడుగ్గా మునగకాయ మాదిరి వేలాడుతుంది. ఈ కాయ ప్రయోజనం ఏముండదు. మగ చెట్టును పోత్తాడు అని పిలుస్తారు. ముంజలు కాసే దాన్ని పర్తాడు అంటారు. తాటి ముంజ వచ్చినపుడే కల్లు వస్తుంది.

తాటి వేళ్లు సన్నగా ఉండి లోతులోకి వెళతాయి. భూమిలో పదును లేకపోతే తాటి చెట్టు చెడుతుంది. భూగర్భ జలాలు ఇంకి పోవడం వల్ల చెట్లకు నష్టం కలుగుతుంది. ఒకప్పుడు తాటివనం బాగా ఉండేది. ఇపుడు తగ్గుతున్నాయి. ప్రభుత్వ లెక్కల ఆధారంగా ఈత చెట్లు 4,08,718; తాటి చెట్లు 24,059 ఉన్నాయి.

**జీవనదృశ్యం**

కర్జూరపు చెట్లు ఈ జిల్లాలో లేవని చెప్పవచ్చు. ఎక్కడైనా ఈ చెట్లు మొలకెత్తితే చెట్టు పూతరావడంతో అది రాలిపోయి చెట్టు నశించిపోతుంది. సంగారెడ్డిలో ఫల పరిశోధన ఉన్నప్పటికీ ఈ చెట్ల ఉనికి కోసం తగు పరిశోధనలు జరుగకపోవడం వల్ల ఈ నేలకు అనుగుణంగా చెట్ల పెంపకం జరగలేదు.

**గీత పనితనం - పనిముట్లు**

గీత పనితనమంటే చెట్లను గీయడానికి పనిముట్లు సమకూర్చుకోవడం, చెట్టు పైకెక్కడానికి తగు జాగ్రత్తలు తీసుకోవడం కల్లు వడుపుకు రావడం (పై నుంచి కిందికి). చెట్టు పైకెక్కి కల్లు వడుపుకొని రావడం సాహసంతో కూడిన పని. ఈ పనితనానికి ఉలి, లొట్టు, చౌటులి, బుర్ర, కర్ర, బెల్టు మోకు ముస్తాదు, టబ్, పెట్టెలు, సీసాలు ఈ ఉపయోగికాలుంటాయి.

చెట్టు గీచే పనిముట్లు ఉలి, మోకు ఆధారంతో చెట్టు పైకెక్కి చెట్టు శిఖరం దగ్గర సాపు చేసి కమ్మల కింద సువ్వగానున్న ఉలితో సున్నితమైన పొర తొలిచి, నీర వచ్చేదారిని చేసి కల్లు లొట్టి కడుతారు. ఈత చెట్లయితే చిన్న గుంటలు కనుక ఉడుతలాగే ఎగబాకాల్సి ఉంటుంది.

మంచి అనుభవజ్ఞుడు ఈత చెట్లయితే రోజు 30 వరకు గీస్తాడు. సాధారణంగా ఉదయం పూటనే గీస్తారు. చలి, వర్షాకాలాల్లోనైతే ఉదయం 11 గంటల వరకు గీస్తుంటారు. కొందరు సాయంత్రం వేళ గీచి ఉదయాన్నే కల్లు ఒంపుతారు.

## పనిముట్లు

ఈత, తాటి చెట్ల రసాన్ని తీయడానికి, గీత కార్మికులు వాడే పనిముట్ల వివరాలు

- ఉలి: ఇనుప ముక్కను పదును పెట్టి ఉలిగా తయారు చేసి, ఉలి కొన సువ్వగా మారడానికి కోలపై (కర్ర) పలుగురాయి వేసి రాస్తే రాయిపొడి కాటుకలా అవుతుంది.
- మోకు: ఈతబద్దలు సాపు చేసి గుండ్రంగా మలిచి దీని చుట్టు ప్లాస్టిక్ వైరు చుడతారు. ఇది ఎండిపోకుండా నీళ్ల తడి ఉంచుతారు. దీనినే మోకు అని పిలుస్తారు. ఈ మోకు నడుముకు చెట్టుకు కట్టుకొని ఎక్కుతారు.
- బంధం: ఈత బద్దలతో రింగ్‌లా చేసి వైర్ చుట్టి చెట్టు ఎక్కేపుడు రెండు కాళ్లకు (విడి పోకుండా) తగిలించుకొంటారు.
- బెల్టు మోస్తాకు: బెల్టును (తోలుది) నడుముకు పెట్టుకొని దానికి ఉలి తగిలించి, మోకాళ్ల వరకు తోలు కట్టుకొని వీటి ఆధారంతో చెట్టు పైకెక్కి గీత గీసి కల్లు లొట్టి కట్టి వస్తారు.
- తిత్తి: తోలు తిత్తి తయారు చేసి దానిలో కల్లు పోసి తరలిస్తారు. దీనినే పకాలు అని కూడా అంటారు.
- మాండ్వా: ఈత, తాటి చెట్ల రసాన్ని చెట్లపై నుండి ఒంపుకొని వచ్చి ఒకచోట కుండలో పోయడమే దాన్ని మాండ్వా అంటుంటారు.
- మాల్ గుజార్: ప్రతిసారి ఈదుల్లు, తాళ్ల లెక్కించి అబ్కారికి పన్ను కడుతుంటారు. ఇదే మాల్ గుజారంటారు.
- అక్కెమాల: పట్టా భూముల్లో ఉన్న చెట్లకు పన్ను రూపంలో అక్కెమాల పట్టాదారుకు చెల్లిస్తారు.
- టబ్: టేకు కట్టెతో కల్లు తయారీకవసరమైన టబ్ చేయిస్తారు.
- లొట్లు: మట్టితోనున్న లొట్లనే చెట్లకు కడుతారు.

క్రిమికీటకాల బారిన పడకుండా జాగ్రత్త పడుతారు. చెట్ల రసాన్ని కుండల్లో పోసుకొని ఊరు దగ్గరైతే నెత్తి మీద మోసుకెళతారు. లేదంటే కల్లు తిత్తిలో నింపి ఎడ్లబండ్ల ద్వారా తరలిస్తారు.

**కల్లు - ఔషధ గుణాలు**

కల్లు తయారీకి టేకు కలపతో కూడిన టబ్‌ను టాకీని అవసరమైన సైజు పెట్టుకొని కల్లు చేసి సీసాలు నింపి పెట్టెల ద్వారా దుకాణాలకు సరఫరా చేస్తారు. కల్లులో చిక్కదనం రావడానికి కఫ్ పౌడర్ కలుపుతారు. నిషా రావాలని కూడా కలుపుతుంటారు. కల్లును చెట్ల రసాన్ని తోలు తిత్తిలో పోసి పంపితే సూర్యరశ్మి యొక్క రసాయనిక చర్య ఉండదు. కల్లులో కుంకుడుకాయ రసం కలిపితే మైల తొలిగి క్రిమి సంహారం చేస్తుంది. ఈ కల్లు మాముల చేసే వారిని ముస్తాదార్ అంటారు.

పురాణాలలోని పేర్లతో చెట్లను రామన్న, భీమన్న, వెంకన్న తదితర వాటితో గీత కార్మికులు పిలుస్తారు. ఇతిహాసాలలో దీనికి ప్రాధాన్యత సంతరించుకొంది. ఈ చెట్లరసం దినమంత కష్టం చేసే వారికి అలసట పోగొట్టే ఔషధంగా పని చేస్తుంది. 'నీర' అనేది మంచి బలవర్ధకమైంది. మల, మూత్ర బద్ధకాన్ని తొలిగిస్తుందని చెపుతుంటారు. నేటికి ఒకే చెట్టు నీర తాగే వారు కూడా ఉన్నారు. ఈదుల్లకు పోయి తాగొచ్చేవారు, నిఖార్సయినది దొరుకుతదని వచ్చేవారున్నారు. కల్లుకు ఔషధ గుణాలున్నాయనే అభిప్రాయం వాడుకలో ఉంది. ఆయుర్వేద మందులలో కూడా ఈత రసాన్ని అనుపానంగా వాడుతారు.

పోషక విలువల కోసం ఇలాచి, చెక్క, సోపు, సాబుదాన, మినపప్పు నానబెట్టి రుబ్బి కల్లులో పోస్తే అది ఎంతో శక్తినిస్తుందంటారు. కల్లు కల్తీదా మంచిదా అనే పరీక్ష కోసం మోదుగు ఆకును కల్లులో వేస్తే ఆకు రంగు మారక పోతే మంచిదని పరిగణిస్తారు.

పండుగలపుడు, జాతరలపుడు, కార్యాలపుడు కల్లు వాడకం ఎక్కువగా ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఇది ప్రజల సుఖదుఃఖాలలో భాగమైందని చెప్పవచ్చు. ఈత చెట్లకయితే ఒక్కొక్క చోట చెట్టుకు రెండేసి రేవులు పెట్టి కల్లు ఎక్కువగా పడేటట్లు గీస్తారు. ఒకే చెట్టుకు రెండు స్థానాల నుండి కల్లు వచ్చేట్లు గీత గీయడమే రెండేసి రేవులంటారు. ఇది చాలా సూక్ష్మమైన పనితనం. పని రానివారు గీస్తే మొత్తం చెట్టే పనికిరాదు.

**గీత పరిశ్రమ - ఉత్పత్తి విధానం**

అటవీ సంపద నుండి, భూముల నుండి సర్కార్ తమ రాబడి కోసం పన్ను వసూలు చేస్తుంటుంది. నైజాం కాలం నుండి భూములను జాగీర్‌లకీయడం, అడవులనీయడం వల్ల వచ్చే ఆదాయాలు సర్కారుకు సమకూరుతాయి. పంట భూముల అభివృద్ధికి, ఉత్పత్తులు పెంచడానికి ప్రభుత్వం పూనుకున్నంతగా గీత పరిశ్రమపై దృష్టి పెట్టలేదు. చెట్ల ఎదుగుదల కోసం ప్రభుత్వం చేసిందేమీ లేదు. ఆదాయాలు కావాలి, జీవనోపాధి వద్దు అన్నట్లుంది.

మన రాష్ట్రంలో ఇప్పటికీ నైజాం అబ్కారి చట్టం నడుస్తూ వచ్చింది. మన ప్రాంతంలో అటవీ ఉత్పత్తులు (ఫలసాయాలు) ఏడాది పొడుగున గుత్తాకు ఇచ్చేసి సర్కార్ దానికి పన్ను రూపంలో రాబడి వసూలు చేసింది. తాటి, ఈత చెట్టు ఒక్క దానికి రు.15 చొప్పున వేలం పాటలు పెట్టి వేలం పాడిన గుత్తెదార్ల వద్ద ఆ సొమ్ము మొత్తం తీసుకొనేది. చెట్లను వేలం పాడిన గుత్తెదార్లు గీతకార్మికులను చేరదీసి వారికి జీతాలిచ్చి చెట్లను గీయించేది. ఇలా వచ్చిన కల్లునంతా దుకాణాలకు సరఫరా చేసి వ్యాపారం సాగించేవారు. చెట్టుకు రు.15 ప్రభుత్వానికివ్వగా ఎక్కడైనా చెట్లు పట్టాదార్ భూముల్లో ఉంటే వారికి రు.15 ముట్టజెప్పేవారు. దీన్నీ అక్కెమాలంటారు. నిజాం కాలం నుండి నేటికీ గుత్తెదార్ల కింద గీత కార్మికులు పనిచేస్తున్నారు. గీత గీచే కార్మికులకు వేలంపాడే ఆర్థిక స్థోమత లేక గుత్తేదార్ల కింద పని చేయక తప్పడం లేదు. పేదవారు కొందరు కల్లు దుకాణాల వద్ద బుగడాలు, బజ్జీలు అమ్ముకొని కాలం గడుపుతున్నారు.

**ముఖ్యమంత్రి అంజయ్య హయాం:**

కల్లు వ్యాపారం పట్టణ ప్రాంతంలో గ్రామాల కంటే

ఎక్కువ లాభంలో నడుస్తుంది. పట్టణ ప్రాంత కల్లు కాంట్రాక్ట్ చేజిక్కించుకొనేందుకు కాంట్రాక్టర్ల పోటీ పెరిగింది. గీత కార్మికులు కల్లు ఉత్పత్తి చేసిన కల్లు వ్యాపారంలో నిమిత్తమాత్రులు అయిన స్థితిలో అంజయ్య ప్రభుత్వం రాష్ట్రంలో అధికారం చేపట్టింది. 1980నుండి అంజయ్య ముఖ్యమంత్రి కాగానే గీత కార్మికుల కోసం టిఎఫ్‌టి లైసెన్స్ విధానం ముందుకు తేవడం జరిగింది. టిఎఫ్‌టి దారులకు, గీత సొసైటీదారులకు అవకాశం లభించింది. ఇది గీత కార్మికులకు ఊరట కలిగించింది. టిఎఫ్‌టి లైసెన్స్‌తో కల్లుదుకాణం నడపడం గీతకార్మికులకు సాధ్యమైంది.

ఒక టిఎఫ్‌టి లైసెన్స్‌దారు 30 చెట్లకు పన్నుకట్టడం అలాగే అడ్డా పన్ను (దుకాణంది) అబ్కారికి కట్టి కల్లు అమ్ముకోవడం ఒకింత స్వతంత్రంగా భావించినారు. పట్టాదార్ చెట్టయితే అతనికి చెల్లించేవారు. ప్రతి టిఎఫ్‌టి దారు లైసెన్స్‌ను రెనువల్ చేయించాలి. టిఎఫ్‌టిల ద్వారా, గీత సొసైటీల ద్వారా కల్లు వ్యాపారం సాగిస్తున్నారు. కొద్ది ప్రాంతాల్లో గౌడ కుటుంబాలు ఆర్థికంగా బలపడి, రాజకీయంగా ఎదుగుతూ వస్తున్నారు.

ఈ క్రమాన్ని పరిశీలిస్తే మెదక్ సొసైటీలో 381 మంది సొసైటీ సభ్యులున్నారు. ఇక్కడ 75 శాతం గౌడ కుటుంబాలు గీత వృత్తిపైనే నెలకు రు.2,600 నుండి రు.3,000 దాక జీతం తీసుకొని పనిచేస్తున్నారు. కల్లు వ్యాపారంలో పాలు పంచుకొంటున్నారు. గీతవృత్తి కాకుండా ఇక్కడ 10 శాతం ఇతర ఉద్యోగాలు, 15 శాతం మంది వ్యవసాయంలో కొనసాగుతున్నారు. ప్రతి నెల మెదక్ సొసైటీ సభ్యులకు రు.1,500 లేదా రు.2000 ఇంటింటికి ముట్టజేస్తారు.

**చెట్ల తరుగుదల**

జిల్లాలో ఈతచెట్లు, తాళ్లు ప్రకృతి వరంగా లభించి నాయి. పక్షుల ద్వారా ఈదుల్లు, జంతువులు (ఎలుగుబంట్లు) చవ్వరించి ముంజలు వదిలేసినందులకు తాటి వనం విస్తరించింది. ఇలా పెరిగిన ఈ వనరులను కాపాడడం పోయి తరిగిపోవడానికి మనమే కారణమవుతున్నాం. జాతీయ రహదారులైన 7వ నెంబర్, 9వ నెంబర్ రోడ్ల విస్తరణ జరుగడంతో ఎంతో వనాన్ని కోల్పోవాల్సి వచ్చింది. వలసలు పెరగడం, ప్లాటింగ్ చేయడం, చెట్లు నరకడంతో ఎంతో వనం కళ్ల ముందే కోల్పోయాం.

చెట్ల పెంపకం చేపట్టాలని ఇందుకోసం భూములను కేటాయిస్తామని ప్రభుత్వం చెబుతోంది. కానీ ఇంతవరకు అలా చేయలేకపోయింది. మెదక్ సొసైటీ వనాలు పెంచడం కోసం కొంత భూమిని ఖరీదు చేసి, వాటిలో చెట్ల పెంపకం చేపట్టింది. బోర్లు వేసి చెట్లకు నీరందిస్తోంది. ప్రభుత్వ ప్రోత్సాహం తమకు లేకున్నా ఇది సొసైటీదారులు చేస్తున్న కృషిగా వారు అభిప్రాయపడుతున్నారు.

**వైన్స్, కూల్‌డ్రింక్స్ ప్రభావం:**

చీప్ లిక్కర్, బీరు, బ్రాండి, విస్కీ లాంటి వైన్స్ పట్టణాలు దాటి పల్లెలకు చేరుకున్నాయి. దీని ప్రభావం కల్లు అమ్మకాలపై కొంత పడుతోంది. మద్యం సేవించడంలో అది ఆర్థిక భారంగా ఉండడంతో పల్లెలకు ప్రజలకు అది అందని సరుకైంది. కల్లు సేవించలేని వారు కొందరు చీప్ లిక్కర్‌లతోనే సరిపెట్టుకొంటున్నారు. మల్టినేషనల్ 'మిని' కూల్ డ్రింక్స్ ప్రభావం బాగానే పెరిగింది.

**కల్తీ కల్లు**

కల్లు అనగానే కల్లులో నీళ్లు పోసి సంపాదించినట్లని దెప్పి పొడుస్తుంటారు. మరి ఇపుడు కల్తీ కల్లనగానే అర్థం మారింది. ఏవేవో రసాయనాలు కలుపుతున్నారు. తాగితే కిక్కివ్వడం కోసం మందువేయాల్సి వస్తుందని 'గుల్ ఫారం' లాంటివి కలుపుతుంటారు. కల్తీ జోరు పెరిగి మరణాలు సంభవిస్తున్నాయి. ఇది సేవించే వారు కాళ్లు చేతులు గుంజుతున్నాయని బాధ పడుతుంటారు. కల్లు తాగనిదే నిద్ర పట్టదని కాయకష్టం చేసే వారి పాలిట శాపమైంది. కాంట్రాక్టర్‌లు నడిపే చోట లాభాల వేటలో కల్తీకి పాల్పడుతున్నారు. కాంట్రాక్ట్ నడుస్తున్న చోట విమర్శలున్నవి. కల్తీ సమస్య అరికట్టాలని అబ్కారి చట్టమున్నా దాని ప్రతాపం వీరిపై పని చేయడం లేదు.

**అనారోగ్య సమస్య**

గీత కార్మికుడు ఎంతో సాహసంతో కష్టనష్టాల కోర్చి పనిచేసినా ఫలితం దక్కక అనారోగ్యం చవిచూడాల్సి వస్తోంది. ఊపిరితిత్తుల వ్యాధులు, టిబి, హైడ్రోసిల్ (బీజం), చెట్టు పైనుండి పడే ప్రమాదాలు, ఎముకలు, నరాలు, కంటి సంబంధమైన జబ్బులు కలుగుతున్నవి. వీటిపై ప్రభుత్వం దృష్టి సారించాల్సి ఉంది.

## ఎల్లమ్మ పండుగ

ప్రకృతిపై ఆధారపడిన కొన్ని కులాలను పరిశీలిస్తే గొల్ల కురుమలు గొర్రె మేకల మేత కోసం, ముదిరాజులు పండ్లు ఫలాల కోసం, బెస్తలు చేపల పెంపకానికి నీటి వనరుల కోసం అడవులపై భారమేసి బతుకు సాగిస్తున్నారు. అలాగే గౌడవృత్తికి వనరులైన తాటి, ఈత చెట్ల రసాయనం తీయడానికి ఉపయోగపడుతున్నాయి. అందుకే ప్రకృతికి రుణపడి ఉన్నామనే భావనతో వారి మది నిండిపోయింది. పనిపాటలతో తమ సాంప్రదాయంలో భాగంగా పండుగలు, జాతరలు జరుగుతాయి.

గౌడ కులస్తులు పేదరాశి పెద్దమ్మ కథ, కాటమరాజు కథలు అక్కడక్కడ చెపుతుంటారు. ఎల్లమ్మకు మాత్రం ప్రతిసారి బోనాలు తీసినాక జాతర జరుగుతుంది. గ్రామాల్లో ఎల్లమ్మ ఆటలు ఆడుతారు. ఈ పండుగల సందర్భంగా ఈదుల్లు తాళ్ల దగ్గర శుద్ధి చేసి, చెట్లకు సున్నం జాజు పట్టీలు పెడుతారు.

చెట్లకు గీత గీసిన దగ్గర పురుగు దూరి లోపల గడ్డనంత తొలిస్తే దాని నివారణ కోసం చెట్టుకు కల్లు సాక బెట్టి ఎల్లమ్మ తల్లిని కొలుస్తారు. భక్తితో అలా చేస్తూనే, శాస్త్రీయంగా చెట్టుకున్న పురుగును వదిలించడానికి పువ్వు కాయలున్న వేపకొమ్మలు విరిచి చెట్టుకు కడుతారు. ఈ రకమైన వేప కొమ్మలు చెట్టుపై వేస్తే పురుగు తొలిగిపోతుంది.

**జిల్లాలో గీత పరిశ్రమ - ప్రభుత్వం**

జిల్లాలో ప్రభుత్వమందించిన లెక్కల ప్రకారం గీత పరిశ్రమ రెండు విధాలుగా కొనసాగుతుంది. ఒకటి గ్రామాల్లో టిఎఫ్‌టి లైసెన్స్‌దారులు నడుపుకొనే కల్లు దుకాణాలు, రెండవది గీతకార్మికులు సొసైటీగా ఏర్పడి ఆ సొసైటీ ఆధ్వర్యంలో నడిచే కల్లు దుకాణాలు పట్టణ, గ్రామాల్లో సైతం ఉంటాయి. ఇవే సొసైటీలు గ్రూపులు నడపడం అంటే ఒకే సొసైటి పేరిట వివిధ చోట్ల (బస్తీలలో) ఒకటవ నంబరు దుకాణం అలా వరుసగా ఎన్ని ఉంటే అన్ని నంబర్లతో కల్లు దుకాణాలుంటాయి. గ్రామాల్లో కూడా (వివిధ ప్రాంతాలు) ఊర్లతో ఒకే సొసైటీ కింద కల్లు దుకాణాలు కొనసాగుతుంటాయి. వీటికి సంబంధించిన అబ్కారి రెంటల్స్ దుకాణాల వారీగా వసూలు చేస్తారు.

**ప్రభుత్వ విధానం**

ప్రస్తుతం జీవో ఎం.ఎస్. నం. 767 ప్రకారం ప్రభుత్వ పాలసీ (విధానం) రూపొందించి 2004-2005 అబ్కారి చట్టం తేవడం జరిగింది. నాటి నైజాం అబ్కారి చట్టాన్నే కొనసాగించినారు. ఇంతకాలం మన ప్రభుత్వ విధానాలలో మార్పు రాలేదు. అదే అబ్కారి విధానం అమలైంది.

నేడు అబ్కారి వసూల్లు వ్యవసాయం తర్వాత స్థానంలో ఉన్నాయనడంలో సందేహం లేదు.

ఇందులో అమలులోకి రావలసిన అంశాలు పరిస్థితులకనుగుణంగా చేపట్టవలసి ఉంది. గీతకార్మికులు, వారి కుటుంబాలు ఆధారపడినందున గీత పరిశ్రమ వీరికి ప్రాధాన్యతను ఇచ్చి కాంట్రాక్టర్లకు అవకాశమివ్వరాదు. దీని చుట్టే మొత్తం అబ్కారి చట్టం అల్లుకొని ఉండాలి.

పూర్వం నుండి గీత పరిశ్రమను ఆదాయ వనరుగా భావించి గుత్తెదార్ల గుత్తాధిపత్యం అబ్కారిపై నడుస్తోంది.

గీత పరిశ్రమలో ముఖ్యంగా కొన్ని సమస్యలు నెలకొన్నాయి. సొసైటీ సభ్యత్వం, టిఎఫ్‌టి లైసెన్స్, వృద్ధాప్య పింఛన్, అబ్కారి దాడులు, చెట్ల పెంపకం వగైరా విషయాలున్నాయి. కల్లు వ్యాపారంలో గుత్తెదార్ల జాడ లేకుండా చేయడమే అబ్కారి విధానానికి కీలకమైంది. ఇది పోతే మిగతా సమస్యల పరిష్కారానికి మార్గం దొరుకుతుంది.

అబ్కారి విధానంలో పన్ను వసూలు చేయడంతో పాటు అవసరాల కొద్ది వనరులు కల్పించడం, చెట్ల పెంపకానికి కేటాయింపులుండాలి. గీత వృత్తికి నైపుణ్యం అందించడం, వాడుకునే పనిముట్లు, వసతులు ఏర్పరచడం జరిగినపుడే గీత పరిశ్రమకు పురోభివృద్ధి సాధ్యమవుతుంది. అలాగే గీత వృత్తిదారులకు ఆదాయాలు సమకూరుతాయి. □

**తాటి ఈత మట్టలతో అల్లిక**

గీత కార్మికులు కల్లు గీయడానికి ముందు తాటి ఈత చెట్లను సాపుచేసి, కల్లు గీయడానికి అనుగుణంగా గీత గీసేట్లు ఉండేందుకు కొన్ని మట్టలను కొట్టి వేస్తారు. ఈ రకంగా ఈత, తాటి మట్టలు పారేసినవి ఏరుకొచ్చి వాటిని చాపలు, బుట్టలు అల్లుతారు. ఈత కమ్మలతో చాపలు, తాటి కమ్మలతో బుట్టలు తయారీ చేసి అమ్ముకొంటారు. అలాగే ఈత బద్దలతో గంపలు కూడా చేస్తుంటారు.

తాటి మట్టలతో గ్రామాల్లో పేదలు తమ గుడిసె చుట్టూ దడిగట్టుకొంటారు. అలాగే గుడిసె పైకప్పు మీదికి ఉపయోగిస్తారు. వృథాగా పోయే వాటితో ఇంటికి పనికొచ్చే వస్తువులుగా మలచడం అనేది పనితనంగా చెప్పవలసి ఉంది. పిల్లలకు కూడా ఆట వస్తువులను చేసి వాడుతున్నారు. ఇలాంటి పనితో కొంత మంది బతుకు వెళ్లదీస్తున్నారు.

## పరిశోధనా ఫలాలు సమాజానికి అందజేయండి !

సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలలో మీరు ఎంతో పరిశోధన చేసి ఉంటారు. అధ్యాపకులుగా మీ విద్యార్థులకు ఎన్నో పరిశోధనలలో ప్రత్యక్ష పరోక్ష సహకారాలు అందిస్తూ ఉంటారు. అయితే సమాజానికి ఎంతో ఉపయోగపడాల్సిన పరిశోధనా పత్రాలు ఏ సెమినార్‌లోనో ప్రస్తావించి వదిలేస్తే సరిపోదు. మీ పరిశోధనా ఫలాలు తెలుగు సమాజంలో నలుగురికీ చేరాలి. కొత్త ఆలోచనలకు ప్రేరణ కావాలి, కొత్త మార్గాలను ఆవిష్కరించాలి. అందుకు మీకు వేదికగా నిలిచేందుకు వీక్షణం ముందుకు వస్తోంది. ఈ పత్రికకు ఎందరో మేధావులు, అధ్యాపకులు, ఆలోచనాపరులు చందాదారులుగా ఉన్నారు. తెలుగు సమాజం గర్వించదగ్గ పాత్రికేయులు, సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు, నిపుణులు అనేకుల రచనలు వీక్షణం ప్రచురిస్తోంది. రండి, ఈ బృహత్కార్యంలో మీరూ పాలుపంచుకోండి. మీరు చేసిన పరిశోధనా ఫలితాలను వీక్షణంలో ప్రకటించండి. తెలుగు ప్రజలకు ఆ అంశం ఆసక్తిగొల్పేదీ, ఉపయోగకరమైనదీ అని మీరు భావిస్తే చాలు. మీరే కాదు పి.ఎచ్.డి చేసిన, చేస్తున్న మీ విద్యార్థులు కూడా తమ పరిశోధనా పత్రాలను (ఒక వ్యాసరూపంలో) పంపవచ్చు. రచనతో పాటు దానికి సంబంధించిన చిత్రాలు, గణాంకాలు కూడా జతపరిస్తే మరీ మంచిది.

ఎంతో శ్రమించి మీరు చేస్తున్న పరిశోధనలు నలుగురికీ ఉపయోగపడేలా చేయండి.

వీక్షణం మీ రచనల కోసం ఎదురుచూస్తుంది ! మీదే ఆలస్యం !!

**రచనలు పంపాల్సిన చిరునామా :**

ఎడిటర్, వీక్షణం, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040-55843495

# పాపాల భైరవుడికి స్వాగత సత్కారాలా?

**| కొణతం దిలీప్ |**

**మితిమీరిన అహంకారం, అపరిమిత ధనదాహం, అంతులేని అధికార కాంక్షతో ప్రపంచాన్ని అగ్నిగుండంగా మార్చేస్తున్న అమెరికా అధ్యక్షుడు జార్జ్. డబ్ల్యూ. బుష్ త్వరలో మన రాష్ట్రానికి విచ్చేయనున్నారు. షరా మామూలుగానే రాష్ట్ర ప్రభుత్వం ఈ 'విశిష్ట' అతిథికి సర్వశక్తులు ఒడ్డి స్వాగత సత్కారాలు చేయనుంది.**

**గత ప్రభుత్వాధినేతను ప్రపంచబ్యాంకు జీతగాడని తిట్టిపోసిన వైయస్ కూడా అధికారంలోకి రాగానే ప్రపంచ బ్యాంకు అడుగులకు మడుగులొత్తడం ప్రారంభించాడు. ఇక ఇప్పుడు బుష్ దొర వారికి సాష్టాంగ నమస్కారం కూడా చేస్తే రాష్ట్ర ప్రభుత్వం లొంగుబాటు పరిపూర్ణమవుతుంది. అయినా దేశ ప్రధాని మన్మోహన్ సింగ్ అంతటి వాడే అమెరికాకు జీ హుజూర్ అనడం ఆరంభించాక వైయస్ మరోలా ప్రవర్తిస్తాడని అనుకోవడం కూడా అత్యాశే అవుతుంది. ప్రపంచ ప్రజల జీవితాలను దుర్భరం చేస్తున్న ఈ అంతర్జాతీయ టెర్రరిస్టుకు ఎర్ర తివాచీ పరచి స్వాగతం పలుకుతున్నారు మన నేతలు.**

**రెం**డో ప్రపంచ యుద్ధం చివరి రోజుల్లో జపాన్‌పై అమానవీయ అణుబాంబు దాడుల నుండి మొదలుకొని ఇటీవలి ఇరాన్ పై బెదిరింపుల వరకూ అమెరికా చేయని దుర్మార్గం లేదు. అమాయక పౌరులపై నిర్విచక్ష దాడులు, రసాయన, అణ్వాయుధాల వినియోగం, దేశాల్లో అశాంతిని ప్రేరేపించడం, టెర్రరిస్టులకు, నియంతలకు మద్దతివ్వడం, పౌర హక్కులను కాలరాయడం ఇలా ఎన్నో రకాల దుశ్చర్యలకు పాల్పడింది అమెరికా. అయితే సెప్టెంబర్ 11 దాడుల తర్వాత తను చేసే తప్పుడు పనులన్నిటికీ 'టెర్రరిజం పై యుద్ధం' అనే ముసుగు తగిలించి దానికి కొన్ని దేశాల మద్దతు సంపాదించాలని చూస్తోంది అగ్రరాజ్యం.

**ప్రపంచతంత్రం**



బహుళజాతి చమురు కంపెనీల్లో భాగస్వామ్యం కలిగి, అమెరికన్ సామ్రాజ్య వాదుల ఆకాంక్షలను నెరవేర్చేందుకు ఎటువంటి దుర్మార్గానికైనా వెనుదీయని అధ్యక్షుడు జార్జ్ బుష్ నేతృత్వంలో అమెరికా ఆగడాలకు అడ్డూ అదుపూ లేకుండా పోతోంది.

**ఆది నుంచీ వివాదమే**

నోట్లో వెండి చెంచాతో జన్మించిన జార్జ్ బుష్ జూనియర్‌ది మొదటి నుంచీ వక్రబుద్దే. ముప్ఫైఏళ్ల వయస్సులోనే తప్పతాగి కారు నడుపుతూ పోలీసులకు పట్టుబడ్డాడు. అర్బస్టో అనే ఇంధన కంపెనీ స్థాపించి పీకల్లోతు నష్టాల్లో కూరుకుపోయాడు. ఆ కంపెనీని 1984లో స్పెక్ట్రమ్ 7 అనే కంపెనీ తనలో విలీనం చేసుకుంది. కొన్నాళ్లకే ఈ కంపెనీ కూడా నష్టాల బారిన పడడంతో హార్కెన్ ఎనర్జీ అనే పెద్ద చమురు కంపెనీ స్పెక్ట్రమ్‌ను కొనేసింది. బుష్‌కు భారీ జీతమెచ్చి బోర్డు సభ్యుడిగా చేర్చుకుంది. బుష్ రాకతో హార్కెన్ దశ తిరిగింది. అనేక ఆయాచిత వరాలు వచ్చి ఆ కంపెనీ వళ్లో వాలాయి. కంపెనీ భారీ లాభాలు ఆర్జించింది. దీనికంతటికీ కారణం సీనియర్ జార్జ్ బుష్ అప్పుడు అమెరికా ఉపాధ్యక్షుడిగా ఉండటం వల్లనేనని అనేక మంది విశ్వాసం.

మొదటి గల్ఫ్ యుద్ధంలో తన తండ్రి సీనియర్ బుష్ సద్దాంను గద్దె దింపలేకపోయాడని ఆ పని తాను చేస్తానని అధ్యక్ష పదవి చేపట్టాక బహిరంగంగానే ప్రకటించుకున్నాడు జూనియర్ బుష్. సెప్టెంబర్ 11 దాడుల తరువాత టెర్రరిజంపై యుద్ధం అనే పేరుతో అటు అఫ్ఘానిస్తాన్, ఇటు ఇరాక్‌లపై దాడి చేసి వేలాదిమంది అమాయకుల ఊచకోతకు కారణమయ్యాడు. అన్ని అంతర్జాతీయ చట్టాలను ఉల్లంఘించి యుద్ధ ఖైదీలను ఇతర దేశాల్లోని చీకటి జైళ్లకు తరలించి, అక్కడ వారిని నానా రకాల చిత్రహింసల పాల్జేశాడు.

స్వేచ్ఛ, సమానత్వం, పౌరహక్కులు, నాగరికత అనే చిలక పలుకులు పలికే ఈ యుద్ధోన్మాది పాపాల చిట్టాలో ప్రముఖమైనవి ఇవీ -



## ఈ ప్రశ్నకు బదులేది?

సెప్టెంబర్ 11, 2001 నాడు అమెరికా గడ్డపై జరిగిన టెర్రరిస్టు దాడుల గురించి అమెరికా అధ్యక్షుడు జార్జ్ బుష్‌కు ఇంటలిజెన్స్ వర్గాల నుండి ముందే హెచ్చరిక అందిందనీ, అయినా ఆయన పట్టించుకోలేదని వార్తలు వెలువడ్డాయి. అంతే కాదు, సెప్టెంబర్ 11 దాడి తరువాత అనేక మంది సౌదీలను, బిన్‌లాడెన్ కుటుంబీకులను అమెరికా గడ్డపై నుండి హుటాహుటిన ప్రైవేటు జెట్ విమానాల్లో తరలించారని వానిటీ ఫెయిర్ అనే పత్రిక రాసింది. బిన్ లాడెన్‌ను ఎలాగైనా పట్టుకుని తీరతాం అని ఉత్తర కుమార ప్రగల్భాలు పలికిన బుష్ ఆ పని మధ్యలోనే వదిలేసి సద్దాం హుస్సేన్ పై ఎందుకు పడ్డారన్న ప్రశ్నకు ఏదీ జవాబు?

## ఆటవిక పోరు ఆగేదెన్నడు?



మాట వినని దేశాలపై బాంబుల వర్షం కురిపించి రక్తపుటేర్లు పారించడం అమెరికన్ అధ్యక్షులందరికీ అలవాటైన పనే. జూనియర్ బుష్ ఈ విద్యలో తన ముందు తరం నాయకుల కన్నా నాలుగాకులు ఎక్కువే చదివాడు. అసలే అభివృద్ధి లేక కునారిల్లుతున్న అఫ్ఘానిస్తాన్‌ను కార్పెట్ బాంబింగ్ చేసి మధ్య యుగాల స్థాయికి చేర్చాడు. నియంతను తుదముట్టిస్తానంటూ అబద్ధపు ఆరోపణలు చేసి అమాయక ఇరాకీల ప్రాణాలు బలిగొంటున్నాడు. చమురు కోసం జరుగుతున్న ఈ ఆటవిక పోరు ఆగేదెన్నడు?



## ఇదేనా స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే?

ఇరాక్, అఫ్ఘానిస్తాన్‌లపై యుద్ధంలో దొరికిన ఖైదీల పట్ల బుష్ నేతృత్వంలోని అమెరికన్ సైన్యం వ్యవహరిస్తున్న తీరు సభ్య సమాజం తలదించుకునేటట్టు చేస్తోంది. తమకు ఎదురు లేదనే కండకావరంతో అమెరికన్ సైనికులు ఇరాకీ, అఫ్ఘానిస్తాన్ ఖైదీలను చిత్రహింసలు పెడుతున్న రుజువులు లభిస్తున్నాయి. యుద్ధ ఖైదీల పట్ల ఎలా వ్యవహరించాలో చెప్పే జెనీవా ఒప్పందాన్ని నిర్లజ్జగా ఉల్లంఘిస్తోంది అమెరికా ప్రభుత్వం. ఇరాక్‌లోని అబూగ్రేబ్, క్యూబాలోని గ్వాంటనామో బే లో ఉన్న జైళ్లలో ఖైదీలను అమానవీయంగా చిత్రహింసలు పెడుతున్నారని ఇటీవల ఐక్యరాజ్యసమితి నివేదిక బైట పెట్టింది. సిఐఏ నేతృత్వంలో అనేక దేశాల్లో చీకటి జైళ్లు నడపబడుతున్నాయనీ, వీటిల్లో అనేక మంది అనుమానితులను విచారిస్తున్నారనీ కూడా సాక్ష్యాలతో నిరూపించాయి వార్తాప్రసార సాధనాలు. జార్జ్ బుష్‌గారు ప్రవచించే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఇదేనా?

## మనం చేస్తే ఒప్పు...



అణ్వాయుధాల విషయంలో ఇరాన్‌ను అనుమానించి, అవమానించి నిర్బంధం ప్రయోగించాలని చూస్తోన్న అమెరికా తన విషయం వచ్చేసరికి గురివింద గింజలా ప్రవర్తిస్తోంది. అణ్వాయుధాలతో దాడి చేసి లక్షల మంది అమాయక జపనీయులను నిర్దాక్షిణ్యంగా చంపింది అమెరికా. అసలు ప్రపంచంలో ఈ ఆయుధాలను వాడిన ఏకైక దేశం అమెరికాయే. తన దగ్గర గుట్టలు గుట్టలుగా పేరుకుపోయిన అణ్వాయుధాల విషయం మరచి పోయి ఇప్పుడు ఇరాన్‌పై రంకెలు వేయడం ఏ విధంగా భావ్యం? అయినా రోనాల్డ్ రీగన్ హయాంలో ఇరాన్‌కు ఇబ్బడి ముబ్బడిగా ఆయుధాలు అమ్మిన విషయం ఇప్పుడు గుర్తుకు రావట్లేదా ?



## అవధులు లేని ధ్వంస రచన

పర్యావరణ విధ్వంసాన్ని అడ్డుకొని భూగోళం వేడెక్కి పోకుండా నియంత్రించేందుకు ఉద్దేశించిన క్యోటో ప్రోటోకాల్ ఒప్పందంపై అమెరికా అధ్యక్షుడు జార్జ్ బుష్ సంతకం చేయడానికి నిరాకరిస్తున్నారు. తమ దేశ ఆర్థిక ప్రగతికి ఈ ఒప్పందం ప్రతిబంధకంగా మారుతుందని అతను నిర్మొహమాటంగా చెబుతున్నాడు. డబ్బు కోసం ఏ గడ్డి కరవడానికైనా అధ్యక్షుల వారు సిద్ధం! ❑

# క్లింటన్ దొర ఎందుకు వస్తున్నట్టు?

రాజవరం పార్థసారథి

ఒక దేశాధినేత మరో దేశాన్ని సందర్శించడంలో అసహజమైందీ, తప్పు పట్టవలసిందీ ఏమీ ఉండదు. అందులోనూ అతిథులకు తమ సంపదనూ, ఆస్తినీ, చివరికి కుటుంబ సభ్యులనూ కూడా ధారాదత్తం చేసేంత విశాల హృదయం ఉన్న భారతీయ సంస్కృతి ఏ అతిథి రాకనూ అసహజంగానో, అభ్యంతరకరంగానో చూడదు.

కాని అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ జరపనున్న భారత పర్యటనను (బహుశా ఆంధ్రప్రదేశ్ పర్యటనను) ఇంత యథాలాపంగా అంగీకరించడానికి వీలులేదు. బిల్ క్లింటన్, ఆయన ప్రాతినిధ్యం వహిస్తున్న అమెరికన్ పాలకవర్గాలు, బహుళజాతి సంస్థలు. ఏ నేపథ్యంలో ఇక్కడికి వస్తున్నాయో, ఏ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి, ఏ దోపిడీ వ్యాపారబంధాలు దృఢపరచుకోవడానికి క్లింటన్ పర్యటన జరగబోతోందో అర్థం చేసుకోవాలి. మన నల్లదొరలు ఈ తెల్లదొరల్ని ఇంత సాదరంగా, సాష్టాంగ ప్రణామాలతో ఆహ్వానించడం వెనుక కారణాలేమిటో, తెల్లదొరల్ని ఈ గడ్డ మీది నుంచి పారదోలిన వీరోచిత స్వాతంత్ర్య సమర స్ఫూర్తి ఐదు దశాబ్దాలలోపలే ఎందుకింతగా నీరుగారిపోయిందో విశ్లేషించుకోవాలి.

**పునరుక్తి**

బిల్‌క్లింటన్ ఒక వ్యక్తిగా భారత పర్యటనకు రావడం లేదు. అమెరికా అధ్యక్షుడిగా, అమెరికా పాలకవర్గాల ప్రతినిధిగా వస్తున్నాడు. అమెరికన్ పాలకవర్గాల రాజకీయార్థిక విధానాలను నిర్ణయించేవి బహుళజాతి సంస్థల ఆర్థిక ప్రయోజనాలు. ఆ ఆర్థిక ప్రయోజనాలను పెంపొందించే సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విధానాలను నయానో, భయానో ప్రపంచమంతటా విస్తరింపజేయడమే అమెరికన్ ప్రభుత్వ కార్యక్రమం. ఈ కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోవడానికి అమెరికన్ ప్రభుత్వం సైనిక చర్యలు, ఆయుధ ప్రదర్శనలతో సహా చెయ్యని పనిలేదు. ఈ పనులను అమెరికన్ పాలకవర్గాలు, ప్రభుత్వం, స్వయంగా బిల్ క్లింటన్ ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ అమలు చేశారు. భారతదేశంలోనూ అమలు చేశారు, చేస్తున్నారు.

కనుక ఈ నేపథ్యంలో మన 'గౌరవనీయ అతిథి' ఏ దురాలోచనలతో, ఏ దూరాలోచనలను కొనసాగించడానికి మన ఇంటికి వస్తున్నాడో మనం తెలుసుకోవడం అవసరం. ఈ 'గౌరవ అతిథి' మన మిత్రులైన ఇతర మూడో ప్రపంచ దేశాల ప్రజలతో ఎట్లా వ్యవహరించాడో కూడా తెలుసుకోవడం అవసరం.

అమెరికన్ ఆర్థిక విధానాలు ప్రపంచ దేశాలన్నిటిలోనూ తమ ఆర్థిక వ్యవస్థకు, తమ బహుళజాతి సంస్థలకు అనుకూలమైన విధానాలను అమలు చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. దాదాపుగా రెండో ప్రపంచ యుద్ధం తర్వాత నుంచీ అమలవుతున్న ఈ విధానాలకు వాహికలుగా ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, గాట్ (ప్రస్తుతం ప్రపంచ వాణిజ్య సంస్థ) వంటి అంతర్జాతీయ, ప్రాంతీయ ద్రవ్య, ఆర్థిక సంస్థలను అమెరికన్ పాలకవర్గాలు వాడుకుంటున్నాయి. ముఖ్యంగా మూడో ప్రపంచదేశాల పేద ప్రజానీకం మీద దాడిచేస్తున్న ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలు, వ్యవస్థాత్మక సంస్కరణ కార్యక్రమాలు అమెరికన్ పాలకవర్గాల చలవే. మూడో ప్రపంచ దేశాలను, పేదదేశాలను తమమీద ఆధారపడి ఉండేలా చేయడానికి వ్యాపారం, సహాయం, రుణాలు, రుణనిర్వహణ, ప్రచ్ఛన్న సైన్యాలు, సాంకేతిక యుద్ధాలు, అంతర్జాతీయ "న్యాయ" చట్టాల వంటి ఎన్నో మార్గాలను ఈ అమెరికన్ పాలకవర్గాలు వాడుకుంటున్నాయి. మూడో ప్రపంచ దేశాలలో స్వతంత్ర పారిశ్రామిక, ఆర్థిక వ్యవస్థలు రూపొందకుండా, తమకు దళారీలుగా మాత్రమే ఉండి, తమకు ముడిసరుకులు సమకూర్చి పెట్టే, తమ సరుకులు అమ్మి పెట్టే స్థానిక పాలకవర్గాలను ఈ అమెరికన్ పాలకవర్గాలు, బహుళజాతి సంస్థలు తయారుచేస్తున్నాయి. మొదట పారిశ్రామిక సరుకులతో, పారిశ్రామిక రంగంలో ప్రారంభమైన ఈ కుట్ర సేవారంగాన్ని ఆక్రమించుకుని, ఇప్పుడిప్పుడు వ్యవసాయ రంగంలోకి కూడా ప్రవేశిస్తోంది.

భారత ఆర్థిక వ్యవస్థను, మన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పరిశీలించినప్పుడు ఈ అమెరికన్ ఆర్థిక ప్రయోజనాల విస్తరణ 1950ల నుంచే ఉన్నప్పటికీ 1991 నూతన ఆర్థిక విధానాల తర్వాత ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోయింది. ఇవాళ మన జీవన రంగాలలో అమెరికన్ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు లేని రంగం ఒక్కటి కూడా లేదంటే అతిశయోక్తి కాదు. మారుమూల పల్లెల్లోకి విస్తరిస్తున్న వినియోగదారీ సంస్కృతి నుంచి దేశరక్షణ రంగంలోకి విస్తరించిన అత్యాధునిక యుద్ధ సాంకేతిక విజ్ఞానం దాకా అమెరికన్, బహుళజాతి సంస్థల కబంధ హస్తాలు ఈ దేశం నలుమూలలకు పాకిపోయాయి. ఈ దేశ ప్రజల రక్తమాంసాలను పీల్చివేసి, ముడిసరుకులను కొల్లగొట్టుకుపోయే దోపిడీ పీడనల విషవలయపు సాలెగూడు అంతటా అల్లుకునిపోయింది.

1991 నూతన ఆర్థిక విధానాల ప్రకటన నాటినుంచీ ఈ దేశంలోని అన్ని రాజకీయార్థిక విధానాలను, సామాజిక విధానాలను, పాలనా పద్ధతులను, సంస్కృతిని పెట్టుబడిదారీ వినియోగ సంస్కృతి, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ప్రపంచబ్యాంకు - అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ - ప్రపంచ వాణిజ్య సంస్థ త్రయం నిర్దేశిస్తున్నాయి. చివరికి నిన్నటికి నిన్న పార్లమెంట్ ఉభయ

సభలను ఉద్దేశించి రాష్ట్రపతి చేసిన (కేంద్ర ప్రభుత్వం తయారుచేసిన) ప్రసంగంలో ప్రపంచబ్యాంకు నివేదికలలోంచి వాక్యాలకు వాక్యాలు యథాతథంగా దొర్లాయని పత్రికలు రాస్తున్నాయంటే మన పరాధీనత ఎంతదూరం వచ్చిందో అర్థం చేసుకోవచ్చు.

ఈ పరాధీనత ఏదో మన పాలకుల బానిసత్వం వల్ల మాత్రమే వచ్చింది కాదు. మన పాలకులు ఏ ప్రయోజనాలను ఆశించి ఈ పరాధీనతలోకి వెళ్లిపోయారో తర్వాత చూద్దాంగానీ, అన్ని ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలను, సంపన్నమైన ముడిసరుకులు ఉన్న దేశాలను, ఈ విధంగా తమ పాదాక్రాంతం చేసుకోవాలని అమెరికన్ పాలకవర్గాలు ఉద్దేశపూర్వకంగానే పకడ్బందీ విధానాలు తయారు చేసుకున్నాయి.

అమెరికన్ ప్రభుత్వంలో అత్యున్నత అధికారి, స్టేట్ డిపార్ట్‌మెంట్ (అంటే విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ) విధాన నిర్ణయశాఖాధిపతి జార్జ్ కెన్నన్ 1948 ఫిబ్రవరిలో పిపిఎస్-23 అనే రహస్య ప్రణాళికా పత్రం తయారుచేశాడు. "ప్రపంచ సంపదలో సగం మన దగ్గరే ఉంది. కాని ప్రపంచ జనాభాలో మనం 6.3 శాతం మాత్రమే. అందువల్ల ఈ పరిస్థితిలో మన పట్ల ఇతరులకు అసూయా ద్వేషాలు కలిగే అవకాశం ఉంది. రానున్న రోజుల్లో మన నిజమైన కర్తవ్యమేమంటే, ఈ అసమానతా స్థితిని కొనసాగించడానికి మనకు వీలుకల్పించే సంబంధ బాంధవ్యాలను కనిపెట్టడమే... మానవ హక్కులు, జీవన ప్రమాణాలను మెరుగుపరచడం, ప్రజాస్వామికీకరణ వంటి అస్పష్ట, అవాస్తవ లక్ష్యాల గురించి మాట్లాడడం మనం మానుకోవాలి" అని ఆ పత్రం స్పష్టంగానే ప్రకటించింది.

ఆ అధికారే, దాదాపు అదే సమయంలోనే అమెరికా ప్రభుత్వ విధానాలను లాటిన్ అమెరికన్ రాయబారులకు వివరిస్తూ, "ఆయా ప్రాంతాల్లో ఉన్న మన ముడిసరకులను కాపాడుకోవడం అమెరికన్ ప్రభుత్వ లక్ష్యాలలో ఒకటి" అని కూడా అన్నాడు.

ఆ లక్ష్యాల కోసమే అమెరికన్ ప్రభుత్వం, పాలకవర్గాలు, బహుళజాతి సంస్థలు అన్నిదేశాల ప్రభుత్వాల మీద కొన్ని రాజకీయార్థిక విధానాలను రుద్దాయి. ఆ సాంకేతిక, మార్కెటింగ్, ఆర్థిక పరాధీన విధానాలను బలోపేతం చేయడంకోసం స్థానిక దళారీ పాలకులను మచ్చిక చేసి వారిమీద రాజకీయ ప్రభావాన్ని రుద్దడానికి ప్రయత్నం జరిగింది. 1953లోనే జాన్‌గాలాఘర్, రోనాల్డ్ రాబిన్సన్ ప్రకటించిన ఒకపత్రం ఈ రాజకీయ ప్రభావాన్ని కూడా నిర్దేశించింది.

"ఒక పేద దేశపు ఆర్థిక వ్యవస్థ విదేశీ వాణిజ్యంపై ఆధారపడగానే, ఆ వాణిజ్యం వల్ల బాగుపడిన స్థానిక వర్గాలు, ఆ వాణిజ్యానికి అనుకూలంగా రాజకీయ కార్యాచరణ ప్రారంభిస్తాయి" అని ఆ పత్రం రాసింది. తద్వారా మూడో ప్రపంచ దేశాల పాలకవర్గాల్లో ఒక భాగం విజాతీకరించబడుతుందని, వీరు విదేశీయులకోసం, విదేశీ ప్రయోజనాలకోసం పనిచేయడం ప్రారంభించి, విదేశీ సంస్కృతిని అలవరచుకుంటారని, తమ సొంత సంస్కృతిని చిన్నచూపు చూస్తారని ఆ పత్రం రాసింది. అందువల్ల స్థానిక మార్కెట్లలో ఉన్నత వర్గాలు స్థానిక సరకులను కొనడం మానివేసి, ఆకర్షణీయమైన, విదేశీ, దిగుమతి సరకులను కొంటారని, తద్వారా స్థానిక పరిశ్రమలు దెబ్బతింటాయని, దిగుమతులు పెరిగిపోయి, చెల్లింపుల లోటు సమస్యలు పెరిగిపోయి, రుణభారం పెరిగిపోయి పరాధీనత మరింత పెరుగుతుందని ఆ పత్రం రాసింది.

నిజానికి ఆ తర్వాత గడచిన యాభై సంవత్సరాలలో ఈ విధానాల అమలు ప్రతి దేశంలోనూ, ప్రతి రంగంలోనూ గమనించవచ్చు. 1952లోనే 'భారతదేశంపై అమెరికా నీడ' అనే పుస్తకానికి ముందుమాట రాస్తూ జాతీయ ఆర్థికవేత్త జె.సి. కుమారప్ప భారతదేశంపై బ్రిటన్ దోపిడీకి, అమెరికా దోపిడీకి తేడాను వివరించారు. బ్రిటన్ పార్లమెంటరీ ప్రజాస్వామిక సంప్రదాయం నుంచి వలసవాదంలోకి వచ్చింది గనుక దోపిడీతో పాటే విద్య, పారిశ్రామికీకరణ, రైలు మార్గాల వంటి మంచి పనులు కూడా చేసిందని, కాని అమెరికా, బానిసత్వ సంప్రదాయం నుంచి భారతదేశంలోకి ఆర్థిక ప్రయోజనాలకోసం ప్రవేశిస్తోంది గనుక బానిసత్వం తప్ప మరేమీ అమలు చేయదని ఆయన అన్నారు.

నిజంగా అమెరికన్ పాలకవర్గాలు గత యాభై సంవత్సరాలుగా సమర్థించిందీ, ప్రోత్సాహమిచ్చిందీ ప్రపంచవ్యాప్తంగా నిరంకుశ, సైనిక పాలకులకేననీ, లేదా ఆ ఆర్థిక విధానాలను ప్రారంభించిన తర్వాత పార్లమెంటరీ ప్రజాస్వామ్యాలు కూడా నియంతృత్వ పోకడలు పోయాయని చూపడానికి వందలాది ఉదాహరణలున్నాయి.

మూడో ప్రపంచంలో మానవ హక్కుల స్థితిపైన అమెరికా పెద్దఎత్తున ప్రతికూల ఫలితాన్ని వేసింది. అందువల్ల అమెరికాను మానవ హక్కుల ఉల్లంఘనను వ్యతిరేకించే ప్రపంచ నాయకురాలిగా కాక, మానవ హక్కుల ఉల్లంఘనకు మౌలిక వనరుగా చూడాల్సి ఉంటుంది అని అమెరికాలోని ప్రముఖ ఆర్థికవేత్త, ప్రచార సాధనాల విశ్లేషకుడు ఎడ్వర్డ్ ఎస్ హెర్మన్ అంటున్నారు.

బటిస్టా (క్యూబా), సొమోజా (నికరాగువా), పినోషెట్ (చిలీ), మార్కోస్ (ఫిలిప్పీన్స్), మొబుటు (జైరే), సుహార్తో (ఇండోనీషియా), మాన్లీ (జమైకా) వంటి డజన్ల కొద్దీ నియంతలను, ఎల్‌సాల్వడార్, బ్రెజిల్, మెక్సికో, అర్జెంటీనా, హోండురాస్, ఉత్తర వియత్నాం, బర్మా, పాకిస్తాన్, పనామా, హైతీ వంటి అనేక దేశాలలో నియంతృత్వ పోకడలను సమర్థించింది అమెరికన్ పాలక వర్గాలే. ఆయా ప్రభుత్వాలకు ఆర్థిక, సైనిక, నైతిక సహకారం అందించింది అమెరికన్ పాలకవర్గాలు. కేవలం తమ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ నమూనాను పాటిస్తే, దోపిడీ పీడనలను అంగీకరిస్తే, ప్రత్యామ్నాయ ప్రజానుకూల ఆర్థిక విధానాలను పాటించబోమని హామీ ఇస్తే ఎంత దుర్మార్గానికైనా ఆమోదం తెల్పినవి, సహకరించినవి అమెరికన్ పాలకవర్గాలు.

కనుక అమెరికన్ పాలకవర్గ విధానాలు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అర్థాలలో ప్రపంచ ప్రజలకు శత్రువులు. ఈ శత్రువుకు ఆతిథ్యం ఇవ్వడం ఎంత విజ్ఞతో ఎవరికి వారు తేల్చుకోవాలి.

# 'అభివృద్ధి'లో సమిధలవుతున్న కళింగనగర్ గిరిజనులు

**వి. నారాయణరెడ్డి**

ఒరిస్సా రాజధాని భువనేశ్వర్‌కు సుమారు 100 కిలోమీటర్ల దూరంలో కళింగనగర్ ప్రాంతం ఉంది. కళింగనగర్ జాజిపూర్ జిల్లాలో ఉంది. కళింగనగర్ ప్రాంతంలో ఎక్కువగా గిరిజనులు నివసించే ప్రాంతం. ఈ ప్రాంతంలో బాక్సైట్, క్రోమైట్, ఇనుప ఖనిజం నిక్షేపాలున్నాయి. ఈ కారణం వలనే బ్రిటిష్ వాళ్ల ఈ ప్రాంతంలో సర్వే - సెటిల్‌మెంట్స్ జరపలేదు. ఆ తర్వాత వచ్చిన 'స్వతంత్ర' పాలకులూ సర్వే - సెటిల్‌మెంట్స్ జరపలేదు. ఒరిస్సాలో 90 శాతం అటవీ భూములను సర్వే చేయలేదు. భూమి మీద ప్రజలకు గల హక్కులను నిర్ణయించలేదు. తరతరాలుగా గిరిజనులు అక్కడ భూమిని, అడవిని నమ్ముకొని జీవనం సాగిస్తున్నారన్న విషయం కఠోర వాస్తవం. ఇది అటవీ ప్రాంతం. కానీ ఇది అటవీ ప్రాంతమని ప్రభుత్వం డిక్లేర్ చేయలేదు. దేశంలో అన్ని ప్రాంతాలలో లాగే ఈ అటవీ ప్రాంతాన్ని గిరిజనేతరులు కొంత భాగాన్ని ఆక్రమించారు. గిరిజనులకు అధిక వడ్డీలకు అప్పులిచ్చి, అప్పులు తీర్చలేదన్న కారణంగా భూమిని ఆక్రమించారు. గిరిజనేతరులు తెలివితో తమ పేర్లను రెవెన్యూ రికార్డులలో నమోదు చేయించుకోగలిగారు. లేని డాక్యుమెంట్స్‌ను సృష్టించగలిగారు. అమాయకులైన గిరిజనులు తమ పేర్లను నమోదు చేయించుకోలేక పోయారు. భూసేకరణ చట్టం ద్వారా భూమిని ప్రభుత్వం తీసుకున్నప్పుడు గిరిజనేతరులు నష్ట పరిహారం పొందగలిగారు. రెవెన్యూ రికార్డులలో తమ పేర్లు లేని కారణంగా గిరిజనులకు నష్ట పరిహారం యివ్వాల్సిన అవసరం లేదని ప్రభుత్వ వాదన. అన్యాయాలు, అక్రమాలు సాగించిన గిరిజనేతరులు నష్టపరిహారం పొందగలిగారు. కాని ఆ భూమినే నమ్ముకొని తరతరాలుగా జీవనం సాగిస్తున్న గిరిజనులకు మాత్రం నష్టపరిహారం నిరాకరించబడుతోంది.

1992 సంవత్సరంలో పన్నెండు వేల ఎకరాల పొలాన్ని కళింగనగర్ ప్రాంతంలో భూసేకరణ చట్టం ద్వారా సేకరించినట్టు ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (ఐడిసిఓ) ప్రకటించింది. రెండు వేల ఎకరాల పొలాన్ని ఎకరాకు రు.3 లక్షల చొప్పున టిస్కో కంపెనీకి ఇచ్చింది. కొరియా సంస్థ పోహంగ్ స్టీల్ కంపెనీ (పోస్కో), ఆస్ట్రేలియన్ సంస్థ బి.హెచ్.పి, బిల్లిటన్ ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్, రియో టింటో మైనింగ్, జిందాల్, భూషణ్, స్వరాజ్‌పాల్ మొదలగు సంస్థలకు స్టీల్ ప్లాంట్స్ ఏర్పాటుకు, ఇనుము, బాక్సైట్ ఖనిజాల వెలికితీతకు ఒరిస్సా ప్రభుత్వం అనుమతినిచ్చింది. ఆ కాలంలో ఇనుము, ఉక్కు పరిశ్రమ సంక్షోభంలో ఉండటంతో పై కంపెనీలు కొన్ని ఫ్యాక్టరీలను ఏర్పాటు చేసుకున్నాయి, కొన్ని ఫ్యాక్టరీలు పెట్టి మూసి వేశాయి, కొన్ని ఇంతవరకు ఫ్యాక్టరీలను ఏర్పాటు చేయలేదు. ప్రస్తుతం ఇనుముకు డిమాండ్ పెరగడంతో పరిశ్రమల ఏర్పాటుకు పై కంపెనీలు ముందుకొచ్చాయి. పై కంపెనీలకు ప్రభుత్వం వందల నుండి వేల ఎకరాలను మార్కెట్ విలువకు అప్పగించింది. కళింగనగర్ ప్రాంతాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేసి నిరుద్యోగ సమస్యను పారద్రోలతానని ప్రభుత్వం అంటోంది. దీనిలో భాగంగా గత 13 నెలల కాలంలో 42 కంపెనీలకు పైగా బిజెడి నాయకుడు, ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ ఒప్పంద పత్రాలపై సంతకాలు చేశారు. 83 రెవెన్యూ గ్రామాలలో ఏభై వేల మంది గిరిజనులను ఖాళీ చేయించటానికి అక్కడి ప్రభుత్వం కంకణం కట్టుకొంది. ఈ ప్రాంతాన్ని 'స్టీల్ సిటీ ఆఫ్ ఇండియా'గా మార్చుతానని నవీన్ పట్నాయక్ అంటున్నారు.

ప్రాజెక్టుల వల్ల ఇంతవరకు ఒరిస్సాలో లక్షల కుటుంబాలు నిర్వాసితులైనారు. ఇచ్చామని చెప్పి చేతులు దులుపుకున్న సందర్భాలే కాని వారు కోల్పోయిన జీవన విధాన పునర్నిర్మాణానికి, వారి పునరావాసానికి ఒక విధానమంటూ రాష్ట్ర ప్రభుత్వానికి లేదు. నిజంగా పునరావాసంపై ప్రభుత్వానికి శ్రద్ధ ఉండి, ప్రస్తుతమున్న పరిస్థితుల కంటే మెరుగైన పరిస్థితులు ప్రభుత్వం కల్పిస్తుంది అన్న నమ్మకం ప్రజలలో కల్పించగలిగితే ప్రజలు సంతోషంగా తమ ప్రాంతాలను ఖాళీ చేసి వెళ్తారు. అలా మెరుగైన పరిస్థితులు కల్పించిన ఘటన గత 58 సంవత్సరాల చరిత్రలో లేదు. అందుకే పునరావాసం కంటే ఇప్పుడున్న పరిస్థితే మెరుగని ప్రజల ప్రగాఢ విశ్వాసం.

పాలకులకు తెలిసిందల్లా భూముల నుండి, గ్రామాల నుండి ఆదివాసులను తరిమివేసి బడా కంపెనీలకు కట్టబెట్టడమే.

**వర్తమానం**

---

1919లో భారతదేశానికి రాజ్యాంగం ప్రకటించి, దాని పనితీరును పర్యవేక్షించడానికి 1927లో సైమన్ ఈ దేశానికి వస్తే దేశం మొత్తం ఒక తాటిపై నిలిచి 'సైమన్ గోబ్యాక్' అన్నది. అంతకు ముందే వేల్స్ రాకుమారుడు ఈ దేశ పర్యటనకు వస్తే స్వాతంత్ర్యోద్యమం ఆయనను బహిష్కరించింది. సైమన్ గోబ్యాక్ ఆందోళనలో లాఠీఛార్జిలో గాయపడి లాలాలజపతిరాయ్ ప్రాణాలు వదిలారు. ఇవాళ తమ రాజకీయార్థిక విధానాలు సరిగా అమలవుతున్నాయో లేదో చూడడానికి వస్తున్న ప్రపంచ పోలీస్‌దొర క్లింటన్‌కు స్వాగతం పలకడానికి, ఎర్రతివాచీ పరవడానికి మనం మన వెన్నెముక వంచుకుని, ఇంకా ఎంత వెనక్కి వంగగలమా అని చూస్తున్నాం. ఏ చీకట్లకీ ప్రస్థానం? ❑

(ఆంధ్రప్రభ, ఫిబ్రవరి 25, 2000)

ఇదేమి న్యాయమని అడిగితే పాశవిక నిర్బంధకాండకు పాల్పడడమే.

రూర్కెలా ఉక్కు కంపెనీ కోసం 30,000 ఎకరాలను ప్రభుత్వం సేకరించింది. చుట్టూ ప్రహరీ నిర్మించారు. నిబంధనల ప్రకారం రెండు సంవత్సరాలలో కర్మాగారాన్ని నిర్మించి ప్రారంభించాలి. ఈ నాటికీ సగానికి పైగా పొలం నిరుపయోగంగా ఉంది. నిరుపయోగంగా ఉన్న పొలాన్ని తమకు తిరిగి ఇవ్వమన్నందుకు, ఉద్యోగాలు ఇవ్వమన్నందుకు లాఠీ దెబ్బలు తిన్నారు. ఈ రోజుకూ ఆందోళన కొనసాగుతూ ఉంది. హీరాకుడ్ డ్యాం నిర్మాణంలో పునరావాసం అడిగినందుకు ఆదివాసులు ప్రాణాలు కోల్పోయారు. కాశీపూర్‌లో వేదాంత స్టెరిలైట్ అన్న బహుళ జాతి కంపెనీ స్టీలు ప్లాంటు నిర్మాణానికి భూములిచ్చేది లేదన్నందుకు ముగ్గురు తుపాకి కాల్పుల్లో చనిపోయారు. గోపాల్‌పూర్‌లో టాటా కంపెనీ కోసం తమ విలువైన భూములు ఇవ్వనందుకు ఇద్దరు బలయ్యారు. కలహండి జిల్లా లాల్‌జీఘడ్‌లో వేదాంత గ్రూపు అల్యూమినా ప్లాంటును వ్యతిరేకించినందుకు ఇద్దరు ప్రాణాలు కోల్పోయారు. 100 గ్రామాలలో మూడు లక్షల మత్స్యకారులకు జీవనోపాధి లేకుండా చేసే విధంగా చిలికా సరస్సును టాటాలకు ధారాదత్తం చేయటాన్ని ప్రతిఘటించినందుకు లాఠీ దెబ్బలు తిన్నారు, జైళ్ల పాలయ్యారు. ఇప్పటికీ కోర్టుల చుట్టూ తిరుగుతున్నారు.

దేశవాళీ, బహుళజాతి కంపెనీలు ప్రభుత్వం నుండి అసలు విలువ కంటే చాలా తక్కువ రేటుకు భూములను పొందుతున్నాయి. భూమితో పాటు నీటిని, విద్యుత్‌చ్ఛక్తిని లాగుతున్నాయి. యంత్రాల దిగుమతిలో రాయితీలు సంపాదించగలుగుతున్నాయి. ఉద్యోగాలు కల్పిస్తామని కల్పించటం లేదు. స్టీలు తయారు చేస్తామని అగ్రిమెంట్‌లో అంగీకరించి పోత ఇనుమును తయారు చేస్తున్నాయి. తీసుకున్న భూమిలో కొంత భాగాన్ని ఇతర అవసరాలకు వాడుకుంటున్నాయి. ఒక్కొక్కసారి ఫ్యాక్టరీలను మూసి లిక్విడేషన్ పెట్టి పొలాలను రియల్ ఎస్టేట్స్‌కు అమ్ముతున్నాయి. బ్యాంకుల్లో తీసుకొన్న అప్పులను ఎగ్గొడుతున్నాయి. ఇవన్నీ ఉల్లంఘనలే. ఇన్ని రకాల ఉల్లంఘనలు చేస్తున్న కంపెనీలపై ఇప్పటి వరకు ఈ ప్రభుత్వం ఏ రకమైన చర్యా తీసుకోలేదు. అంతే కాదు వాళ్ల వైపే ప్రభుత్వం నిలబడుతూ ఉంది.

ఇప్పటి వరకు పోస్కో కంపెనీ కోసం ప్రభుత్వం, బ్యాంకులు రు.51,000 కోట్లు సమకూర్చాయి. అయితే భూములు కోల్పోయిన పేదలకు 50 లేదా 60 కోట్లు ఇవ్వ నిరాకరిస్తోన్నదని ఒరిస్సా కాంగ్రెసు నాయకులు ప్రకటించారు. ఎన్ని చట్టాలున్నా అమలు జరగనప్పుడు వాటి వలన ఉపయోగం లేదు. చట్టాలను అమలు పరచాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. ప్రభుత్వమే చట్టాలను ఉల్లంఘిస్తే ప్రజలకు రక్షణ ఏది? తమ జీవితాలను చిన్నాభిన్నం చేసే, దేశ ప్రయోజనాలను సామ్రాజ్యవాదులకు తాకట్టు పెట్టే ప్రభుత్వ విధానాలను ఎదిరించి పోరాడి వెనక్కు కొట్టిన అనుభవం ఒరిస్సా ప్రజలకుంది. ఇది జీవితానుభవం నుండి వారు నేర్చుకున్నది. అందువలన వారు పోరాట మార్గం చేపట్టారు. దేశాన్ని యుద్ధ జ్వాలల్లోకి లాగే ప్రమాదం గల బలియోపాల్ అణు క్షిపణి స్థావర నిర్మాణాన్ని (ఐసిబిఎం) ఒరిస్సా ప్రజలు పోరాడి నిలిపివేశారు. భారత ప్రజలకు విలువైన అనుభవాలనందించారు. ఈ రోజు భూములకు నష్ట పరిహారం ఇచ్చినా భూములు, గ్రామాలు ఖాళీ చేసే ప్రసక్తి లేదని కళింగనగర్ గిరిజనులు బీర్ భూమి దగ్గర ప్రతిజ్ఞ చేశారు. నెలరోజుల నుండి ఆ గ్రామాల్లో ప్రభుత్వ యంత్రాంగాన్ని అడ్డుకుంటున్నారు. పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. అభివృద్ధి అంటే ఎవరి అభివృద్ధో అందరూ ఆలోచించాల్సిన సమయం వచ్చింది. ❑

# కొత్త పుస్తకాలు







❖ మధురిమ - కవితా సంపుటి - కాంచనపల్లి రాజేందర్ రాజు, సాహితీ సమితి ప్రచురణ - 80 పేజీలు, 1/8 డెమీ, రు.50, ప్రతులకు : కె.వి.నర్సింహరాజు, 4-2-202, కొత్తూర్ వీధి, హన్మకొండ - 506 001.

❖ బాలుడి శిల్పం - Portrait of the artist as a child - కందుకూరి రమేష్‌బాబు, సామాన్యశాస్త్రం ప్రచురణ, 56 పేజీలు, 1/8 డెమీ, రు.10.

❖ గణితం అతడి వేళ్లమీది సంగీతం - కందుకూరి రమేష్‌బాబు, సామాన్యశాస్త్రం ప్రచురణ, 36 పేజీలు, 1/8 డెమీ, రు.10.

❖ **An expose:** 6 డిసెంబర్ 1992 - కందుకూరి రమేష్‌బాబు, సామాన్యశాస్త్రం ప్రచురణ, 48 పేజీలు, 1/8 డెమీ, రు.10.

ప్రతులకు: కందుకూరి రమేష్‌బాబు, 2-2-1123/1/ఎ, న్యూ నల్లకుంట, రైల్వేట్రాక్ వద్ద, శంకరమఠ్, హైదరాబాద్ - 500 044.

❖ జగ్‌నేకీ రాత్ - ముస్లిం కవిత్వం - స్కైబాబ, నసల్ కితాబ్‌ఘర్, 106 పేజీలు, 1/8 డెమీ, రు.35, ప్రతులకు : స్కైబాబ, కేశరాజుపల్లి, నల్లగొండ జిల్లా - 508 002.

❖ పర్యావరణం - పెట్టుబడిదారీ విధానం - ఆంగ్లమూలం : జాన్ బెలామి ఫాస్టర్, సంక్షిప్త స్వేచ్ఛానువాదం : రావు కృష్ణారావు, డా.పి.యస్.ప్రకాశరావు, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 84 పేజీలు, 1/8 డెమీ, రు.25,

ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి.రాధాకృష్ణమూర్తి, 5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు - 522 002.

❖ సర్వాంతర్యామి - కవిత్వం - ఆశారాజు, ఝరీ పొయెట్రీ సర్కిల్ ప్రచురణ, 72 పేజీలు, 1/8 డెమీ, రు.35, ప్రతులకు : ఝరీ పొయెట్రీ సర్కిల్, 16-2-740/75/40, వి.కె.ధాగెనగర్, గడ్డి అన్నారం, హైదరాబాద్.

❖ మంకమ్మతోట లేబర్ అడ్డా - కవిత్వం - అన్నవరం దేవేందర్, నూతన సాహితి ప్రచురణ, 138 పేజీలు, 1/8 డెమీ, రు.75, ప్రతులకు : అన్నవరం దేవేందర్, 9-5-14/, సప్తగిరి కాలనీ, కరీంనగర్, 505 001.

❖ ముద్దెర - తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వవాద సాహిత్య విమర్శ వ్యాసాలు - సం: ముదిగంటి సుజాతారెడ్డి - రోహణమ్ పబ్లికేషన్స్ ప్రచురణ. 102+vi పేజీలు, 1/8 డెమీ, రు.40, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❖ ఆత్మ చరితము - ఏడిదము సత్యవతి, అస్మిత రిసోర్స్ సెంటర్ ఫర్ విమెన్ ప్రచురణ - 62 పేజీలు, 1/8 డెమీ, రు.25, ప్రతులకు: అస్మిత, రిసోర్స్ సెంటర్ ఫర్ విమెన్, టీచర్స్ కాలనీ, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్.










# ఆంధ్రప్రదేశ్ : నాడు - నేడు

రాష్ట్రంలో పనిచేసే జనాభా వివరాలు

| విషయం | 1961 | | 1991 | | 2001 | |
|---|---|---|---|---|---|---|
| | పనిచేసే వారి సంఖ్య | శాతం | పనిచేసే వారి సంఖ్య | శాతం | పనిచేసే వారి సంఖ్య | శాతం |
| 1. వ్యవసాయదారులు | 74,86,819 | 40.1 | 78,91,167 | 27.74 | 73,97,688 | 25.47 |
| 2. వ్యవసాయ కూలీలు | 53,36,494 | 28.6 | 1,16,25,159 | 40.87 | 98,23,264 | 33.83 |
| 3. మైనింగ్, క్వారింగ్, లైవ్‌స్టార్, అడవులు, చేపల పెంపకం, వేట, మొక్కల పెంపకం, పండ్ల తోటలు, అనుబంధ పనులు | 5,60,958 | 3.0 | 7,49,823 | 2.67 | - | - |
| 4. కుటీర పరిశ్రమలు | 18,15,154 | 9.7 | 9,55,507 | 3.36 | 13,52,705 | 4.66 |
| 5. కుటీర పరిశ్రమేతర ఉత్పత్తిదారులు | 4,75,675 | 2.5 | 15,56,527 | 5.47 | - | - |
| 6. నిర్మాణం | 2,20,250 | 1.2 | 4,70,668 | 1.65 | - | - |
| 7. వ్యాపారం - వాణిజ్యం | 7,98,147 | 4.3 | 19,02,191 | 6.69 | - | - |
| 8. రవాణా, నిల్వలు, సమాచార వ్యవస్థ | 2,37,960 | 1.3 | 7,94,542 | 2.79 | - | - |
| 9. ఇతర సేవలు | 17,31,585 | 9.3 | 24,99,898 | 8.79 | 1,04,67,216 | 36.04 |
| | 1,86,63,042 | 100 | 2,84,45,482 | 100.03 | 3,48,93,859 | 100 |
| 10. మొత్తం జనాభా | 3.59 కోట్లు | | 6.65 కోట్లు | | 7.62 కోట్లు | |

దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న జనాభా వివరాలు (శాతంలో)

| సంవత్సరం | ఆంధ్రప్రదేశ్ | | | భారతదేశం | | |
|---|---|---|---|---|---|---|
| | గ్రామీణ | పట్టణ | మొత్తంగా | గ్రామీణ | పట్టణ | మొత్తంగా |
| 1973-74 | 48.41 | 50.61 | 48.86 | 56.44 | 49.01 | 54.88 |
| 1987-88 | 20.92 | 40.11 | 25.6 | 39.09 | 38.2 | 38.85 |
| 1999-2000 | 11.05 | 26.63 | 15.77 | 27.09 | 23.62 | 26.1 |

ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత రేటు (శాతంలో)

| | 1961 | 1971 | 1981 | 1991 | 2001 |
|---|---|---|---|---|---|
| పురుషులు | 30.2 | 33.2 | 39.3 | 55.1 | 70.3 |
| స్త్రీలు | 12.0 | 15.8 | 20.4 | 32.7 | 50.4 |
| మొత్తం | 21.2 | 24.6 | 29.9 | 44.1 | 60.5 |

# తెలుగు సమాజానికి

# వెలుగు దివ్వె

**విధానాల విశ్లేషణలు**

ప్రభుత్వ విధానాలు - వాటి పర్యవసానాలపై లోతైన విశ్లేషణలు

**క్షేత్ర నివేదికలు**

వివిధ పథకాల అమలుపై, ప్రజల జీవన స్థితిగతులపై సమగ్ర క్షేత్ర నివేదికలు




**వార్తా విశేషాల కదంబం**

ప్రధాన స్రవంతి పత్రికల్లో అరుదుగా కనిపించే జాతీయ, అంతర్జాతీయ కథనాలు

**అభివృద్ధి చర్చలు**

పోలవరం నుండి యురేనియం ప్రాజెక్టు వరకూ 'అభివృద్ధి'పై సవివరమైన చర్చలు



**ఆలోచింపజేసే గణాంకాలు**

మిమ్మల్ని కదిలించి, రగిలించే అరుదైన గణాంకాలు

**పదునైన వ్యాసాలు**

వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన వారి వ్యాసాలు, వ్యాఖ్యానాలు

**అధ్యాపకులు, అధికారులు, ఉద్యమకారులు, నేతలు, విద్యార్థులు, సామాన్య పాఠకులు**

**అందరికీ ఉపయోగపడే సమాచారాన్నిచ్చే సమగ్ర ఆర్థిక, సామాజిక మాసపత్రిక**

విడి ప్రతి: రు. 10/- సంవత్సర చందా: రు. 120/-

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా

# వీక్షణం

ఆర్థిక, సామాజిక మాస పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫోన్, ఫాక్స్ : 040 - 55843495

